

పాటకు శృతి,లయ
తల్లి-తండ్రి అయితే
మాధుర్యం...ఆత్మ!!
మ్యూజిక్ జర్నలిస్ట్ రాజా
సంపాదకత్వంలో వస్తున్న
'హాసం' హాస్య-సంగీత పత్రిక
లయతప్పని శృతితో
మాధుర్యాన్ని పంచుతూ
ఎందరెందరో సంగీత కళాకారుల
సేవలను ప్రజలకు
చేరవేయడంలో
వారధిలా నిలుస్తుందని
ఆశిస్తూ...

**చక్రి**

సంగీత దర్శకుడు



# ఇవే సంగతులు

## హాస్యం సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
**డాడీ, ముత్యం**
సినిమా పాటలపుస్తకాలు
'సెంటర్ స్ప్రెడ్'లో

'హాసం' పాఠకుల కోసం
ప్రముఖ రచయిత **దివాకరబాబు**
ప్రత్యేక రచన **'హా... హా!'**
వచ్చే సంచికలో...

గత సంచికలోని "యస్వీ. కృష్ణారెడ్డిలా ఊహించండి చూద్దాం" క్విజ్ ఫలితాలు, పరుచూరి గోపాలకృష్ణ కామెడీ కథపై పాఠకుల స్పందన, ఫలితాలు వచ్చే సంచికలో...

ముఖచిత్రం: వెంకటేష్ ('నువ్వు నాకు నచ్చావ్' చిత్రం నుండి) కవర్ డిజైన్ :ఈరంకి



# ప్రియ జనవాక్యం

కొత్త పత్రికలు చాలా వస్తున్నాయి
వచ్చిన పత్రికల్లో చాలా
'పత్రికలకు ఇవి కాని రోజుల'ని
రుజువు చేస్తున్నాయి.
'హాసం' అలా కాదు
ఈనాటి పాఠకుల నాడి తెలిసిన
పత్రికగా కనిపిస్తోంది

-కాళీపట్నం రామారావు,
శ్రీకాకుళం

మేరానామ్‌జోకర్‌లో "కెహతాహై జోకర్... సారాజమానా" పాటలో .... నా జీవితమే హస్‌నా హసానా" అంటాడు రాజ్‌కపూర్. మన పత్రికని చదివిన వెంటనే గుర్తుకొచ్చింది ఆ పదమే.

దేవుడు కనిపించి 'నీ చిట్ట చివరి కోరిక ఏమిటీ" అని అడిగితే "కడుపుబ్బ నవ్వి చనిపోవాలని వుంది" అన్నాట్ట బీర్‌బల్. ఎందుకంటే - నవ్వించే వారి జీవితంలో చాలా విషాదాలుంటాయంటారు. ఈ 'హాసం' వెనుక మాత్రం విషాదం లేదు.. సంగీతం ఉంది. హేట్సాఫ్.

గుండెలోంచి కాకుండా పెదాల మీద నవ్వు అతికించుకుని... కళ్ళ జోళ్ళ వెనుక కఠినత్వాన్ని దాచుకుంటున్న ఈ రోజుల్లో... రాగాలని మరిచి కీ బోర్డు తాళాల మీద, సంగీతం నర్తిస్తున్న యీ రోజుల్లో ... 'మీ నవ్వుల విందు' బహు 'పసందు'గా ఉంది. మెగాస్టార్ ముఖచిత్రం మరో ఎస్సెట్.

ఎవరి గురించి చదువుకుంటే మనసు గాలిలో తేలిపోతుందో ఆ మల్లీశ్వరీయుడు 'కృష్ణశాస్త్రి' పాటల పరిమళం.... స్నేహానికన్న మిన్న లోకాన లేదురా' అని చాటిన 'బాపూ రమణీయం' 'మాస్టర్ డైలాగ్ రైటర్ పరుచూరి గోపాల కృష్ణగారి 'కామెడీయం" మా 'భరణి' మీటిన తెలుగువీణా, 'చిటారు కొమ్మన' జూక్ బాక్సీయం' సర్వజనబంధు, సాంగ్ పహిల్వాన్ - బాలూగారి 'పద సంపద', 'అమీన్ సయానీ జీ... బినాకా గీత్‌మాలా... 'సాక్షి' నాటక ప్రదర్శనం... వసంత గారి ఈలపాట పరిచయం.., ఉస్తాద్ అల్లా ఉద్దీన్ ఖాన్ గారి జీవిత సంగ్రహం... ఎన్నని చెప్పను' కొన్ని శీర్షికలు చదువుతుంటే వయసు 'పందేళ్ళు' తగ్గి... మరికొన్ని చదివేటప్పుడు మనస్సు 'వెయ్యేళ్ళు' పెరిగి... డోలలూగుతూ.... 'హాయి' తాగుతూ.... అద్భుతంగా... ఏదో.లోకంలో ఎక్కడో అర్ధరాత్రిలో వర్షం జోరున కురుస్తున్నప్పుడు చెట్టు కింద నిలబడి ముఖేష్ పాట పాడుకుంటున్న అనుభూతి... ఏ నీలి పర్వతపు నీడలోనో మత్తుగా జోగుతూ 'కనుపాటలు దాచుకున్న పరిచయాల పరిమళాన్ని' ఆస్వాదిస్తున్న ఆనందం.... ఒక్కటి మాత్రం నిజం....

పత్రిక చదివాక నా మనసుని మీతో పంచుకోవాలనే తపన...మీ హాస సముద్రంలో నేనూ ఓ చిరుబిందువు నవ్వాలనే ఆకాంక్ష.... ఉండనా మరి

ఈ 'హాసం పత్రిక' ఆనంద ఐశ్వర్యాలతో
వెయ్యేళ్ల వర్ధిల్లాలని ఆశీర్వదిస్తూ

మీ భువనచంద్ర
(సినీ గీత రచయిత)

పి.ఎస్: ఇది 'కొని' - 'చదివి' 'దాచు'కోవలసిన పత్రిక....! అందుకే 'చందా' చెక్కు ఈ ఉత్తరంతో పాటు పంపుతున్నాను. దయచేసి స్వీకరించండి. మరో మారు ఈ 'విందు' నందించి నందుకు కృతజ్ఞతలతో......

---

ఏ మ్యాగజైన్నయినా
చూసి బావుందనడం మర్యాద
చాలా బాగుందనడం ముఖస్తుతి
'నచ్చింది..... ప్రొసీడవ్వండి...
మీకు సక్సెస్ తప్పదు' అనటం అభిమానం
ఇవన్నీ ఒదిలేసి
నిజం చెప్పాలనుకుంటున్నాను
దేవుడి మీద ప్రమాణం చేసి
అంతా నిజమే చెప్తాను
అబద్ధం చెప్పను
యువర్ 'హాసం' ఈజ్
రియల్లీ, ట్రూత్‌ఫుల్లీ గుడ్
- నిజం చెప్పటంలోనే ఆనందం పొందే

సత్యానంద్
(సినీ కథ, సంభాషణల రచయిత)

"హాసం" ప్రథమ సంచికలో తణికెళ్ళ భరణి గారు మనసుకు హత్తుకునే విధంగా రచించిన "విశ్వకవిని ముగ్ధుణ్ణి చేసిన తెలుగు వైణికుడు" చదివి చాలా ఆనందాన్ని పొందాను. కీ॥శే॥ తుమరాడ సంగమేశ్వర శాస్త్రి గారు పిఠాపురం మహారాజా వారి సంస్థానంలో ఆస్థాన వైణిక విద్వాంసులు. టాగూరుతో సహా యింకా ఎంతో మంది ప్రముఖులు ఆయన వీణావాద్యాన్ని ఆస్వాదించి సమ్మోహితులైనారు. అడివి బాపిరాజుగారు వారి కచ్చేరి విని పరవశించి రచించిన "పలికిస్తివయ్యా నీ బంగారు వీణా - మీటిస్తివా వెలుగు మేళవించిన తంత్రి.... సంగమేశా! వీణ శబ్దించుమాలో" గేయాన్ని 1960 దశకంలో పాలగుమ్మి విశ్వనాథం గారు అభోగిరాగంలో బాణీ కూర్చగా ఆకాశవాణిలో నేనే పాడాను. మా తండ్రి శ్రీ రంగాచారిగారి జన్మస్థలం కూడా పిఠాపురమే కావడం చేత ఆయనకు శాస్త్రి గారి తోటి వారి కుటుంబం తోటి సాన్నిహిత్యం వుండేది. కాబట్టి నా చిన్నతనంలో శాస్త్రిగారి వీణ వినే భాగ్యం నాకు కూడా కలిగింది. శాస్త్రి గారి కుమారుడు కూడా తండ్రి అడుగు జాడలలోనే నడుస్తూ వీణ బాగా వాయించేవాడు. అమాయకుడైన అతనిని ఆ వూళ్ళో యువకులు ఆట పట్టిస్తూ ఎగతాళి చేస్తుండే వారు. దానితో క్రమేపి అతను మతి స్థిమితం కోల్పోయి పిచ్చి వాడుగా తిరుగుతూండేవాడు. మా నాన్నగారు హైదరాబాదులో స్థిర పడిన కొంతకాలానికి 1953 ప్రాంతంలో అతనిని యీ వూరుకు రప్పించి కొంతమంది విద్యార్థులను కుదిర్చి అతను వీణ నేర్పేటట్లుగా ఒప్పించి ఒక ఉపాధిని కల్పించే ప్రయత్నం చేశారు. కాని అతను కుదురుగా ఎక్కువ కాలం యిక్కడ వుండలేక తిరిగి పిఠాపురం వెళ్ళి పోయి కొన్నాళ్ళకే తనువు చాలించాడని తెలిసి చాలా బాధపడ్డాము మేమంతా. భరణి గారి వ్యాసం చదవగానే నా మస్తిష్కంలో యివన్నీ మెదలి నాకళ్ళు చెమర్చాయి.

ఎం.చిత్తరంజన్,
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు, గాయకుడు, స్వరకర్త

---

చాలా ఫ్రెష్‌గా
ఆరోగ్యకరమైన వైఖరితో
మనసునలరించేలా వుంది
సబ్జెక్ట్ హాస్యం - సంగీతం అయినా
డిగ్నిటీకి 'విజయచిత్ర'లా వుంది.
ఈ 'హాసం'....
ఆహ్వానించదగ్గ మధుమాసం!!

-సిరివెన్నెల' సీతారామశాస్త్రి
(సినీ గీత రచయిత)

సంపుటి :1 సంచిక: 2

15-31 అక్టోబరు 2001

పేజీలు : 68 వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూధన శర్మ**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య సంగీత పత్రిక 2

మా తొలిసంచిక వెలువడింది. మేం ఆశించిన లక్ష్యం నెరవేరినట్టే అనిపిస్తోంది. చదివిన వారు చాలా రిలాక్స్డ్‌గా ఫీలయ్యారు. 'అన్నీ పేజీలు చదివించాయి'. 'హాయిగా, ఎక్కడికక్కడ చదివేట్టు ఉంది' ' పట్టుకెళ్లి మా ఇంట్లోవాళ్ళకిచ్చి చదవండి అని గర్వంగా చెప్పేట్టు ఉంది. 'ఈ సబ్జెక్ట్‌ల మీద ఇంత విస్తృత సమాచారం ఉందా!' 'హాస్యానికి ఇంత పెద్దపీట వేసి జనాలకు ఆహ్లాదం కూర్చి, ఒక రకంగా సమాజానికి సేవ చేస్తున్నారు'. 'కొత్త పత్రిక వస్తోందంటే ప్రసిద్ధ వీక్లీలకి మరో నకలు వస్తోందనుకున్నాం. డిఫరెంట్‌గా ఉన్నారు. అలాగే ఉండండి'. 'సంగీతం అంటే వినవలసినది కానీ చదవవలసినది కాదని అనుకునే మా బోటి వాళ్లకు కొత్తకోణాన్ని రుచి చూపించారు.' 'ఈనాటి పాటలను పట్టించుకోవడం మానేసిన మాకు ఇష్టపది ద్వారా ఇంత రాశారు. ఈ పాటేమిటో వినిచూద్దామనిపించారు'. 'అందరూ మర్చిపోయిన లలిత సంగీతాన్ని ఆదరించారు శభాష్'. 'హిందీ పాటల అర్థాలు చెప్పి ఎడ్యుకేట్ చేస్తున్నారు. థాంక్స్' 'సినిమా బిజినెస్‌ను గురించి చెప్పేందుకు పత్రికలు ఉన్నాయి కానీ దానితో ఇంచుమించు సరితూగగల ఆడియో మార్కెట్టుకు ఏదీ లేదు. మీరా లోటు తీర్చేట్టు కనబడుతోంది. గో ఎహెడ్!'

ఇలా అనేక వ్యాఖ్యలు వినబడ్డాయి. వినబడుతున్నాయి. ఇంచుమించుగా అందరూ వెలిబుచ్చిన కామన్ సందేహం ఒకటుంది. మరీ ప్రతి పదిహేను రోజులకీ ఇంత మంచి మేటరు ఇవ్వగలరా అని!? ఆ పూచీమాది. వినేవాళ్లుండాలే గానీ చెప్పేందుకు బోల్డంత ఉంది. చెప్పడానికి ఉబలాటపడే మహామహులు ఎందరో ముందుకొస్తున్నారు. మనదైన సంపద విలువను మనం తెలుసుకోవాలి, పంచుకోవాలి.

ఈ పత్రిక మీకు నచ్చితే మీకు నచ్చిన పదిమందికి చెప్పండి. ఎంత ఖర్చు పెట్టి ప్రచారాన్ని గుప్పించినా, ఆత్మీయుడైన వ్యక్తి చెప్పిన సలహాకు అది సాటిరాదు. 'ఇలా ఫలానా పత్రిక బాగుంది, నీకు నచ్చుతుందేమో' అని మీకు కావలసిన వారితో అని చూడండి. 'ఫలానా వారికి ఇలాటి ఇంట్రస్టు ఉంది. వారికి కాపీ పంపి చూడంది.' అని మాకు చెప్పండి. అభిరుచిగల వారిని మెప్పిస్తేనే కదా... మాకూ గౌరవం! టీవీని, అనేకానేక పత్రికలను దాటుకుని అటువంటి అభిరుచి కల వారిని చేరుకోవాలంటే మీ సహకారం ముఖ్యం, ఎంతో అవసరం కూడా! మీ ద్వారా ఒకసారి వారిని చేరితే, రుచి చూపగలిగితే వారూ 'హాసం' పోషకులవుతారని మా ధీమా. మా బాధ్యత కూడా.

**అందుకే**

**కొనడం మీ వంతు! ఆకట్టు కొనడం మా వంతు!**






'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి రసః గాన గాన ఫణిః' అని చెబుతారు.

అంతేకాదు

సంగీతం అనేకరకాల మానసిక ఆందోళనలను పోగొట్టి స్వస్థత నిస్తుందని కూడా పరిశోధకులు అంటున్నారు. దీన్నే మ్యూజిక్ థెరపీ అంటారు. ఈ మ్యూజిక్ థెరపీకి ప్రపంచమంతటా నేడు చక్కటి ఆదరణ లభిస్తోంది.



డా॥ ఆర్.వి.రమణి

## ఆ రాగాలకున్న శక్తి అటువంటిది

# మ్యూజిక్ హీలింగ్

కోయంబత్తూర్‌లోని 'శంకర ఐ హాస్పిటల్' వారు మ్యూజిక్ థెరపీ ద్వారా రోగులకి స్వస్థత చేకూరుస్తున్నారు. క్లినిక్ ఆరంభం నుంచి అంటే ఎంట్రీ దగ్గర నుంచి కారిడార్ల వరకు... చివరకు... ఆపరేషన్ థియేటర్లో కూడా శ్రావ్యంగా శాస్త్రీయ సంగీతం వినిపిస్తుంటుంది.

సంగీతం వినడం వల్ల ఒత్తిడి, మనోవ్యాకులత, ఆందోళనలు తగ్గుతాయని హాస్పిటల్ యాజమాన్యం వారంటున్నారు.

గత పన్నెండు సంవత్సరాలుగా క్లినిక్‌లోని పేషెంట్లు మ్యూజిక్ థెరపీలో స్వస్థత పొందుతున్నారని ట్రస్టీలలో ఒకరైన డాక్టర్ ఆర్.వి.రమణి తెలియజేశారు.

స్వామి చిన్మయానంద సూచన మేరకు మ్యూజిక్ థెరపీని ఆరంభించినట్టు చెప్పారాయన. స్వామి గణపతి సచ్చిదానంద కూడా పలుమార్లు అనేక సందర్భాలలో సంగీతానికున్న హీలింగ్ పవర్ గురించి తెలిపారని ఈ సందర్భంగా రమణి గుర్తుచేశారు.

ఈ హాస్పిటల్లో రోజుకి దాదాపు 150-200 వరకు ఉచిత కంటి శస్త్ర చికిత్సలు జరుపుతారు. ఆపరేషన్ సమయంలో కూడా కర్ణాటక సంగీతం మంద్రంగా వినిపిస్తుంటుంది.



కోయంబత్తూర్‌లోని 'శంకర ఐ హాస్పిటల్'

**ఈ ఆస్పత్రిలో ప్రధాన శస్త్ర చికిత్సలు జరిపే జానకీరామన్ మాట్లాడుతూ నీలాంబరి, యదుకుల కాంభోజి రాగాలకు రోగాలను నయం చేసే శక్తి ఉందన్నారు. అలాగే త్యాగరాజకృతులతోపాటు ముత్తుస్వామి, శ్యామశాస్త్రి విరచిత కీర్తనలు ఇక్కడ ప్రధానంగా వినిపిస్తుంటాయని వివరించారు.**

ఇలా అన్ని ఆస్పత్రుల లోనూ ఆరంభిస్తే బాగుంటుంది కదూ...!?

### ఇక మ్యూజిక్ థెరపీలో రకాలు.....

**పాటలు పాడటం.....**

పాటలు పాడటానికి సంగీతంలో పండితులై ఉండక్కర్లేదు. ఎవరికి తోచిన విధంగా వారు పాడుకోవచ్చు. లేదా టేప్ ఆన్ చేసి దాంతో గొంతుకలిపి పాడచ్చు. ఇలా చెయ్యడం వల్ల శ్వాసకు సంబంధించిన వ్యాధుల నుంచి ఉపశమనం లభిస్తుంది. అలాగే ఉచ్చారణ కూడా స్పష్టమవుతుంది.

**వాయిద్యాలు.....**

వీణ, వయొలిన్ వంటి సంగీత వాయిద్యాల వాదన వల్ల నరాలు బలోపేతమవుతాయి. ముఖ్యంగా శారీరక లోపంతో బాధపడే వారికి, నరాల బలహీనతకు లోనైన వారికి చిన్నప్పటి నుంచి



ఈ కుర్రాడి పేరు మైఖేల్. పుట్టగానే తల్లిని మింగాడన్న మూఢ నమ్మకంతో ఆ గ్రామంలోని ప్రజలు కళ్ళలో యాసిడ్ పోసి ఇతణ్ణి గుడ్డివాడిగా చేశారు. శంకర ఐ హాస్పిటల్ చెందిన వలంటీర్ జెన్నిఫర్ ఈ కుర్రాణ్ణి వెల్లూర్‌కి చెందిన ఓ అనాథాశ్రమంలో చూసింది.

ఒక కంటికి చూపు వచ్చే అవకాశం పూర్తిగా లేదు. రెండో కన్ను విషయంలో కొంత ఆశ మినుకు మినుకుమంటూ ఉంది. భగవంతుని మీద భారం వేసి ఆపరేషన్ మొదలు పెట్టారు. కొద్దిరోజుల తర్వాత, కళ్ళకున్న బ్యాండేజి తియ్యగానే చూపువచ్చిన ఆ కుర్రాడు తన చేతి వేళ్ళను తనకళ్ళ ముందు పెట్టుకుని ఆడిస్తూ వుంటే హాస్పిటల్ స్టాఫ్ పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.

"కోట్లు కుమ్మరించినా కలగని సంతృప్తి అది" అని అంటారు వారు ఈ ప్రస్తావన వచ్చినప్పుడు.

ఏదో ఒక ఇన్‌స్ట్రుమెంట్‌లో శిక్షణ ఇవ్వడం మంచిది.

### సంగీతం వినడం.....

దీనివల్ల మానసిక వ్యాకులత, ఆందోళన తగ్గుతాయి. ఉత్సాహం వస్తుంది. మ్యూజిక్ వింటూ యాక్టివ్‌గా పని చేసుకోవచ్చు.

ఇవికాక మ్యూజిక్ కంపోజింగ్ కూడా ట్రై చేయచ్చు.

### సంగీతం ఎలా వినాలి?

మ్యూజిక్ థెరపీ అన్నారు కదా అని ఇష్టం వచ్చినట్టు వినడం కాదు. ఇందుకోసం కొన్ని ప్రత్యేక రాగాలను ఎన్నుకోవాలి. లేదంటే ఇతర వైద్య విధానాలలో వలె దీనిలో కూడా నెగటివ్ ఎఫెక్ట్స్ ఎదురవుతాయి.

**మ్యూజిక్ థెరపీకి ఎన్నుకునే సంగీతంలో వాయిద్యాల హోరు తక్కువగా ఉండాలి. సంగీతం హృదయ తంత్రుల్ని మీటాలి. కొంచెం ఆధ్యాత్మికత ఉంటే మంచిది. అందుకే త్యాగరాజు, ముత్తుస్వామి కృతులకి ఈ శంకర్ ఐ హాస్పిటల్‌లో ఎక్కువ ప్రాధాన్యత నిస్తున్నారు.**

### డాక్టరేట్

జైపూర్‌కి చెందిన అన్నూమాథుర్ కూడా సంగీతంలో రోగాలు నయం చేయవచ్చునే



శంకర ఐ హాస్పటల్‌లో ఆపరేషన్ దృశ్యం

సిద్ధాంతాన్ని సమర్పించి డాక్టరేట్ పొందారు.

ఇందుకుగాను ఆవిడ కొంతమంది మానసిక రోగులని ఎన్నుకుని రెండు గ్రూపులుగా విభజించారు. మందులు వాడే వారికన్నా క్రమం తప్పకుండా శాస్త్రీయ సంగీతాన్ని విన్నవారిలో స్వస్థత త్వరగా చేకూరింది.

ఫాస్ట్‌బీట్, పాశ్చాత్య సంగీతాల కన్నా శాస్త్రీయ సంగీతానికి మ్యూజిక్ థెరపిస్ట్‌లు పెద్దపీట వేస్తున్నారు. ఆ విధంగా తిరిగి మన శాస్త్రీయ సంగీతానికి పూర్వపు వైభవం లభించే అవకాశాలు కన్పిస్తున్నాయని చెప్పచ్చు.

**-ఆదెళ్ళ శివకుమార్.**

# సినాత్రా పాటలతో 'ఆపరేషన్' సక్సెస్



బ్రిటిష్ హాస్పిటల్‌లో ఒక పేషంట్ ఫ్రాంక్ సినాత్రా, డీన్ మార్టిన్ పాడిన పాటలు వింటూ మత్తుమందు అవసరం లేకుండా తన ఎడమ కాలుకు ఆపరేషన్ చేయించుకున్నాడు.

63 ఏళ్ళ వయసుగల పీటర్ ఒఙొర్మన్‌కి ఎడమ మోకాలు దగ్గర ఒక గడ్డ పుట్టింది. ఆపరేషన్ చేయకపోతే చాలా ప్రమాదం అని చెప్పారు. అప్పటికే అతను హార్ట్ పేషెంట్ కావటంతో ఆపరేషన్ అంటే భయపడ్డాడు. అనస్థీయా ఇవ్వలేని పరిస్థితి ఆపరేషన్ రాయల్ ఓల్డ్ హామ్ హాస్పిటల్‌లో సుమారు 90 నిమిషాలపాటు జరిగింది. ఆపరేషన్ విజయ వంతమయ్యాక అంతవరకు తనను భయపెట్టిన 'ఫియర్ కాంప్లెక్స్' అసలు తన మనస్సులోకి రాకపోవటంతో అతను విపరీతమైన ఆశ్చర్యానందాలకు లోనయ్యాడు. ఇంతకీ అసలేం జరిగిందంటే ఆపరేషన్ టైములో, ఆ హాస్పిటల్‌లో గల రేడియో నుండి సినాత్రా, డీన్ మార్టిన్ పాడిన పాటలు వస్తున్నాయి. వినసొంపైన ఆ పాటలు అతనిపై మత్తుమందులా పని చేసాయి. తను ప్రాణాలతో బయట పడ్డానికి ఆ పాటలే కారణమయ్యాయని, ఆ పాటలే భయం నుండి తన మనసును మళ్ళించాయని, "సన్" అనే పత్రికలో పేర్కొన్నాడు పీటర్ ఒఙొర్మన్.



# గుడు గుడు గుంచం



## జనార్దన మహర్షి

అతని పేరు సత్యనారాయణ
నిన్నటి వరకూ బాగానే ఉన్నాడు. పాపం
ఇప్పుడు ఓ పెద్ద సమస్యతో గింజుకుంటున్నాడు
ఇంతకీ అతనికొచ్చిన కష్టం ఏంటంటే....

శుక్రవారం ఉదయం పదిగంటలకి
పెళ్ళి చూపుల్లో అతను సుబ్బలక్ష్మిని చూశాడు - బాగా నచ్చింది
ఎత్తు, రంగు, చదువు, ఫ్యామిలీ బ్యాక్‌గ్రౌండ్ - చివరికి కట్నం....
దాంతో సుబ్బలక్ష్మిని పెళ్ళి చేసుకోవాలనే అనుకున్నాడు
ఆ డెసిషన్‌ని స్ట్రాంగ్‌గా తీసుకుంటే.... అసలు అతనికి సమస్య వచ్చేది కాదు.

అదే శుక్రవారం సాయంత్రం నాలుగింటికి
ఇంకో సంబంధం చూశాడు
పేరు రాధిక
ఎత్తు, రంగు, చదువు, ఫ్యామిలీ బ్యాక్‌గ్రౌండ్
చివరికి కట్నంతో సహా... సుబ్బలక్ష్మికి ఏ మాత్రం తీసిపోకుండా ఉంది.

ఇప్పుడొచ్చింది సమస్య
సుబ్బలక్ష్మా?
రాధికా?
భారతదేశంలో పుట్టిన నేరానికి అతను వాళ్ళిద్దర్లో
ఒకరినే పెళ్ళి చేసుకోగలడు.
కానీ సమస్య ఏంటంటే... ఇద్దరూ నచ్చారు.
ఇద్దర్నీ పెళ్ళి చేసుకొంటే.... తన్నులు తథ్యమని తెలుసు.
దాంతో....
సుబ్బలక్ష్మా?.... రాధికా?
ఎవర్ని చేసుకోవాలి, ఏ రాయితో పళ్ళు రాల గొట్టుకోవాలనే
కన్‌ఫ్యూజన్‌లో రాత్రి నిద్రపోవడం కూడా మర్చిపోయాడు
అతని బ్యాడ్‌లక్ ఏమిటో....
ఇంటర్‌లోనూ ఇదే ప్రాబ్లమ్
ఎం.పి.సి.నా? .....సి.ఇ.సి. నా?
ఉద్యోగంలోనూ ఇదే ప్రాబ్లమ్
ఎల్.ఐ.సి.నా? .... ఎస్.బి.ఐ.నా?
మళ్ళీ ఇప్పుడు అదే ప్రాబ్లమ్

ఎలాగైనా సరే - ఇవాళ సాయంత్రం నాలుగు గంటలకల్లా ఓ నిర్ణయానికి రావాలనే.... నిర్ణయానికొచ్చాడోరోజు.
దాంతో తన జేబులో ఉన్న రూపాయి కాసు హెల్ప్ తీసుకుందామనుకున్నాడు.

బొమ్మయితే సుబ్బలక్ష్మి.... బొరుసైతే రాధిక
కాయిన్ పైకి విసిరేశాడు
అది వెళ్ళి.... రోడ్డుమీదున్న ముష్టివాడి సత్తు డబ్బాలో పడింది.
సత్యనారాయణ పరుగున వెళ్ళి ఆ ముష్టి వాడి డబ్బాలో చూస్తే నలభై రూపాయి కాయిన్స్ ఉన్నాయి.
ఇరవై బొమ్మ వైపు.... ఇరవై బొరుసువైపు పడున్నాయి.
అంటే ఇరవై బొమ్మలు.... ఇరవై బొరుసులు...
ఇలా ఆలోచిస్తు కూచుంటే 'ఇరవైలో అరవై వయసు ఎవరికైనా వచ్చేనా!?' అంటూ పాడుకోవలసి వస్తుందని
తెగించి... తనసొంత బుర్రని ఉపయోగించి



సొంత నిర్ణయం తీసుకున్నాడు..... దాంతో అతనికి....
రాధికతో పెళ్ళయ్యింది.

పదేళ్ళు కాపురం చేసాక.... అందరూ భర్తల్లాగే
సత్యనారాయణకి జీవితం మీద పూర్తి విరక్తి వచ్చేసింది.
కారణం రాధిక ప్రవర్తన (అని అంటాడతను)
ఎప్పుడూ సినిమాలు, షికార్లు అంటూ ఇంటి పట్టున ఉండకుండా
చాలా జల్సాగా తిరుగుతుంది.
షోకులు ఎక్కువ.
సంసార పక్షంగా ఉండదు.

దాంతో పాపం....
చాలా బాధపడిపోతున్నాడు
అప్పుడు అనుకున్నాడు
పదేళ్ళ క్రితం తీసుకున్న చిన్న నిర్ణయం.... ఇంత

---

**1 సిద్ధాంతాలు-రాద్ధాంతాలు** | **ఆఫీసాలజీ** | బొమ్మలు: బాలి

బాస్ చెప్పిన ఆర్డర్లు ఒకదానికొకటి విరుద్ధంగా ఉంటే - రెండూ చేసి చూడాలి
-విధేయరావు



తక్కినవేవీ పని చేయకపోతేనే - బాస్ చెప్పినది చేసి చూడాలి.
- అవిధేయరావు.



అతి తక్కువ పని చేసేవాడికి అతి ఎక్కువ పేరు వస్తుంది.
- హెడ్ క్లర్క్ ఆక్రోశం



ఘోరమైన
... శిక్షను అనుభవించేలా చేయటం అతనికి విపరీతమైన క్షోభని కలిగించింది.
ఆరోజు సుబ్బలక్ష్మిని చేసుకొని ఉంటే.... తన బతుకిలా నీచంగా తయారయ్యేది కాదని తనలో తానే రోదించాడు
సరిగ్గా అదే టైంకి టీవీలో అతి నీచమైన ప్రోగ్రాం వస్తోంది...
అది చూస్తున్న సత్యనారాయణ చిరాకుపడి.... రిమోట్ కంట్రోల్‌తో ఛానల్ మార్చాడు.
అదీ బోర్ కొట్టింది. మళ్ళీ ఛానల్ మార్చాడు.
...ఇలా ఛానల్స్ పది మార్చాక
టీవీకి రిమోట్ ఉన్నట్టే... లైఫ్‌కి కూడా రిమోట్ ఉండి ఉంటే....
నచ్చని ఛానల్స్‌ని మార్చినట్టుగా.... నచ్చని 'పెళ్ళామ్స్'ను కూడా మార్చుకోవచ్చు కదా.... అని అతను మనసు తెగేసింది....



వెంటనే.... ఆకాశాన్ని చీల్చుకుని
ఓ రిమోట్ 'టప్' మని వచ్చి సత్యనారాయణ ఒళ్ళో పడింది.
ఉలికిపడి చూసేడతను....
పైన ఆకాశంలో తథాస్తు దేవతలు-
"భక్తా.... నీ బాధ తెలిసింది. అందుకే ఈ రిమోట్ పంపాం.
నీకు రాధిక ఛానల్ బోరు కొట్టింది. కాబట్టి సుబ్బలక్ష్మికి వెళ్ళిపో.... ఈ రిమోట్‌నొక్కిన మరుక్షణం నువ్వు ఆ శుక్రవారం పెళ్ళి చూపులు చూసిన తర్వాత.... డెసిషన్ తీసుకోవల్సిన టైంకి... మళ్ళీ వెనక్కి వెళుతున్నావ్.

ఆ మాటలు వినగానే.... సత్యం ఎగిరిగంతేసి



## జనార్ధన మహర్షి

ఈ పేరు వినగానే 'వన్ బై టు', 'పెళ్ళాల రాజ్యం', 'ఆంటీ', 'పట్టుకోండి చూద్దాం', 'ఓ పనైపోతుంది బాబూ', 'కన్యాదానం', 'మా నాన్నకు పెళ్ళి', 'చాలా బాగుంది' చిత్రాల కథకుడిగా, సంభాషణల రచయితగా, 'పట్టుకోండిచూద్దాం', 'ఓ పనైపోతుంది బాబూ' చిత్రాలలో ప్రత్యేక పాత్రలు పోషించిన నటుడిగా గుర్తొచ్చేస్తాడందరికీ.... వరుస సక్సెస్‌లతో సినీరంగంలో అందరిచేతా 'ధనార్జన మహర్షి'గా పేరు తెచ్చుకున్న జనార్ధన మహర్షి అందిస్తున్న ఈ కథ 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకం. ఈ కథచదివి నేరుగా ఆయనకే మీ అభిప్రాయాలను పంపండి. ఆయన మెప్పు పొందిన ఉత్తరాన్ని వచ్చే సంచికలో ప్రచురించడమేకాక ఆరునెలలు పాటు ఆలేఖ పంపినవారికి 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతాం.

**చిరునామా:- జనార్ధన మహర్షి**
**జి 2, కృష్ణా అపార్ట్‌మెంట్స్, ఎల్లారెడ్డిగూడ**
**అమీర్‌పేట క్రాస్ రోడ్స్, హైదరాబాద్-73**

రిమోట్ నొక్కాడు
మళ్ళీ ఈ కథ మొదటికి వచ్చింది.
ఇప్పుడు సత్యానికి సమస్య లేదు. అతనికి సుబ్బలక్ష్మి సంబంధం నచ్చేసింది.
వెంటనే ఓ.కే. చేసేశాడు.
దాంతో సత్యనారాయణ సుబ్బలక్ష్మి మొగుడయ్యాడు.
ఇది జరిగిన పదేళ్ళకి....
సత్యం ఇంకా బాగా విరక్తి చెందాడు.
సుబ్బలక్ష్మి ఎప్పుడూ డల్లుగా ఉంటుంది.
దాంతో ఓ సినిమా లేదు, షికారు లేదు
షోకులు అసలే లేవు. ఓ పనిమనిషిలా ఉంటుంది.
ఒంటిమీద బొత్తిగా శ్రద్ధలేదు.
సత్యం ఇది భరించలేక పోతున్నాడు
ఇప్పుడతనికి ఓ సుబ్బలక్ష్మి? .... ఓ రాధిక? .... కాదు
మరో వెంకటలక్ష్మి, ఇంకో కవిత కావాలి
పోనీ వాళ్ళయినా కరెక్టా?... ఏమో తెలీదు....!

ఈ అసంతృప్తి ఒక్క సత్యనారాయణది మాత్రమే కాదు.
చాలా మంది మగాళ్ళ కుండేదే - సౌందర్య, సిమ్రాన్, శ్రీదేవి, ఐశ్వర్యారాయ్. మనకు పెళ్ళాలెందుకు కారని....!?
... ఇదే కష్టం మగాళ్ళకే కాదు - ఆడాళ్ళకి కూడా.
చిరంజీవి, బాలకృష్ణ, నాగార్జున, పవన్ కల్యాణ్,... మన సొంతం ఎందుకు కారని....!?



ఒక్క పెళ్ళి విషయంలోనే కాదు - ప్రొఫెషన్‌లోనూ, వ్యాపారాలోనూ..... అన్నింటిలోనూ ఇదే అసంతృప్తి -
ఆ రోజు నేను మద్రాస్ వెళ్ళి ఉంటే - సినిమాహీరోని అయ్యేవాణ్ణి ఖర్మకొద్దీ ఇలా బ్యాంక్ క్లర్క్‌ని అయ్యానని' ఒక మల్లిఖార్జునరావ్
'ఆరోజు క్రికెట్ కరెక్ట్‌గా ప్రాక్టీస్ చేసి ఉంటే.... ఇవాళ సచిన్ టెండూల్కర్ కంచం లాగేసుకునే వాడినని' ఒక ప్రణవానంద్
...ఇలా ..... ఓ రాంబాబు
ఓ సుబ్రహ్మణ్యం
ఇంకో నారాయణ
ఓ లలిత, ఓ సుమిత్ర మరో కైకేయిల కోరిక....

ఆంధ్రా బ్యాంక్‌లో అటెండర్‌గా పని చేస్తున్న సుబ్రహ్మణ్యానికి
తన ఉద్యోగం మీద (పై అందరిలాగే) విరక్తి వచ్చింది.
'ఎధవ ఉద్యోగం - ప్రతిరోజూ బ్యాంక్ మేనేజర్ చేతులమీదుగా చీవాట్లు తినాలి' - అంటూ తెగబాధపడిపోయాడు.

## 2 సిద్ధాంతాలు-రాద్ధాంతాలు — ఆఫీసాలజీ

బొమ్మలు:బాలి

**ఫైలు చేసిన కాగితం** - ఎక్కడుందో తెలుస్తుంది కానీ అవసరం పడదు
**ఫైలు చేయని కాగితం** - అవసరం పడుతుంది కానీ ఎక్కడుందో తెలియదు.
**- రికార్డు కీపరు గ్రహించిన సత్యం.**



వేడి కాఫీ తాగబోతూండగా బాస్ చెప్పే పనికి పట్టే సమయం. -
ఆ కాఫీ చల్లారిపోయేందుకు పట్టేటంత.



**- సెక్రటరీ అనుభవసారం.**

వాయిదా వేయగల ప్రతిభ గలవాడికి వేరే ఏ ప్రతిభా అక్కర్లేదు.
**- నిర్భయమూర్తి.**



ఎప్పటికైనా బ్యాంక్ మేనేజర్ అయితే చాలని కలలు కన్నాడు.

***

వెంకటేశ్వరరావు



ఇతనే సుబ్రహ్మణ్యం కలలు కంటున్న బ్యాంక్ మేనేజర్ గత మూడేళ్ళుగా అతనికి మేనేజర్ ఉద్యోగం మీద విరక్తి పుట్టింది. ఎన్నాళ్ళిలా.... అతని కాలేజ్‌మేట్ ఒకడు కలెక్టర్ అయ్యాడు. అతడు.... ఇతని పేపర్స్ ఇంటర్‌లో కాపీ కొట్టాడు.

కాబట్టి... ఆ కలెక్టర్ అంటే ఈ వెంకటేశ్వరరావ్‌కి చాలా చులకన. కానీ తనకంటే పై పదవిలో ఉన్నాడు.

అందుకే.... వెంకటేశ్వరరావ్ రోజు ఉదయం గడ్డం గీక్కోవటం దగ్గర్నించి... రాత్రి బెడ్ ఎక్కేవరకూ.... కలెక్టర్ కాలేక పోయానని... కుమిలిపోతూ ఉంటాడు.

***

హనుమంతరావ్.



ఇతనే వెంకటేశ్వరరావ్ కుళ్ళి పోయే కలెక్టర్.

ఇతను గత సంవత్సరం నించీ...నిద్రాహారాలు మానేశాడు.

ఎందుకంటే... ప్రతిరోజు ఎవడో ఒక మినిస్టర్ దగ్గర్నించి ఏదో ఒక ప్రెషర్

ఇంత చదివి కలెక్టర్ కావడం కంటే .... ఎలాగోలా గెలిచి మినిస్టర్ అయితే ఎంత బాగుండేది అని తెగ ఫీలై పోతుంటాడు.

***

శ్రీనివాసరావ్.



ఇతనే ఇప్పుడు హనుమంతరావ్ కోరుకునే మినిస్టర్.

చాలా ఖర్చు పెట్టి, రిగ్గింగులు చేసి, మర్డర్స్ చేసి మినిస్టర్ అయ్యాడు.

ఇంత కష్టపడినా - సుఖం లేదు.

ఏ నిర్ణయం తీసుకోవాలన్నా - సి.ఎం.దే పవర్ అంతా.

.... అందుకే అతను సి.ఎం. కావాలనుకుంటూ ఉంటాడు.

***

సి.ఎం.

ఇప్పుడాయన్ని వీరప్పన్ కిడ్నాప్ చేశాడు.

అడవుల్లోకి తీసుకెళ్ళాడు.

అన్నం పెట్టకుండా..... గవర్నమెంటుకి కొన్ని కండిషన్స్ పెట్టాడు.

....అడవిలో అనాధలా బతుకుతున్న సి.ఎం.కి
తన వృత్తి మీద విరక్తి వచ్చి వీరప్పన్‌లా
అయితే ఎంత బాగుండేది అనుకున్నాడు.

***

వీరప్పన్ అడవిలో పరిగెడుతున్నాడు
వెనక ఐజి రాయ్ ఛేజ్ చేస్తున్నాడు.
ప్రాణభయంతో పరిగెడుతున్న వీరప్పన్ అనుకున్నాడు
ఏమిటి మనకీ ఖర్మ..... మనం ఐజి రాయ్‌లా అయిఉంటే



ఎంత బాగుండేదని.

***

ఐజి రాయ్ ఏ రోజూ నిద్రపోడు




పోతే.... చచ్చిపోతాననే భయం

ఎంతో మంది నక్సల్స్ అతన్ని చంపాలనే ప్రయత్నంలో ఉన్నారు.

***

"హాయిగా ఏ బ్యాంక్‌లోనో అటెండర్ అయి ఉంటే, ఈ కష్టాలేవీ తనకి ఉండేవి కాదుగా.... " అని

అందుకే ప్రతిరోజూ అతను అనుకునేది ఒకేచోట

***

అలా ఆ ఐజి కోరుకున్న....
ఆ అటెండర్ ఎవరు?
-గుర్తొచ్చిందా?
సుబ్రహ్మణ్యం....
ఇక ఆ సుబ్రహ్మణ్యం ఏం కోరుకున్నాడో....
మీకు మళ్లీ చెప్పక్కర్లేదు.

## 3 సిద్ధాంతాలూ-రాద్ధాంతాలూ

**ఆఫీసాలజీ** — బొమ్మలు: బాలి

పనిలో స్పీడు ఏ నిష్పత్తిలో తగ్గిస్తే తప్పులు కూడా ఆ నిష్పత్తిలో తగ్గుతాయి.

- నిదానందం



ఉద్యోగానికి కరెక్టుగా సరిపోయే వ్యక్తి యొక్క బయోడేటా చేరేది

ఎవణ్నో ఒకణ్ణి ఆ సీట్లో భర్తీ చేసిన మర్నాటి ఉదయమే.

-మేనేజరు మొత్తుకోలు




ఆఫీసు కారిడార్లో అటూ, ఇటూ తిరిగేటప్పుడు చేతిలో ఏదో ఒక టైపు చేసిన కాగితం ఉండేట్లా చూసుకోవాలి

- ఆఫీసరు ట్రెయినింగులో ఓ పాఠం






ఈ పాటను వివరంగా కావాలని కోరినది : యనమండ్ర రామలక్ష్మి, కాకినాడ.

# అబబ్బా ఇద్దూ...

బ్యానర్: వైజయంతి మూవీస్ చిత్రం: చూడాలని వుంది
దర్శకత్వం: గుణశేఖర్ సంగీత దర్శకుడు: మణిశర్మ
ఈ పాట రచన: వేటూరి గానం: బాలు, సుజాత
అభినయించినది: చిరంజీవి, సౌందర్య



ఆ ॥ అబబ్బా ఇద్దూ అదిరేలా ముద్దు
అ ॥ అమ్మమ్మా దిద్దు మధురాలా మరుముద్దు ॥అబబ్బా॥
ఆ ॥ చలిపులి పంజా విసిరితె సలసలకాగే వయసులో
అ ॥ గిలగిలలాడె సొగసుకే జో లాలీ...
॥అబబ్బా॥
ఆ ॥ వాటేసుకో వదలకు వలపుల వల విసిరి
వాయించునీ మురళిని వయసుగాలి పోసి
అ ॥ దోచెయ్యనా దొరికితే దొరకని కోకసిరి
రాసేయ్యనా పాటలే పైటచాటు చూసి
ఆ ॥ ఎవరికి తెలియవు ఎదరస నసలు
అ ॥ పరువాలాటకు పానుపు పిలిచాకా
ఆ ॥ తనువు తాకినా తనివితీరని వేళా ॥అబబా॥
అ ॥ జాబిల్లితో జత కలు జగడపు రగడలతో
పొంకాలతో నిలునిలు పొగడ మాల వేసి
ఆ ॥ ఆకాశమే కులుకులు తొడిమెడు నడుమిదిగో
సూరీడునే పిలుపిలు చుక్కమంచు సోకి
అ ॥ అలకల చిలుకలు చెలి రుసరుసలు
ఆ ॥ ఇక జాగెందుకు ఇరుకున పడిపోగా
అ ॥ మనసుతీరినా వయసులారని వేళా ॥అబబా॥

**ఒ**కానొక రోజుల్లో శృంగార గీతాలు కూడా అద్భుతమైన ట్యూన్‌లతో వచ్చేవి. ఆ ట్యూన్ మనసులో మెదిలినప్పుడు శృంగారపు పదాలతో కూడిన ఆ పాటలు పదిమంది మధ్యలో ఉన్నా సరే యథాలాపంగా బైటికి వచ్చేసేవి. విన్నవాళ్ళు పెద్దాళ్ళయినా సరే అంతగా తప్పట్టుకునే వారు కాదు. పైగా ట్యూన్‌ని ఎంజాయ్ చేసేవారు కూడా!

కానీ రానురాను పాట పరిస్థితి ఎలా మారిందంటే ప్రేమగీతాలు సరేసరి.... సందేశాత్మక గీతాలతో కూడా కొన్నికొన్ని పదాలు పొరపాటున బైటికి వచ్చేస్తే నాలిక్కరుచుకోక తప్పటం లేదు. సంస్కారంతో వచ్చే చిక్కుల్లో ఇదొకటి.

ఈ ప్రస్తావనంతా ఎందుకంటే 'అబబ్బా ఇద్దూ' పాటని ట్యూన్‌తో సహా ఓసారి పాడుకొని చూడండి. ట్యూన్ కనుక మనసులోకి ఇంటర్లూడ్స్‌తో సహా జొరపడిందనుకోండి. ఇక స్థిరపడినట్టే.... ఓ పట్టాన మరచిపోలేం...

అందుకు కారణం.... మణిశర్మ... ఈ పాటకు అతను ఉపయోగించిన సామరాగం!! 'శాంతము లేక సౌఖ్యము లేదు' వంటి కీర్తన, 'రహస్యం' సినిమా లోని 'గిరిజా కళ్యాణం' యక్షగానంలో వచ్చే 'అంబా అని అసమశరుడు నను పిలిచెను వినవో' అనే చరణం - తెలిసిన వాళ్ళకి సామ రాగం శాస్త్రీయ రూపంలో ఎలా ఉంటుందో చెప్పనవసరం లేదు. కానీ నవీన పంథాలో, నేటి బీట్‌తో, కమర్షియల్ సినిమాకు తగ్గట్టుగా.... ఆ రాగంలో ట్యూన్ చేయడం అనే విషయం నిజంగా గొప్పగా చెప్పుకోదగ్గ విశేషం. ఈ పాటకి ఓ వైపు వీణవంటి పక్కా శాస్త్రీయ వాద్యంతో ఆకర్షణీయమైన బిట్స్ పెడుతూ మరో వైపు ఆర్కెస్ట్రాని 'రెగె' స్టయిల్‌లో నడిపించాడు మణిశర్మ!

ఇక వేటూరి... చలిపులిపుంజా విసరటం / సొగసు గిలగిలలాడటం / దొరకని కోకసిరి/ పైట చాటు చూసి పాటలు రాసెయ్యడం / ఎదరసరనలు / జగడపురగడలు / మనసుతీరినా వయసులారని వేళ.... ఇలా కలాన్ని కవ్వించే కవ్వంగా చేసి హృదయాన్ని చిలికి చిలికి ఒదిలి పెట్టాడాయన.

ఈ పాటను మధురాతి మధురంగా తల్చుకుంటూ దర్శకుడు గుణశేఖర్ 'హాసం'లో పంచుకొన్న అనుభవాలివి:

"చూడాలని వుంది సినిమాలో ఒక్కొక్క పాటని ఒక్కొక్క రకం మూడ్‌ని ఎలివేట్ చేసేలా స్క్రిప్ట్ స్టేజ్‌లోని అనుకున్నాను. పాట సిట్యుయేషన్‌ను, మూడ్‌ని చెప్పడం, మణిశర్మ మర్నాటికి అతను ట్యూన్‌తో సహా రావటం... అలా 'చూడాలని వుంది' సినిమాలో ట్యూన్లన్నీ ఫస్ట్ ఇంప్రెషన్‌లో ఓకే అయినవే...! 'అబబ్బా ఇద్దూ' పాటని రొమాంటిక్ మూడ్‌కి అని అనుకున్నాం.

ట్యూన్ నాకు, అశ్వనీదత్తుగారికి ఓకే అయిపోయింది. రాయడానికి వేటూరి గారు వచ్చారు. మణిశర్మ ఇంట్లో ఓ చెట్టుంది. వేటూరి గారికి చెట్ల క్రిందా, గార్డెన్‌లలోనూ రాయటం అంటే భలే ఇష్టం. 'రొమాంటిక్ మూడ్, ఎక్స్‌ప్రెషన్ బేస్డ్' అని అన్నాం. వెంటనే వేటూరి గారు 'అబబ్బా' అని ట్యూన్‌తో సహా ఎక్స్‌ప్రెసివ్‌గా అన్నారు. ఆ తర్వాత ఓ క్షణం తర్వాత 'అబబ్బా ఇద్దూ అదిరేలా ముద్దు' అని అన్నారు. దత్తుగారు ఆల్మోస్ట్ ఎగిరి గంతేశారు. ఎందుకంటే అంతకు ముందే చిరంజీవి, వేటూరి, దత్తుగారి కాంబినేషన్‌లో 'అబ్బనీ తీయనిదెబ్బ' విపరీతమైన హిట్... ఆ 'అబ్బా' తిరిగి వచ్చినందుకు ఆనందం పట్టలేక పోయాడాయన.

అంతే.... మీరునమ్మరు.... కరెక్ట్‌గా ఇరవై అంటే "20" మినిట్స్‌లో పాటని రాశాడాయన. నో కరెక్షన్స్.... పాట చూసుకుని అందరం ఎంత ఆనందించామో.... అదేమాట వేటూరి గారితో అంటే.... "నాదేముంది... మీరు శుభ్రంగా అరటిపండు ఒలిచి చేతిలో పెట్టారు. నేను హాయిగా తిని త్రేన్చాను.... అంతే!" అని అన్నారు. అదీ ఆ మహానుభావుడి సంస్కారం!!

ఇక ఇంత చెప్పి డాన్స్ డైరెక్టర్ సరోజ్ ఖాన్ గురించి చెప్పకపోతే ఈ పాటకి అన్యాయం చేసినట్టే... తన కొరియోగ్రఫీతో శ్రీదేవికి మాధురీ దీక్షిత్‌కి స్టార్‌డమ్‌ని ఇచ్చిన గొప్ప నృత్య దర్శకురాలామె!! పాటలో ప్రతిమాటకీ అర్థం అడిగి తెలుసుకుని మరీ డాన్స్ కంపోజ్ చేస్తారావిడ. నేను ఈ పాట లిరిక్‌ని ఇంగ్లీషులోను, హిందీలోను ట్రాన్స్‌లేట్ చేయించి ఆవిడకి ముందే పంపించాను. ఎక్స్‌ప్రెసివ్‌గా ఉండాలని చెప్పాం కనుక ఈ పాటకి ఆవిడ ఇచ్చిన మూమెంట్స్‌ని తెరమీద చూడాల్సిందే తప్ప వర్ణించలేం. ఒక దగ్గర ఆవిడ 17 నుంచి 20 టేక్‌లు తీయించింది. చిరంజీవి గారితో కలిపి ఆవిడ మూమెంట్స్ ఇస్తుంటే 16 ఏళ్ళ అమ్మాయిలా అనిపించింది. (ఆవిడకి బహుశా 50 ఉంటాయి). ఆ మూమెంట్స్ చూసి సౌందర్య కూడా 'నేనిప్పుడు మాస్టారిలా చేస్తాను' అంటూ ఏ ఇన్హిబిషను లేకుండా చేసింది. ఇక చిరంజీవి గారి విషయం చెప్పక్కర్లేదు. ఇలాంటివి సునాయాసంగా చేసేస్తారు. ఇలా ఇంతమంది ప్రతిభతో తయారయింది ఆ పాట" అంటూ తన సంభాషణని ముగించారు గుణశేఖర్ ఎంతో తృప్తిగా!!




ఓ సినిమా విడుదలైంది. చూసిన జనం గొల్లుగొల్లుమని నవ్వుకుంటూ బయటికొస్తున్నారు. "రేలంగోడేం చేశాడ్రా" అని చెప్పుకుని మరీమరీ నవ్వుకుంటున్నారు. అదే జనం మళ్లీ ఎగబడ్డారు. రెండో రోజూ ఆ తర్వాతా, రేలంగి అలా ఆకర్షించాడు. ఆకట్టుకున్నాడు. ఆనందం పంచాడు. సినిమాల్లో బంగారం లాంటి నవ్వుల పంటలు పండించిన రోజులవి. సినిమా బాగున్నా లేకపోయినా రేలంగుంటే వెళ్లిపోవడమే! సినిమా హాస్యానికి రేలంగే తొలి హీరో.



# సినీ హాస్యానికి పూలంగి తొడిగిన రేలంగి

"ఈ రేలంగోడి వెనుక చాలా గోడుంది బాబూ" అని తన కథంతా చెప్పేవారు, కష్టాలు చెప్పే వారు. "నాలాగా అందర్నీ కష్టపడమని కాదు. కష్టపడి పైకి వచ్చేవాడికీ సుఖంగా పైకి వచ్చేవాడికీ తేడా తెలుస్తుంది. కష్టపడి పైకి రావడంలో వున్నమజా, రెండో దాంట్లో వుండదు"? అని సూత్రాలు, సూక్తులూ చెప్పేవారు రేలంగి నవ్వుతూనే. చిన్నతనం నుంచి తను నాటకాలు వెయ్యడం, తిరగడం, ఉంటే తినడం లేకపోతే గాలి తినడం, గాలికూడా లేకపోతే గోళ్లు కొరుక్కోడం - చెప్పేవారు.

రేలంగి తండ్రి సంగీతం మాస్టారు. హరికథలూ చెప్పేవారు. అది "ప్రమాదించింది". రేలంగికి పాట మీదికి దృష్టి మళ్లింది. గాలిపాట వచ్చింది. ఆ పాట అలా మాటలోకి దింపింది. చదువుమాట దేవుడెరుగు - నాటకం మాట దేవుడిలా కనిపించింది. కాకినాడలో చిన్నాచితకా వేషాలు వేస్తూ యంగ్‌మెన్స్ హాపీ క్లబ్‌లో చేరిపోయి, పౌరాణికాల్లో పద్యాలు చదువుతూ, సాంఘికాల్లో పాటలు పాడేస్తూ నట జీవితం వెతుక్కున్నాడు.

"ముందు ఆడ వేషాలు వేశాను. తర్వాతే మగవేషం వచ్చింది. ఆ వేషం వేసి ఏం చేశానో, ఎలా చెప్పానో గాని, ప్రేక్షకులు నవ్వారు. "అరె నవ్వారే - నవ్వారే, నేను హాస్యం చెయ్యగలనన్నమాట అనిపించింది - అప్పుడే" అని రేలంగి చెప్పారు.

రేలంగి ముఖంలోనే హాస్యం వుంది. అది పాదరసంలా కదుల్తుంది. క్షణంలో రేఖలూ రంగులూ మారుస్తుంది. అలాగే కంఠం, మాట తీరూ, అవన్నీ ఆయన ప్రాక్టీసు చెయ్యలేదుట - అలాఅలా వచ్చేశాయట. కొన్ని ఇంగ్లీషు సినిమాల్లోని కమెడియన్స్‌ను చూసి, 'ఎక్స్‌ప్రెషన్స్' కనిపెట్టారట. ఓ

గొల్లభామో, గుణ సుందరి కథో, పాతాళభైరవో, మిస్సమ్మో, మాయాబజారో, పెద్దమనుషులో, ఇద్దరుమిత్రులో, పక్కింటి అమ్మాయో..., ఏదిచూసినా, గుర్తొచ్చినా హాస్యరసం పిండిపిండి మనచేత తాగించే రేలంగి వెంకట్రామయ్య - సాక్షాత్కరిస్తాడు.

నాటకాలు వేస్తూ, మూకీలు చూస్తూ సినిమా వేపు దృష్టి మరల్చాడు. "రౌడీలా వుండే వాణ్ణి. మూకీ సినిమా చూసి వచ్చి అందులోలా, స్నేహితులతో



ఫైటింగ్ చేసి కొట్టే వాణ్ణి. సినిమాల్లోవి ఉత్తుత్త కొట్లాటలని నాకేం తెలుసు?" అని చెప్పి నవ్వేవారు రేలంగి, నవ్విస్తూ. సినిమాలు ఎక్కువగా బొంబాయిలో తీస్తారని, అక్కడి స్టూడియో పేర్లు తెలుసుకుని - వెంకట్రామయ్య ఇంగిలీషులో ఉత్తరాలు రాసే వారుట. "మైనేమీజ్ ఆర్. వెంకటరామయ్య. ఐయామ్ సీ యువర్ పిక్చర్. ఐయామ్ వాంట్ టూ యాక్ట్. గివ్ మీ చాన్స్‌సార్, రిప్లైసార్" అని తన ఎత్తు, బరువూ, వయసూ రాసి, పోస్ట్ చేసేవారుట. "నాకు జవాబు ఎందుకొస్తుందీ? నా ఎత్తు బరువూ వున్నవాళ్లు బొంబాయిలో లేరూ? ఏదో తెలీక... అజ్ఞానం. ఉబలాటం" అని తన ఇంగ్లీషు ప్రజ్ఞ గురించి చెప్పేవారు.

బాలనాగమ్మ, గొల్లభామ సినిమాలలో తెలిసిన రేలంగి, ఆ రెండు సినిమాల్నీ చెరో భుజం మీద పెట్టుకుని డొక్కు సైకిలు వేసుకుని, దర్శక నిర్మాతల ఇళ్ల చుట్టూ తెగ తిరిగేవాడు. తిరిగి తిరిగి శోభనాచల స్టూడియోకొచ్చి, ఓ చెట్టుకింద మకాం పెట్టి, వచ్చే పోయే వాళ్లకి సలాంలు కొట్టి కాలక్షేపం చేసేవాడు. పాత సైకిలు 'డిసాల్వ్'లో కొత్త సైకిలయింది. కొత్త సైకిలు పాత కారయింది. పాతకారు "పెద్దకారు" అయింది. వెంకట్రామయ్య - "రేలంగి" అయ్యాడు.

"చిన్నతనంలో వేళకి తినకా, నిద్రపోకా ఎలా తిరిగానో ఏమిటో గాని ఇప్పుడు ఆరోగ్యం దెబ్బతీసింది" అని చెబుతూ తన మీద తనే జోక్ వేసుకునే వారు.

"ఆ రోజుల్లో తిందామంటే వేరుశెనక్కాయలు కూడా కొనుక్కోలేక పోయేవాణ్ణి. ఇవాళ ఇంత సంపద, శక్తి వున్నా తినాలంటే వేరుశెనక్కాయలు కూడా అరగడం లేదు"

పైమాట ఎప్పుడూ చెప్పేమాట.

రేలంగి బయట కూడా నవ్విస్తూ కబుర్లు చెప్పేవారు. సైలంట్‌గా వుండేవారు కాదు. గలగలా మాట్లాడుతూ, కిలకిలా నవ్వించేవారు. ఓ రోజు, షాటు పూర్తి చేసుకుని వచ్చి కూచోగానే, అసిస్టెంటు డైరెక్టరు "సార్, రెడీ, రమ్మంటున్నారు" అన్నాడు. "అప్పుడే లైటింగయి పోయిందా? ఫాస్ట్ కెమెరా మాన్, ఇండస్ట్రీకి లాస్" అని రిమార్క్ పారేస్తూ లేచారు.

పెద్ద స్టారయిన తర్వాత కూడా తన పెద్ద కార్లో, చిన్నా పెద్దా అందర్నీ ఎక్కించుకుని తీసుకెళ్లేవారు. ఒకసారి స్టూడియో మేకప్ రూములో ఆయన సొంత బట్టలు పోయాయి. వెతికారు, వెతికించారు. దొరకలేదు, లాగు, బనీనుతో తన కార్లో ఎక్కికూచుంటూ, "నా బట్టలు దొంగిలించినవాడు ఆ బట్టలు వేసుకుని నా అంత వాడు అవుతాడో, దొంగిలించినందుకు శిక్షగా నాలాగా ఇలా అర్ధ వస్త్రాలతో నిలబడతాడో చూడాలి" అని జోక్ చేసుకుంటూ బయల్దేరారు.

మద్రాసులోని జర్నలిస్టులంతా కలిసి, ఓ సారి ఆయనకు ఘన సన్మానం చేశారు. సన్మానానికి వెళ్లేముందు "మిమ్మల్ని ఏనుగు మీద ఊరేగించి తీసుకెళ్తాం" అన్నారు. రేలంగి మొహం అదోలా పెడితే, "చాలా మంచిదండీ గజారోహణం - మంచి జరుగుతుంది" అన్నాడొక మిత్రుడు. "మరి మావటీవాడు రోజూ ఎక్కుతూనే వుంటాడే" అని నవ్వించారు రేలంగి. ఓ గున్న ఏనుగు మీద వూరేగింపు మొదలైతే, "పాండీ బజార్లోంచి తీసుకెళ్లండి. ఈ బజార్లో మనం చెప్పులు లేకుండా తిరిగాం. ఎండనక వాననక తిరిగాం. ఇప్పుడు ఏనుగుమీద ఊరేగుతూ వుంటే - బజారు సంతోషిస్తుంది" అని నవ్వించారు రేలంగి.

సినిమా హాస్య నటుల్లో భారతదేశం మొత్తం మీద పద్మశ్రీ పొందిన తొలి నటుడు రేలంగి. "సునిశితమైన హాస్యం రేలంగిది". అంటారు తెలిసిన వాళ్లు. ఆ శైలి అతనిదే. "జీవితంలో విషాదం వుండాలి. ఉంటేనే నవ్వు తెలుస్తుంది. నవ్వులోంచి విషాదం పుట్టాలి. రెండూ ఒకటే - అనిపిస్తుంది నాకు" అని "వేదాంతి"లా చెప్పేవారు ఆయన.



ఆరోగ్య రీత్యా సినిమాలు తగ్గించేసుకున్న తర్వాత తన సొంత వూరు తాడేపల్లిగూడెంలో తనకి ఘన సత్కారం జరుగుతుందనీ ఆ సత్కారంలో హాస్య నటులందర్నీ తీసుకెళ్లి సత్కరిస్తాననీ - అందరితోనూ చెప్పారు. అందరూ కలిసి హాస్యనాటకాలు వెయ్యాలన్నారు. అందరూ ఎంతో ముందుకొచ్చి ఆ ప్రయత్నాల్లో వున్నారు. ఐతే విధి ఇంకోలా తలచింది. ఆ ఘనాతిఘన సత్కారం ఊపిరి పోసుకోక ముందే, ఆ హాస్యమహానటుడి ఊపిరి ఆగిపోయింది. ఆయన హాస్యంలో వున్న మంచితనం - ఆయనలోనూ వుండేది. ఎరిగి వున్నవాళ్లకి ఆ మంచి తనం గుర్తున్నట్టు - ఎరగని వాళ్లకి వందలాది చిత్రాల ద్వారా ఆ మంచి హాస్యం గుర్తు వస్తూనే వుంటుంది!

■



**స్వతహాగా రచయిత**
**ఆ తర్వాత పత్రికా రచయిత**
**సహజంగా నటుడు**
**నిజంగా మనసున్న మనిషి**
**తెలుగు సినీ చరిత్రను**
**నాలుగు దశాబ్దాలకుపైగా**
**పరిశీలిస్తూ పరిశోధిస్తూ**
**ఆ అనుభవాలను**
**ఎప్పటికప్పడు**
**నవ్యాతినవ్యంగా**
**నిరంతరం అందించే**
**శ్రీ రావి కొండలరావు**

**'హాసం' పాఠకుల కోసం**
**ప్రత్యేకంగా రూపొందిస్తున్న**
**మధురస్మృతులివి.**



## డాడీ

సినిమా రిలీజవడానికి ముందు ద్వితీయ స్థానంలో ఉన్న 'డాడీ'ఆడియో సినిమా విడుదల అయిన తర్వాత ప్రథమ స్థానానికి వచ్చినట్టుగా వివిధ పత్రికలు నిర్వహిస్తున్న టాప్‌టెన్ శీర్షికలు తెలుపుతున్నాయి. ఈ విషయమై నిర్మాత అల్లు అరవింద్ మాట్లాడుతూ "ఈ సినిమాలో గుమ్మడి గుమ్మడి ఆడిందంటే అమ్మాడి ' పాట నాకెక్కువగా నచ్చింది. చిరంజీవి సినిమాలోని పాట ఇలా ఉందేంటి అని విన్నవాళ్ళకు సందేహం కలిగితే ఆశ్చర్య పడనవసరం లేదు. కానీ సినిమా చూసిన తర్వాత ఎంతో మంది ఈ పాట చాలా బావుంది అని అంటుంటే హ్యాపీగా ఉంది. ఈ పాటలో 'మెట్టింటికి పంపేలోగా ఆగలేక మట్టింటికి వెళిపోయావా' అనే వాక్యాలు సీతారామశాస్త్రి అద్భుతంగా రాశారు" అని అన్నారు.




## నువ్వు నాకు నచ్చావ్



'నువ్వు నాకు నచ్చావ్' ఆడియో విడుదలైన కొద్దిరోజుల్లోనే లోగానే ట్రిపుల్ ప్లాటినమ్ డిస్క్‌ని సాధించింది. ఈ ఆడియోలో లు 'నా చూపే నిను వెతికినది' పాట గురించి చెబుతూ దర్శకుడు కె.విజయ భాస్కర్ ఇలా అన్నారు. "ఇదొక హాంటింగ్ ట్యూనండీ.... పాట రికార్డింగ్ పూర్తవగానే ఖచ్చితంగా ఈ పాటను విదేశాలలోనే షూట్ చెయ్యాలి అనేటంత ఇన్‌స్పిరేషన్ యూనిట్‌లో అందరికీ కలిగింది. ఎందుకంటే ఆ పాటకు కలర్ ఫుల్ వాతావరణం ఉండి తీరాలి. దానికి న్యూజిలాండ్ బెస్ట్ అనిపించింది. ఆ పాటను న్యూజిలాండ్‌లో షూట్ చేశాం. చలి అక్కడ వాళ్ళకి అలవాటయి పోయింది. కానీ మన వాళ్ళకి మాత్రం కొంచెం భరించలేనిదిగానే ఉంటుంది. వెంకటేష్ గారికి లైట్ కాస్ట్యూమ్‌లు వాడాం అయినా సరే ఆ చలిలో ఆ పాటలో ఎంత చక్కగా చేశారో సినిమా చూస్తే తెలుస్తుంది. ఆ పాటను శ్రీరామ్ ప్రభు పాడారు. వెంకటేష్ గారికి ఫస్ట్‌టైమ్ అతను పాడడం. సూట్ అవుతుందో అవదోనని ఉత్తరాది నుంచి మరో గాయకుడిని పిలిపించి మళ్ళీ పాడించాం. రెండూ వింటే శ్రీరామ్ ప్రభు పాడినదే ఎంతో బావుం దనిపించి ఆయన పాడిన వెర్షనే ఉంచేశాం."

## నువ్వు నేను



'నువ్వు నేను' హెడ్డింగ్ పక్కన కృష్ణారెడ్డిగారి ఫోటోని చూసి ఆయనకి ఈ సినిమాకి సంబంధం ఏమిటని ఆశ్చర్య పోకండి. మంచి ఎక్క డున్నా ప్రశంసించే తత్వం కృష్ణారెడ్డిగారి కుండటమే ఆ సంబం ధానికి మూలకారణం. 'నువ్వు నేను' రిలీజైన చాలా రోజులు అవుతున్నా ఈ మధ్యనే అంటే అక్టోబర్ 12వ తేదీన ఆ చిత్రాన్ని చూసే తీరిక దొరికింది కృష్ణారెడ్డి గారికి. ఆ సినిమా పాటల గురించి ప్రస్తావిస్తూ " టైటిల్ సాంగ్ అందరికీ నచ్చిందన్న విషయం అందరికీ తెలిసిపోయింది. ఆపాటతోపాటు 'నువ్వేనాకు ప్రాణం' పాట నాకు నచ్చింది. ఆ పాట మెలోడియస్‌గా ఉండటం ప్లస్ పాయింట్. లవ్‌కి సంబంధించిన మెలోడీ ఉండటం సెకెండ్ పాయింట్. దాంతో సీన్‌కి కావలసిన ఫీల్ ఆ పాట ద్వారా లభించింది. చాలాబాగా అనిపించింది వింటుంటే, చూస్తూంటే" అని అన్నారాయన.

## మనసంతా నువ్వే



చిత్రం, నువ్వు నేను సినిమాలలో మంచిపేరు తెచ్చుకున్న ఆర్.పి.పట్నాయక్‌ని 'మనసంతా నువ్వే' ఆడియో రిలీజ్ తర్వాత 'మెయిన్ స్ట్రీమ్ మ్యూజిక్ డైరెక్టర్' అంటున్నారు. ఆ ఆడియోలో 'నీస్నేహం లో ఇకరాను అని కరిగే కలగా' అనే బిట్‌ని ఆయనే పాడాడు. "ఆబిట్‌లో సినిమాకి సంబంధించిన మొత్తం ఫీల్ అంతా ఉంది. అందుకని అదే నాకు బాగా నచ్చింది. సిరివెన్నెల గారితో ఫస్ట్‌టైమ్..... ఆయన లిరిక్స్‌కి ట్యూన్ చేస్తున్నప్పుడు బాగా ఎంజాయ్ చేశాను..... టేస్టున్న ప్రొడ్యూసరు.. ఎంతో ఫ్రీడమ్ నిచ్చారు. ఈ సినిమాలో పాటలను గురించి చెప్పాలంటే ఒకే ఒక ముక్క.... గాజువాక పిల్లా పాటవిని వస్తే అలాంటి పాటలుండవు. టైటిల్ చూసి వస్తే ఎలాంటి పాటలు కావాలనుకుంటారో అలాంటిపాటలుంటాయి" అన్నాడు ఆర్.పి. పట్నాయక్.

## ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం



విడుదలయిన ప్రతిచోటా విజయఢంకా మోగిస్తూన్న 'ఇట్లు శ్రావణీ సుబ్రమణ్యం' సంగీత దర్శకుడిగా చక్రిని మరింత లైమ్‌లైట్‌లోకి తీసుకువచ్చింది. ఆ సినిమాలోని 'మళ్ళీ కూయవే గువ్వా' పాట ఎంతోమంది ప్రశంసలను అందుకుంటోంది. అలా ప్రశంసించినవారిలో రాజశేఖర్, జె.డి.చక్రవర్తి, శివనాగేశ్వరరావు, ఎమ్మెస్ రెడ్డి వంటి ప్రముఖులు కూడా ఉన్నారు. ఆ స్పందనను తెలియజేస్తూ "బేసిక్‌గా నాకు మెలోడీ అంటే ఎంతో ఇష్టం. అదే ఈ పాటలో చూపించగలిగాను. మొట్టమొదట దర్శకుడు జగన్ ఈ పాట వినగానే కొన్ని సంవత్సరాల పాటు గుర్తుండి పోయే పాట చేశావ్ అంటూ మెచ్చుకున్నాడు. అప్పుడే నాకీపాట హిట్ అని అనిపించింది. పాటలో ఏరకమైన మత్తు కావాలని కోరుకున్నానో అది యధాతథంగా హరిహరన్ చూపించగలిగారు' అంటూ వివరించారు చక్రి.

## జాబిలి



కృష్ణారెడ్డి సినిమాల్లో పాటలు బావుంటాయన్న ఇంప్రెషన్ 'జాబిలి' ఆడియో విడుదలవగానే ఊవందుకోవటానికి హెల్ప్ చేసింది. ఆ చిత్రంలో ఎక్కువ పాటలు సుద్దాల అశోక్ తేజ రాయటం జరిగింది. 'గంగ యమున గోదారి' అనేపాటను తన కెక్కువ నచ్చిన పాటగా తెలిపారాయన. ఆపాట తనకిచ్చిన అనుభవాన్ని తెలియజేస్తూ కథకు అనుకూలంగా ఉంటూనే సినిమా చూడని వారిని కూడా ఉత్తేజం కలిగించే పాట యిది. 'అల్లరి చిల్లరిగా వుండే ఓ యువబృందం ఒకానొక విషయం వచ్చినప్పుడు ఎంత సీరియస్‌గా కమిట్ అవుతారు అన్నది ఈ పాటలో ఎస్టాబ్లిష్ కావాలి" అని కృష్ణారెడ్డి గారు చెప్పారు. రాత్రంతాకూచుని రాసి ఉదయాన్నే వెళ్ళి అచ్చిరెడ్డిగారికి, కృష్ణారెడ్డి గారికి వినిపించారు. 'గంగయమున గోదారి' అని మొదలు పెట్టగానే తక్కినదంతా ఎలా ఉంటుందో ముందే ఊహించగల కృష్ణారెడ్డిగారు 'గగుర్పాటుగా ఉంది బిగినింగ్'అని అన్నారు. అప్పుడే అనుకున్నా మంచి ఆదరణ వస్తుందని అని తెలిపారు సుద్దాల అశోక్ తేజ.

## ఆనందం



'ఆనందం' సినిమాలో పాటలకు యూత్ కాకుండా అన్ని వర్గాల ప్రసంశలు లభిస్తున్నట్టు తెలుస్తోంది. కొందరు 'ఆనందం, దం, దం,' అంటుంటే మరికొందరు 'కనులు తెరచినా కనులు మూసినా కలలు ఆగవేలా' అని అంటున్నారు. ఆ సినిమాలోని 'ఎవరైనా ఎపుడైనా!' అనే స్వరఖండిక గురించి ప్రత్యేకంగా పేర్కొనాలి. ప్రయోగాన్ని అటు చరణం అనలేం, ఇటు అనుపల్లవితో కూడిన పల్లవి అనలేం. ఓ స్వరఖండిక అనిమాత్రం అనగలం. 'అసలిది ఎప్పుడు రాశారండీ...!? బహుశా నేనలా బైటికెళ్ళి వచ్చే లోగా పదినిమిషాల్లో రాశారేమో' అని అన్నాడు సిరివెన్నెల సీతారామ శాస్త్రిగార్ని అనుక్షణం అంటి పెట్టుకుని ఉండే భమిడి పాటి శ్రీనివాస్. 'చాలా కాలం తర్వాత ప్రతి అక్షరం కవితాత్మకంగా వెలిబుచ్చ గలిగిన ఒక పొయెటిక్ పీస్‌ని రాసే అవకాశం కలిగింది' అన్నారు సీతారామశాస్త్రి ఆ పాటను తల్చుకుంటూ.

## స్నేహమంటే ఇదేరా



ఆర్.బి.చౌదరి సినిమాల్లో పాటలు సాఫ్ట్‌గా ఉంటాయన్న టాక్ ఉంది. ఆయన తాజా చిత్రం 'స్నేహమంటే ఇదేరా' చిత్రానికి సంగీతాన్నిచ్చిన శివశంకర్ ఆ సినిమాలో తనకు నచ్చిన పాటగా చెలియా నీ ప్రేమలోనే పరవశించి పోయానే పాటను పేర్కొన్నాడు. ఇది రింగ్ ఇచ్చే సిట్యుయేషన్ మెలోడి కావాలి అని అన్నారు డైరెక్టర్, ఆ ప్రకారం నేను చేసిన ట్యూన్‌కి చౌదరిగారు వెరీ హ్యాపీ. మృత్యుంజయ అనే రైటర్‌ని డమ్మీ లిరిక్ రాయడానికి పిలిపించారు. అతను రాసిన లిరిక్ చౌదరిగారికి బాగా నచ్చింది. కొత్త వాళ్ళను ఎంకరేజ్ చెయ్యటంలో ముందుండే చౌదరిగారు ఇదే వుంచెయ్యండి అన్నారు. ఈ పాట కూడా ట్యూన్ పరంగా ఒకసారి వినగానే మరోసారి వినాలనిపిస్తుంది. రెండోసారి వినగానే మనసులో కూచుండిపోతుంది. ఆ తర్వాత మిమ్మల్ని తనతోపాటు తీసుకుపోతుంది' అని అన్నారు శివశంకర్.

## ఖుషి



ఆడియో పరంగా గానీ, సినీ పరంగాగానీ, విడుదలకు ముందు ఆ తర్వాత విపరీతమైన సంచలనం సృష్టించిన చిత్రం ఖుషీ. ఆ సినిమా విడుదల లయి ఇన్నాళ్ళవుతున్నా టాప్‌టెన్ చార్ట్‌లో ఆడియో తిరిగి చోటుచేసుకోవటం అందర్నీ ఆనందంతో కూడిన ఆశ్చర్యంలో ముంచేస్తోంది. 'ఖుషి సినిమాతో రకరకాల సినిమాల కాంబినేషన్లు వేసి కూడ రిలీజ్ చేశాం సార్. "ఖుషి బద్రీ, ఖుషి ఒకే ఒక్కడు, ఖుషి నిన్నే ప్రేమిస్తా ఇలా చాలా క్యాసెట్లు రిలీజ్ చేశాం. అవీ అమ్ముడు అవుతున్నాయి, సోలో క్యాసెట్లో కూడా అమ్ముడవుతున్నాయి. ముఖ్యంగా అమ్మాయే నవ్వితే పాటకి, ఆడవారి మాటలకు అర్థాలె వేరులే పాటకి మంచి రెస్పాన్స్ వస్తోంది." అని అన్నారు సికింద్రాబాద్ సంగీత్ సాగర్ లోని సేల్స్ మేనేజర్ జయరాజ్.

## స్టూడెంట్ నెం.1



ఆడియో పరంగా హిట్ అయి, సినిమా రిలీజయ్యాక సిట్యుయేషన్స్‌కి తగిన పాటలున్నాయన్న పేరును తెచ్చుకుంది స్టూడెంట్ నెం.1. ఈ సినిమాలో 'కాస్త నన్ను నువ్వు, నిన్ను నిన్ను నేను తాకుతుంటే' పాట తనకు ఎక్కువగా నచ్చిందని చెప్పారు చిత్ర సమర్పకులు అశ్వనీదత్. "టోటల్‌గా ఓ కొత్తదనం ఉందీ పాటలో. ట్యూన్‌లో ట్విస్ట్‌లు ఉన్నాయి. రొమాంటిక్ టచ్ ఎంతో ఉంది. ఎట్ ది సేమ్ టైమ్ అది ఎవ్వరూ వేలెత్తి చూపలేని విధంగా కూడా ఉంది. రచయితగా చంద్రబోస్ ఎన్నో మంచి ప్రయోగాలు చేశాడు. టీనేజ్‌లో ఉన్నవాళ్ళకి స్పర్శవలన కలిగే అనుభూతుల్ని చాలా గొప్పగా రాశాడాయన. ముఖ్యంగా 'రేగుతున్న చోట భోగిమంట మండుతుంటే' అని భలేగా రాశాడు.' అంటూ మనస్ఫూర్తిగా మెచ్చుకున్నా రాయన.

# ఉడ్‌హౌస్ ఫర్ యూ

**హాస్యసినిమాలు ఇతోధికంగా రావడానికి "హాసం" చేసే కృషిలో భాగంగా పి.జి.ఉడ్‌హౌస్ రాసిన "స్ప్రింగ్ ఫీవర్" అనే నవల కథా సంగ్రహం ఇస్తున్నాం. రకరకాల హాస్య పాత్రలు, పలురకాల హాస్య సంఘటనలు గల ఈకథ సినిమావారికి సెంట్ పర్సెంట్ ఫిట్ . చదివి పొర్లానే పాఠకులకి థౌజెండ్ టైమ్స్ బెనిఫిట్. అదెమిటో కథ పూర్తయ్యాక తెలుస్తుంది. ముందు కథ చదవండి మరి.**

# స్ప్రింగ్ ఫీవర్

అనగనగా ఒక జమీందారు. ఆయనకో పెద్ద కోటలాంటి బంగళా, ఎస్టేటూ, ముగ్గురు కూతుళ్లు. భార్య లేదు. పెద్ద కూతురుని ఇల్లరికపుటల్లుడు కిచ్చి చేశాడు. రెండో కూతురికి ఇంట్లో తిష్ట వేసిన నాటక రచయిత అంటే ఇష్టం. అతనంటే ఈ జమీందారుకి ఎంత మాత్రం ఇష్టం లేదు. అయినా ఏమీ చేయలేడు. అజమాయిషీ అంతా పెద్దకూతురిదే. అందరూ ఆమె మాట వినాల్సిందే. ఇక మూడో అమ్మాయే మన హీరోయిన్. తండ్రి దగ్గర చేరిక ఎక్కువ. జమీందారు చేతిలో డబ్బు ఆడక కటకటలాడుతున్నాడు. ఆయనకు ఇంట్లో వంటలక్కను పెళ్లాడదామని కోరిక. ఆ ప్రయత్నంలో ఆయనకి పోటీదారు బట్లర్. ఆ బట్లర్‌కి గుర్రప్పందాల పిచ్చి కాబట్టి , తనకో ఇల్లు కొనివ్వగల జమీందారుని పెళ్లాడడానికి సిద్ధపడింది వంటలక్క. కానీ జమీందారు చేతిలో డబ్బు ఆడదు కదా. అందుచేత ఎప్పుడూ దుఃఖిస్తూనే ఉంటాడు. ఇల్లరికపుటల్లుడికి ఈయన మీద సింపతీ ఉన్నా అతని డబ్బు కూడా పెద్దమ్మాయి చేతిలోనే ఇరుక్కుపోయి వుంది.

ఈ దుర్భర పరిస్థితిని భరించలేక నాటకాల్లో వేషాలేసి హాయిగా బతుకుదామని హీరోయిన్ ఇంట్లోంచి లండన్‌కి పారిపోయింది. వేషాలు రాలేదు. అక్కడ ఓ అందగాడు పరిచయమయితే ప్రేమించింది కూడా. తీరా చూస్తే అతను ఈమెను తృణీకరించాడు. ఇక అక్కణ్నుంచి అందగాళ్లను నమ్మడం మానేసింది. అందమైన ఓ హీరో కలిసి తన ప్రేమను వెల్లడించినా ఒప్పుకోను పొమ్మంది. హీరో గారికి హాలీవుడ్‌లో ఉద్యోగం. దాంతో మరీ బెదిరిపోయింది హీరోయిన్. దానికి తోడు హీరో ఫ్రెండు (సైడు హీరో అనుకుందాం) ఈమెకు బంధువు. అతను కూడా చెప్పాడు. - హీరో చుట్టూ బోల్డు మంది అమ్మాయిలు ఎప్పుడూ ఉంటారని. అందువల్ల హీరో ఎంత కాళ్లా వేళ్లా పడినా కాదని చెప్పి ఇంటికి తిరిగి వచ్చేసిందావిడ. ఇంటికి వచ్చేసరికి తండ్రి 'రెండు వందల పౌండ్లు ఉంటే చూడు, వంటలక్కకు ఇల్లు కొనాలి' అని పట్టుకున్నాడు.



అంతలోనే అమెరికాలో ఉన్న దూరబంధువు దగ్గర్నుంచి టెలిగ్రాం వచ్చింది వాళ్ల అబ్బాయిని కోటకు పంపిస్తున్నట్టు.

ఆ అబ్బాయి ఎవరో కాదు, సైడు హీరోనే. అతగాడు అమెరికాలో ఉన్నప్పుడు ఓ హాలివుడ్ తార వెంటపడ్డాడు. దాంతో తండ్రి ఇతన్ని లండన్ తరిమేశాడు. ఓ మాజీదొంగని బట్లర్‌గా పెట్టుకుని కాలక్షేపం చేస్తూండగా, ఆ హాలీవుడ్ తార లండన్ వస్తోందని తెలిసింది. దానికి అతను ఆనందిస్తుండగా, ఆ వార్త అమెరికాలో ఉన్న వాళ్ల నాన్నకు కూడా తెలిసింది. తక్షణం కొడుకుని లండన్ నుంచి దూరంగా తరిమేయడానికి, లండన్‌కి కాస్త దూరంలో ఉన్న జమీందారు కోటకు వెళ్లమని హుకుం వేసి, జమీందారుకి కూడా టెలిగ్రాం ఇచ్చాడు.

ఆ వచ్చే అతిథి ఎలా ఉంటాడో తెలీదు. ఇంట్లో ఉన్న నాటకాలవాడుకి తోడు వీడొకడా అని జమీందారు ఇష్టపడలేదు. కానీ పెద్దకూతురు పట్టుబట్టింది. 'వాళ్ల నాన్న డబ్బున్నవాడు కనక లండన్ వెళ్లి లంచ్ ఇప్పించి వెంటబెట్టుకురా' అని తండ్రిని ఆజ్ఞాపించింది. ఇల్లరికపుటల్లుడితో కలిసి హాయిగా పాత స్టాంపులు చూసుకుంటున్న జమీందారు (వాళ్లిద్దరికీ అదో హాబీ) తప్పదురా దేవుడా అనుకుని హీరోయిన్‌తో కలిసి లండన్‌కి బయలు దేరాడు. అక్కడా అమ్మాయి షాపింగ్‌కని బయల్దేరగానే - వెళ్లి హాయిగా ఓ బార్‌లో కూచుని మందు కొట్టసాగేడు. అక్కడికి సైడు హీరో వచ్చాడు. అతను, హీరో కలిసి లంచ్ చేద్దామని అనుకున్నారు. హీరో రావడం ఆలస్యం కావడంతో జమీందారుతో కబుర్లలో పడ్డాడు.

ఇద్దరూ ఒకరి పేరు ఒకరు తెలుసుకోకుండానే వాళ్ల వాళ్ల సంగతులన్నీ వెల్లడించుకున్నారు. జమీందారు వంటలక్కతో తన పెళ్లి గొడవ కూడా చెప్పేశాడు. సైడు హీరో తన గోడు వెళ్లబోసుకున్నాడు. హాలీవుడ్ తార వచ్చింది కనుక లండన్ వదిలి పెట్టాలని లేదని, తండ్రి చంపుకుతింటున్నాడనీ అన్నాడు. ఇంతలో హీరో వచ్చాడు. ఒకరి కొకర్ని పరిచయం చేశాడు. తన ఇంటికి రావలసిన అతిథి ఈ సైడు హీరో అని తెలియగానే జమీందారు ఉలిక్కిపడ్డాడు. వంటలక్క వ్యవహారం తన పెద్దకూతురి దగ్గర చెప్తాడేమోనని...! దానికి తోడు హీరో హడలగొట్టాడు - తన ఫ్రెండు నోట్లో నువ్వుగింజ నానదని! మరెలా? అన్నాడు జమీందారు. తన ఫ్రెండు పేరు మీద తను వచ్చేస్తానని, హీరోయిన్‌కి దగ్గరగా మసలి ఆమె ప్రేమను సంపాదించటమే తన ఉద్దేశ్యమనీ, ఈ ప్లానుతో అందరూ సుఖపడతారని చెప్పాడు హీరో. కోటలో అతన్ని గుర్తుపట్టేవారు లేరు కాబట్టి ఇబ్బంది లేదనుకున్నారందరూ. హీరోయిన్‌కి ఎవరెవరో తెలిసినా ఊరుకుంటానంది తండ్రి కోసం.

వాళ్లు లండన్ వదిలి బయలుదేరుతూండగానే ఫోన్ వచ్చింది. ఇల్లరికపుటల్లుడి దగ్గర్నుంచి - వాళ్ల

పాత స్టాంపు ఆల్బమ్‌లో అరుదైన స్టాంపు దొరికిందని, దాన్ని అమ్మితే పదివేల పౌండ్లు వస్తాయనీ. జమీందారు పొంగిపోయాడు. కానీ కోటకు చేరేసరికి కథ మారిపోయింది. జమీందారుకి ప్రేమలో ప్రత్యర్థి అయిన బట్లర్ వచ్చి ఆ స్టాంపున్న ఆల్బమ్ అంతకుముందు ఓసారి కోటకు అతిథిగా వచ్చిన ఒక అమెరికన్ తనకు బహూకరించినదనీ, తనే ఆ స్టాంపు స్వంతదారుణ్ణనీ అన్నాడు. కావాలంటే ఆ అమెరికన్‌ని వెంటబెట్టుకు వచ్చి సాక్ష్యం చెప్పిస్తాననీ చెప్పాడు. నాటకాల్లో వేషాలేసే తన మేనల్లుణ్ణి తీసుకువచ్చి అమెరికన్‌గా పరిచయం చేద్దామని అతని ప్లాను. ఇవేమీ తెలియని పెద్దమ్మాయి ఆ విషయం తేలేదాకా తండ్రికి కూడా స్టాంపు ఇవ్వనంది. జమీందారుకి ఒళ్లు మండి 'నీ ఫ్రాడ్ బయట పెడతానన్నాడు బట్లర్‌తో'. అలా అయితే వంటలక్కతో నీ వ్యవహారం బయట పెడతాన'ని బెదిరించాడు బట్లర్. ఇంకేమీ చేయలేక, జమీందారు పళ్లు నూరుకుంటూండగా, ఇంట్లో తిష్ట వేసిన నాటక రచయిత అటువేపు వచ్చి తనకు బట్లర్ మేనల్లుడు తెలుసునని చెప్పాడు. దాంతో బట్లర్ ప్లాను అడ్డం తిరిగింది. కానీ బట్లర్‌కి డబ్బు సంపాదించేందుకు ఇంకో సాధనం దొరికింది. అతను సైడుహీరో వద్ద ఇదివరకు పనిచేశాడు. కాబట్టి తన ఫ్రెండు పేరుతో వచ్చిన హీరోను పట్టుకున్నాడు. 'నాకు రెండువందల పౌండ్లు ఇస్తావా, నీ గుట్టు బయట పెట్టనా' అని బెదిరించాడు. 'చెక్కు ఇస్తాను, సంధి చేసుకుందాం' అన్నాడు హీరో. చెక్కు రాస్తూండగానే పెద్దకూతురు వచ్చి. 'ఈయన నీ కిదివరకే తెలుసుకదా' అంది బట్లర్‌తో. 'ఆఁ తెలియకపోవడమేం, అప్పటికీ, ఇప్పటికీ పెద్ద మార్పేమీ లేదు' అన్నాడు బట్లర్ - చెక్కు వస్తోంది కదాన్న ధీమాతో! ఆవిడ అలా వెళ్లగా చూసి, హీరో మడత పేచీ వేసాడు. 'నేనే అతన్నని ఆవిడ ముందు చెప్పావు కదా, ఇప్పుడు కాదని ఎలా చెప్పగలవ్? చెక్కు ఇవ్వను ఏం చేస్తావో చేసుకో' అని దబాయించాడు. బట్లర్ వెర్రిమొహం వేశాడు.

ఇంతలో ఇంకో ఉపద్రవం వచ్చిపడింది. సైడు హీరోకి - తను ఆ కోటలోపల గదుల్లో ఉన్నట్టుగా ఋజువు కోసం ఫోటోలు తీసి పంపమని తండ్రి కోరినట్టు తెలిసింది. ఇప్పుడు అసలు పేరుతో వెళదామంటే, తన పేరుతో హీరో అక్కడ ఆల్‌రెడీ ఉన్నాడు. ఏం చేయాలా అనుకుని వీళ్ళందరూ వున్న ఆ ఊరికి వచ్చి హోటల్లో మకాం వేశాడు. హీరోని కలిసి ఇబ్బంది చెప్పాడు. ఎలాగోలా అతనికి కావలసిన ఫోటోలు తీసి పంపుదామని హీరో ఐడియా వేస్తుండగా.... ఈ బట్లర్ వెళ్లి అతన్ని కలిశాడు. ఆ స్టాంపుల అమెరికన్‌గా వచ్చి నటిస్తే తను ఫోటోలు తీసి ఇస్తానన్నాడు. సైడు హీరో సరేనని అమెరికన్‌నంటూ వచ్చి కోటలోకి దిగాడు. ఇల్లరికపుటల్లుడు స్టాంపుల గురించి మాట్లాడితే వెర్రిమొహం వేశాడు. ఇందులో ఏదో తిరకాసు ఉందని భయపడిన అల్లుడు ఆ స్టాంపుని లైబ్రరీలోని ఇనప్పెట్టెలో దాచాడు. దాంతో ఆ స్టాంపుని దొంగిలించైనా స్వంతం చేసుకుందామనుకున్న జమీందారు, హీరోయిన్, హీరో ఖంగు తిన్నారు.

నీ వల్లే ఇదంతా జరిగిందని హీరో తన ఫ్రెండ్‌ని తిట్టిపోశాడు. అంతా కలిసి ఆలోచించారు. సైడు హీరో దగ్గరుండే బట్లర్ మాజీ దొంగ కదా అతని చేత ఇనప్పెట్టె తెరిపించి, స్టాంపు కొట్టేదామని ప్లాన్ చేశారు. వాణ్ని రప్పించి బతిమాలేరు. వాడు పోజు కొట్టాడు. గతం అంతా మరిచిపోయానని, ప్రాక్టీసు పోయిందని, కొంచెం మందు కొడితే గానీ పాత ధైర్యం తిరిగిరాదనీ....! వీళ్లంతా కలిసి కష్టపడి వాణ్ని ఒప్పించారు. ఆరోజు అర్ధరాత్రి ఇనప్పెట్టెలో వున్న లైబ్రరీలో అంతా చేరారు. సైడు హీరో తప్ప మాజీ దొంగ చిత్తుగా తాగి నానా గోల చేసాడు. సామాన్లు కనబడలేదన్నాడు. జమీందారుని గదిలోంచి పొమ్మన్నాడు. భగ్నమైన తన ప్రేమ పురాణం చెప్పుకొచ్చాడు. పెళ్లి చేసుకోడానికి ఒక రిజిస్టర్ ఆఫీసుకి రమ్మంటే తన ప్రియురాలు ఇంకో రిజిస్టర్ ఆఫీసుకి వెళ్లిందని, ఆ పొరబాటు వారం తర్వాత గుర్తించే సరికి ఆమె మాయమయిపోయిందని చెప్పుకొచ్చాడు. ఇంతోటి ఇనప్పెట్టెకు సామాన్లు కావాలా.... హెయిర్‌పిన్నుతో తెరిచి పారేస్తానన్నాడు. ఈ గోలంతా భరించలేక హీరో వాణ్ని మందలించాడు. దాంతో ఒళ్లు మండి వాడు సామాన్లు కిటికీలోంచి విసిరేశాడు. అడ్డు వచ్చిన హీరో కంటికి దెబ్బ తగిలింది. అతను కంటికి మందు రాసుకోవడానికి వెళ్లినప్పుడు, మాజీ దొంగ హీరోయిన్‌కి నచ్చచెప్పాడు, హీరో చాలా బుద్ధిమంతుడని. హీరోయిన్ హృదయం మెత్తబడింది.

అదేమీ తెలియని హీరో తిరిగివచ్చి మాజీ దొంగని తన్ని తరిమేశాడు. కంటికి కాపడం పెట్టడానికి వేణ్నీళ్లతో తిరిగివచ్చిన హీరోయిన్ బట్లర్ చెప్పిన మాటలు హీరోకి చెప్పింది. కాపడం పెడుతూండగా హీరో తన ప్రేమ సిన్సియర్ అని హీరోయిన్‌కి చెప్పి ఆమె ప్రేమను చూరగొన్నాడు. అతను గుడ్‌నైట్ చెప్పి వెళ్లిపోయాక హీరోయిన్ ఒక్కతీ కూచుని జ్ఞాపకాలు నెమరు వేసుకుంటూండగా సైడు హీరో వచ్చాడు - దొంగతనం సజావుగా జరిగిందో లేదో చూద్దామని! హీరోతో పెళ్లి విషయాన్ని హీరోయిన్ చెప్పగానే సంతోషిస్తూ, తను ప్రేమించిన సినిమా తారకు హీరోకు సంబంధం ఉందని అనవసరంగా అనుమానించానని, ఓసారి తనిచ్చిన పార్టీలో వాళ్లిద్దరూ సన్నిహితంగా మెలగటం చేత అలా జరిగిందనీ, ఇప్పుడీ పెళ్లి వార్త తనకు ఎంతో సంతోషాన్ని కలిగించిందనీ అన్నాడు. దాంతో హీరోయిన్‌కి మళ్లీ సందేహాలు మొదలయ్యాయి. ఏడవడం మొదలుపెట్టింది. హీరో ఫ్రెండు ఖంగారుపడి ఆమెను దగ్గరికి తీసుకుని ఓదార్చబోయాడు. ఇంతలో సామాన్లు పడేసిన చప్పుడు విని పెద్ద కూతురు లైబ్రరీకి వచ్చింది. అంతరాత్రి వేళ వీళ్లిద్దర్నీ సన్నిహితంగా చూసి తెల్లబోయి, 'మీరేం చేస్తున్నార'ని అడిగింది. సైడు హీరో భయపడిపోయి, 'మేం ఇద్దరం పెళ్లి చేసుకోబోతున్నాం లెండి' అనేశాడు. 'అదెలా సాధ్యం? నువ్వు మా చెల్లెల్ని కొన్ని గంటల క్రితమేగా చూశావ్' అందావిడ.... అంటూనే ఏదో గుర్తుకు తెచ్చుకుని 'అవునూ, నువ్వు ఆ అమెరికన్‌వయితే కళ్లజోడు ఉండాలిట ఏమయింది?' అనికూడా అడిగింది. దాంతో ఖంగారుపడి, 'మీరు ఎదురుచూస్తున్న అతిథిని నేనే. మా ఫ్రెండు ప్రాక్టికల్ జోక్ వేసి నా పేరు మీద మీ ఇంటికి వచ్చాడు. నాకు ఇక్కడ పని బడి, మీ బట్లర్ కోరిక మేరకు అమెరికన్ పేరుతో వచ్చా' అన్నాడు సైడు హీరో పెద్దకూతురికి ముందు కోపం వచ్చింది. కానీ అతను డబ్బున్న వాడు కాబట్టి, చెల్లెల్ని పెళ్లాడతానంటున్నాడు కాబట్టి సంతోషించి వెళ్లిపోయింది.

మర్నాడు పొద్దున్న జమీందారుకి మూడ్ చెడిపోయింది. రెండో కూతురు వచ్చి నాటక రచయితను పెళ్లాడతానని, ఇద్దరూ కోటలోనే ఉంటామనీ చెప్పింది. మూడో కూతురు చూడబోతే అందమైన హీరోని వదిలిపెట్టి అందవికారంగా ఉన్న సైడు హీరో పెళ్లాడతానంటోంది. స్టాంపు దొంగతనం ఓ ప్రహసనంగా మారింది. చికాకు పుట్టి లండన్‌కి ప్రయాణం కట్టాడు. చిన్నకూతురితో సహా! జమీందారు బార్లో రిలాక్సవుతూండగా హీరోయిన్ షాపింగ్‌కి బయలుదేరింది. రోడ్డు మీద సైడు హీరో కనబడ్డాడు. సినీతార, హీరో కూడా లండన్‌లోనే పచార్లు కొడుతున్నారని చెప్పాడు. దానికి తగ్గట్టుగా వాళ్లిద్దరూ హోటల్లోకి వెళుతూ వీళ్ల కంటబడ్డారు. దాంతో హీరోయిన్‌కి ఒళ్లు మండిపోయింది. మనసులో వున్న కాస్త నమ్మకం కూడా పోయింది. కోటకు తిరిగివచ్చింది.

ఈ లోపున ఇక్కడ పెద్దకూతురు బట్లర్‌ను ఉద్యోగంలోంచి పొమ్మనమంది. అతనేం చింతించలేదు. ఎందుకంటే అతనికి గుర్రప్పందాలలో కలిసి వచ్చినట్లు అవాళే తెలిసింది. ఇంతలో మాజీ దొంగకు మత్తు దిగింది. సామాన్లు తెప్పించుకుని మళ్లీ ఇంకో ప్రయత్నం చేస్తానన్నాడు. హీరో వచ్చి హీరోయిన్‌తో కలిసి ఫ్రెండ్లీగా మాట్లాడబోతే ఆమె తిట్టిపోసింది. ఆ సినీతారతో తనకు ఉన్నది బిజినెస్ డీల్ మాత్రమేననీ, కాంట్రాక్టు కుదుర్చుకోవడానికే మాత్రమే హోటల్‌కి తీసుకెళ్లాననీ చెప్పాడతను. హీరోయిన్ సమాధానపడింది. సరే నిన్నే పెళ్లాడతాలే అంది. ఇంతలోనే సినీతార కూడా సైడు హీరోకి ఫోన్ చేసి - అతన్ని పెళ్లాడడానికి రెడీయేనని గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. అన్నీ బాగానే ఉన్నాయి. కానీ నా స్టాంపు

సంగతేమిటని జమీందారు వాపోతూండగా మాజీ దొంగ వచ్చి పనయిపోయిందని చెప్పాడు. పూర్తి వివరాలు అడగబోతూండగానే పెద్దకూతురు వచ్చి తండ్రిని రఘాడించబోయింది. స్టాంపు చేతి కొచ్చిందన్న ధైర్యంతో జమీందారు తిరగబడి, ఆమెను తిట్టి బయటకు పొమ్మన్నాడు. వంటావిడ్ని పెళ్లి చేసుకుంటానని ప్రకటించేశాడు కూడా.ఆమెకు మతిపోయి, మారు మాటాడక వెళ్లిపోయింది. అప్పుడు చెప్పాడు మాజీ దొంగ. పెళ్లి తప్పిపోయిన తన ప్రియురాలు వేరెవరో కాదు ఈ వంటలక్కేనని, స్టాంపు దొంగిలించి బయటకు వస్తూండగా ఆమె కంటబడిందని, ఇద్దరి మధ్య అపోహలు తొలగి పోయి పెళ్లాడడానికి నిశ్చయించు కున్నామని....! పోనీ స్టాంపైనా తగలెయ్యి, అని అంటే స్టాంపు నాలిక మీద దాచుకుని బయటకు తెచ్చాననీ, వంటలక్క కనబడిన ఎక్సైట్‌మెంట్‌లో మింగేసేననీ, చావు కబురు చల్లగా చెప్పినట్టు చెప్పాడు.

మోసం జరిగిందని ఆక్రోశించాడు జమీందారు. హీరో ధైర్యం చెప్పాడు. 'మేం పెళ్లి చేసుకుని హాలీవుడ్ వెళ్లిపోతాం. మాతో వచ్చేయండి. మీరు అచ్చు బట్లర్‌లా కనబడతారు. కనుక బట్లర్ వేషాలిప్పిస్తాను. భుక్తికి లోటు లేదు, స్వతంత్రంగా బతకవచ్చు' అని ....! రైరో అనేశాడు జమీందారు.

ఇదీ కథ.

-మంజీర.






ఈ కథను గనుక ఎవరైనా నిర్మాత తెలుగులో సినిమాగా తియ్యదలుచుకుంటే మనకున్న నటీనటుల్లో ఎవరు ఏ పాత్రకు సరిపోతారన్నది బాగా ఊహించి ఈ కింది కూపన్‌లో తుడుపులు, కొట్టివేతలు లేకుండా నీటుగా రాసి 31-10-2001లోగా పంపండి. ఫ్రమ్ అడ్రస్ రాయడం మరచిపోవద్దు.

ఈ కథను ప్రముఖ దర్శకుడు శ్రీ ఇ.వి.వి.సత్యనారాయణ గారికి వినిపించడం జరిగింది. ఏయే పాత్రలకు ఎవరెవరు సరిపోతారో ఆయన సూచించారు కూడా. ఆయన ఊహకు దగ్గరగా వున్న సూచనను పంపిన వారికి రూ.500/-లు ఒక తప్పుతో పంపినవారికి రూ.300/-లు రెండు తప్పులతో పంపినవారికి రూ.200/-లు బహుమతిగా పంపడం జరుగుతుంది. ఆయా విజేతలకు ఈ పత్రికను విక్రయించిన ఏజెంట్‌లకు కూడా బహుమతులు అదే పద్ధతిలో వుంటాయి.

ఇలా పాఠకులు కూడా తాము చదివిన 'కామెడీ బేస్‌గా వున్న ఇంగ్లీషు నవల' యొక్క కథా సంగ్రహాన్ని గానీ, సినిమాకు పనికొచ్చే విధంగా తాము స్వంతంగా రాసిన కామెడీ కథ గాని పైన రాసినట్టుగా సింగిల్ లైన్ ఆర్డర్‌లో రాసి మాకు పంపొచ్చు. 'ఏమో... గుర్రమెగరా వచ్చు' అన్నట్టు క్లిక్ అయితే మీరే ఓ సినీ కథా రచయిత అవుతారేమో...!? ప్రయత్నించి చూడండి.

## పాత్రలు - పాత్రధారులు

| | | | |
|---|---|---|---|
| **పాత్రలు** | **జమీందారు** | **పెద్దకూతురు** | **ఇల్లరికపుటల్లుడు** |
| **పాత్రధారులు** | | | |
| **పాత్రలు** | **రెండోకూతురు** | **నాటక రచయిత** | **హీరోయిన్ (మూడో కూతురు)** |
| **పాత్రధారులు** | | | |
| **పాత్రలు** | **హీరో** | **సైడు హీరో** | **హాలీవుడ్ తార** |
| **పాత్రధారులు** | | | |
| **పాత్రలు** | **మాజీదొంగ** | **వంటలక్క** | **జమీందార్ బట్లర్** |
| **పాత్రధారులు** | | | |

పంపిన వారి పేరు:.................................................................. వయస్సు: ...............................

అడ్రసు:..........................................................................................................................

....................................................................................... ఫోన్ నెంబరు:.......................

న్యూస్ ఏజంటు పేరు, అడ్రసు:

# (ఇప్పుడు) ఉషాఉతుప్ .... మాల్గాడి శుభ (అప్పుడు) ఒక్క గంగుబాయి హంగల్ మాత్రమే



గంగుబాయిని అందరూ 'లేడీ ఆఫ్ ఖయాల్' అని పిలుస్తారు. ఖయాల్ సంగీతం చాలవరకు పురుషులకే పరిమితమైందిగా భావిస్తారు. అలాంటి పురుషాధిక్యత ప్రపంచంలోకి అడుగుపెట్టిన గంగుబాయి తనకంటూ ఓ స్థానాన్ని సంపాదించుకోవడం, 'లేడీ ఆఫ్ ఖయాల్' అనిపించుకోవటం అంటే నిజంగా 'గ్రేట్' అన్నమాటే.

గంగు బాయి కర్ణాటకలోనే ధార్వార్‌లో జన్మించింది. ఆమె కుటుంబంలో సంగీతమే జీవనోపాధిగా ఉండేది. ఆమె తల్లి కూడా గాయకురాలే. అయితే ఆ రోజుల్లో స్త్రీల పట్ల ఎంతో వివక్షత చూపేవారు. వాటన్నంటిని గంగుబాయి ఓర్పుగా సహించింది.

చిన్ననాటినే తల్లి దగ్గర కర్ణాటక సంగీతం నేర్చుకోవడం ఆరంభించిన గంగుబాయి తల్లివేసిన పునాదే తానీ స్థాయికి రావడానికి కారణమని సగర్వంగా చెప్తుంది. ఎందుకంటే సంగీతంలో ప్రధానంగా నేర్చుకోవాల్సింది స్వరస్థానాలు ... స్వరాల ఆరోహణ, అవరోహణలలో భేదం, అలాగే తాళం కూడా తప్పకుండా సాగడం" ఇవన్నీ.

గంగుబాయికి కర్ణాటక సంగీతం మీదకన్నా హిందుస్తానీ సంగీతం మీద ఆసక్తి ఎక్కువ ఉండేది. అందువల్లనే గ్రామ్‌ఫోన్స్ అమ్మే దుకాణాల నుంచి విన్పించే మరాఠీ పాటలు, హిందుస్థానీ సంగీతం వింటుండేది. ఆ పాటలు విన్పిస్తే చాలు తనని తాను మర్చిపోయేది.

కూతురి ఆసక్తిని, అభిరుచిని అర్థం చేసుకున్న తల్లి అంబాబాయి గంగుబాయిని కృష్ణాచార్య హుల్గురు దగ్గర సంగీతం నేర్చుకోవటానికి పంపించింది. ఆ సమయంలోనే గంగుబాయి రెండేళ్ళపాటు కథక్ నృత్యం అభ్యసించిందికూడా!

గంగుబాయికి మొదటినుంచి నృత్యం మీదకన్నా సంగీతం మీదే అభిరుచి ఎక్కువ. అందువల్ల నృత్యాభ్యాసాన్ని వదిలేసి సంగీత శిక్షణని కొనసాగించిదామె. అదీగాక డ్యాన్స్ వల్ల తన స్వర మాధుర్యం దెబ్బతింటుందేమోనని గంగుబాయి భయం.

తన పదహారవ ఏట సవాయి గాంధర్వ దగ్గర సంగీతాభ్యాసం మొదలు పెట్టింది. గంగుబాయి. పండిట్ భీమ్‌సేన్ జోషి వంటి ప్రముఖులకి కూడా ఆయనే శిక్షణనివ్వడం గమనార్హం. మూడేళ్ళపాటు సాగిన ఈ శిక్షణకుగాను ఆమె గురుదక్షిణగా 20 తులాల బంగారం కూడా సమర్పించుకుంది.

గంగుబాయి తొలిప్రదర్శన బెల్గావ్‌లో జరిగింది. కాంగ్రెస్ సభలలో గంగుబాయి పాడినప్పుడు ఆ సభకి మహాత్మాగాంధీ కూడా హాజరయ్యారు.

ఆమె స్వరంలో స్త్రీత్వం కన్నా పురుషత్వమే ఎక్కువ కన్పిస్తుంది. అందువల్లనే నేడు ఉషాఉతుప్, మాల్గాడి శుభలను ఎలా ఆదరిస్తున్నారో నాడు గంగుబాయిని కూడా ఆ విధంగానే ఆదరించేవారు.

చిన్నతనంలోనే విజయాల్ని సాధించిన గంగుబాయి అతిసామాన్యంగా కన్పిస్తుంది. 'బహుశ చిన్నప్పుడు పడిన కష్టాలు, ఎదుర్కొన్న సమస్యల వల్ల కావచ్చు నేనెప్పుడూ ఇలా నేలమీదే నిలబడి ఉన్నాను' అంటుందామె.

మనిషి ఏం సాధించాలన్నా ప్రశాంతత కావాలి. ప్రశాంతంగా ఒక చోట కూర్చుని తన మార్గాన్ని, శక్తియుక్తులను, తానున్న పరిస్థితుల్ని అంచనా వేసుకోవాలన్నది గంగుబాయి అభిప్రాయం.

ముఖ్యంగా కళాకారులకైతే ఈ ప్రశాంతత మరీ ముఖ్యం అని చెప్తుందామె.

గంగుబాయి కుటుంబం చాలా పెద్దది. ఒకానొక సమయంలో కుటుంబాన్నంతా పోషించాల్సిన బాధ్యత ఆమె మీద పడింది. అందుకే 'నేను మొదట్లో పాటలు పాడింది నా కుటుంబ సభ్యుల ఆకలి తీర్చడానికే" అని అంటుందామె. "రసస్వాదన, ఆనందం, తాదాత్మ్యత ఇవన్నీ తర్వాతొచ్చాయి" అని కూడా ఒప్పుకుంటుంది నిజాయితీగా.

ఎనభై ఆరేళ్ళ వయసులో కూడా ఎవరైనా అడగగానే ఉత్సాహంగా స్వరం శృతి చేసుకుంటుందామె. ఈ వయసులో కూడా ఎలా పాడగలుగు తున్నారని అడిగితే 'ఏం వృద్ధాప్యంలో ఆహారం తీసుకోమా! ఇది అంతే...!!" అంటారు. అంటే ఆవిడ దృష్టిలో సంగీతమే ఆమెకి ఆహారం.... పాటలే ఆమెకి కడుపు నింపుతాయి.... అదో తృప్తి.... అది అర్థం కావడం కష్టం అని పేర్కొంటుందామె.

భారత ప్రభుత్వం గంగుబాయి హంగల్‌ని పద్మభూషణ్ అవార్డుతో సత్కరించింది.

**-ఆదెళ్ళ శివకుమార్**




చిత్రం : సాగరసంగమం (1983)
బ్యానర్ : పూర్ణోదయాక్రియేషన్స్
దర్శకుడు : కె.విశ్వనాథ్
సంగీత దర్శకత్వం: ఇళయరాజా
ఈపాట రచన : వేటూరి సుందర్రామ్మూర్తి
పాడినది : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, యస్.పి. శైలజ
అభినయించినది : కమల్‌హాసన్, జయప్రద

# నాద వినోదము నాట్య విలాసము...



నాదవినోదము నాట్య విలాసము
వాగర్థా వివసంపృక్తౌ
వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే
పార్వతీపరమేశ్వరౌ
వందే పార్వతీ ప...రమేశ్వరౌ
నాదవినోదము
నాట్య విలాసము
పరమ సుఖము పరము
అభినయ వేదము
సభకనువాదము
సలుపు పరమ పదము
భావములో భంగిమలో
గానములో గమకములో ॥భావ॥
ఆంగికమౌ తపమీగతి
సేయగ ॥నాద॥
కైలాసాన కార్తీకాన శివరూపం
ప్రమిదే లేని ప్రమథాలోక హిమదీపం ॥కైలా॥
నవరస నటనం
దని సరిసనిస
జతియుతగమనం
దరిసరిసనిస ॥నవ॥
శివగిరి చరణం
సురనది పయనం
భరతమైన నాట్యం
బ్రతుకు నిత్యనృత్యం ॥భరత॥
తపనుని కిరణం
తామస హరణం ॥తప॥
శివుని నయన త్రయలాస్యం
ధిరన ధిరన నన
తకిట తకిట ధిమి
ధిరన ధిరన నన
నాట్యం
ధిరన ధిరన నన
తకిట తకిట ధిమి
ధిరన ధిరన నన
లాస్యం
నమక చమక సహజం
నట ప్రకృతీ పాదజం
నర్తనమే శివ కవచం
నటరాజపాదసుమరజం
హిరనన
ధిరనన
హిరనన
ధిరనన
ధిరధిరధిరధిర
ధిరధిరధిరధిర
నాద వినోదము
నాట్య విలాసము
పరమ సుఖము పరము
అభినయ వేదము
సభ కనువాదము
సలుపు పరమ పదమూ

ఈ పాటను భాగేశ్రీ, వసంత, లలిత రాగాలతో స్వరపరిచాడు ఇళయరాజా. పాట ఎత్తుగడనుంచి 'ఆంగికమౌ తపమీగతిసేయగ' వరకు భాగేశ్రీ, కైలాసాన కార్తీకాన దగ్గర్నుంచి, 'సురనది పయనం'వరకు వసంత రాగాన్ని 'భరతమైన నాట్యం బ్రతుకు నిత్యనృత్యంలో' లలిత రాగాన్ని ఉపయోగించుకున్నారాయన. ఈ మూడు రాగాలలోనూ అంతర్లీనంగా ఉండే ఆర్ద్రత- పాటను తరువాత వచ్చే విషాద సన్నివేశాలలో నేపథ్యంగా వాడుకోడానికి పనికొచ్చింది. చరణాల మధ్య వచ్చే ఇంటర్ల్యూడ్‌లలో వయొలిన్ ఫోర్సు, నవరసన నటనం దనిసరిసని/జతియుతగమనం దనిసరిసనిస అనే వాక్యాలలలో స్వరాలను రెండు స్థాయిలలో అనిపించటం, ధిరననలు ఇవన్నీ పాటను ఉన్నతస్థాయిలో నిలబెట్టాయి.



గాయనీగాయకులుగా బాలు, శైలజ స్వరజీవితంలో ఈ పాట నిజంగా ఒక ల్యాండ్ మార్క్‌గా చెప్పుకోవాలి.... ముఖ్యంగా శైలజకి! ఎందుకంటే బాలూకిలాంటి పాటలు 'నిత్య నృత్యం' లాంటివి. కానీ శైలజకి మాత్రం ఈ సినిమాలోని పాటవల్ల వచ్చిన గుర్తింపు, గౌరవం ఆనాటికి ఆమె వయసుకి, అనుభవానికి చాలా పెద్ద, మంచి ప్రమోషన్ కింద లెక్క.... ప్రత్యేకంగా ఈ పాటవలన మరీనూ...!

వీరంతా ఒక ఎత్తు. రచయితగా వేటూరి సుందరరామూర్తి విద్వత్తు ఒక్కటీ ఒక ఎత్తు. నాట్యం గురించి చెబుతూ - సభకు అనువదించ దగ్గ అభినయవేదమని పేర్కొనటం, భావంతో భంగిమతో గానంలో గమకంలో ... ఇలా ఆంగికంగా చేసే తపస్సు అని వర్ణించటం, కార్తీకమాసంలో (మంచు గడ్డ కట్టేలా చలి పెరగడం ప్రారంభించే నెల కైలాసంలో శివరూపం-ప్రమథగణాల చేత అవలోకించబడిన హిమదీపంలా ఉంది అనటం (అందులోనూ అది ప్రమిదలేని దీపం) ఇవన్నీ వేటూరి ప్రజ్ఞను మనకు ప్రసరింప చేసే కిరణాలు.

ఇక ఈ పాటలో 'శివునినయన త్రయలాస్యం' అని 'ఎందుకు ప్రయోగించాల్సి వచ్చింది' అనే విషయాన్ని చెబుతూ- ఎడమనుంచి కుడికి గాని, కుడినుంచి ఎడమకి గాని శివుని మూడు కన్నులను భూత, భవిష్యత్, వర్తమాన కాలాలతో పోల్చి చూసుకోండి. మధ్యది ఎప్పుడూ భవిష్యత్తు అవుతుంది. మూడో కన్ను... అదే భవిష్యత్తు ... అది ఎప్పుడూ మూసి ఉంటేనే మంచిది" అని వివరించారు వేటూరి.

వేటూరి సుందరరామ్మూర్తి తన చిన్నతనంలో ఈ 'వాగర్థా వివసంపృక్తౌ శ్లోకాన్ని వల్లె వేస్తూ ఉండగా ఆయన పెదతండ్రి గారైన వేటూరి ప్రభాకర శాస్త్రి గారు వచ్చి 'జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ అంటే అర్థం ఏమిటో తెలుసా?' అడిగారు. "ఈ జగత్తుకి తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులకు నమస్కరిస్తున్నాను అని అర్థం" అంటూ జవాబిచ్చారు సుందరరామూర్తి. "పితరౌ అంటే తల్లిదండ్రులు అనే ఎందుకనుకోవాలి!? పితః ... అంటే తండ్రికి ద్వివచనంగా తండ్రులు అని అర్థం వచ్చేట్టుగా పితరౌ అని వాడి ఉంటారనుకో వచ్చుగా" అని అన్నారు ప్రభాకరశాస్త్రి. దాంతో ఆలోచనలో పడ్డారు సుందరరామ్మూర్తి. "కాళిదాసు శివభక్తుడు కనుక శివపార్వతులను ఉద్దేశించే అయి ఉంటుంది" అని అన్నారు. దానికి ప్రభాకర శాస్త్రి గారు -" కానీ కాళిదాసు ఈ శ్లోకాన్ని రాసింది రఘువంశంలో అది విష్ణువు అవతారమైన రామునికి సంబంధించిన కావ్యం. అంచేత విష్ణువునే స్తుతించాలి. నువ్వన్నట్టు తను సహజంగా శివభక్తుడు కావటం చేత శివుడు, విష్ణువూ ఇద్దరూ ఈ జగతికి తండ్రులు అని అన్నాడు" అంటూ వివరించారు. "మరి పార్వతీ పరమేశ్వరౌ అని అన్నాడు కదా!?" అంటూ తన మనసులోని సందేహాన్ని ముందుంచారు సుందరరామ్మూర్తి. "దాన్ని ఇలా విడదీసుకుని చూడు. 'పార్వతి' అంటే పార్వతి భర్త అయిన శివుడు అని, రమేశ్వరౌ అంటే లక్ష్మీదేవి భర్త అయిన విష్ణువు అని అనుకుంటే సరిపోతుందిగా" అంటూ విశ్లేషిస్తూ విపులీకరించారు ప్రభాకర శాస్త్రి. పదాల్ని విడదియ్యటంలోనూ కలపడంలోనూ ఎంతటి రసజ్ఞత వెల్లివిరుస్తుందో, అర్థాల్ని స్థూలదృష్టితో కాకుండా సూక్ష్మదృష్టితో చూస్తే ఎంతటి విజ్ఞత కలుగుతుందో అప్పుడర్థమయింది వేటూరి సుందరరామూర్తికి. 'సాగర సంగమం' లోని ఈ 'నాద వినోదము' పాట రికార్డింగ్ అవుతుండగా ఇదంతా గుర్తొచ్చింది వేటూరికి. ఆ రోజుల్లో తాంబూలం వేసుకునే అలవాటు కూడా ఉండే దాయనికి. "ఒరె ఒరె ఒరె ఉండరా" అని అన్నా రాయన - పాట రిహార్సల్స్ చేస్తున్న బాలుతో నోటి నిండా ఉన్న కిళ్ళీని ఓ పక్కకి జరిపి మాట్లాడడానికి ప్రయత్నిస్తూ బైటికెళ్ళి నోరు శుభ్రం చేసుకొని వచ్చి 'పార్వతీ పరమేశ్వరౌ'ని ఎలా విడగొట్టి పలికితే ఎలాంటి అర్థం వస్తుందో చెప్పి తన ఫ్లాష్ బ్యాక్‌ని వివరించారు బాలూకి. ఆయన చెప్పింది బాలూకి, విశ్వనాథ్‌కి నచ్చింది. ఆ ప్రకారమే శ్లోకంతో ఆ మార్పు చోటు చేసుకుంది.

విదేశీ స్పెషల్




# చంద్రుడిపై ఎడ్డీమర్ఫీ డ్రామా



రాబోయే ఎడ్డీ మర్ఫీ సినిమా "ప్లూటో నాష్" కథ చంద్రుడిపై సాగుతుంది, 'అది 2097వ సంవత్సరం. చంద్రుడిపై ఓ నైట్‌క్లబ్. దాని ఓనరు ప్లూటో నాష్ (ఎడ్డీ మర్ఫీ వేసే పాత్ర పేరు). లోకల్‌గా ఉండే అండర్ వరల్డ్ మనుష్యులు వచ్చి క్లబ్ అమ్మమని గొడవ పెడతారు. ప్లూటో నాష్ అమ్మనంటాడు. దానితో గొడవ మొదలవుతుంది...,'

ఈ సినిమా కథ తెలియగానే ఓ విమర్శకుడు ఇలా వ్యాఖ్యానించాడు- "ఎడ్డీ మర్ఫీ రీమేక్‌లను ఎక్కువగా నమ్ముకున్నాడు. 'డా॥ డూ లిటిల్', 'నట్టీ ప్రొఫెసర్'లే దానికి ఉదాహరణలు. మొదటిసారి కథ వినగానే ఒరిజినల్ థీమ్‌లా ఉందే అనుకున్నాను. జాగ్రత్తగా ఆలోచిస్తే ఇది కాసబ్లాంకా కథలా ఉందే ననిపించింది. అందులోనూ క్లబ్ ఓనరూ, అండర్ వరల్డ్ డాన్‌ల సంబంధమేగా!"

ప్రపంచ సినిమా చరిత్రలో ఉత్తమోత్తమమైన చిత్రాల లిస్టులో "కాసబ్లాంకా"(1942) ఒకటి. హంఫ్రీ బోగార్ట్ ఓ నైట్ క్లబ్ యజమాని. జర్మన్‌ల తాకిడికి దేశం విడిచి పారిపోయేవారిని రహస్యంగా పరిహద్దులు దాటిస్తూంటాడు. ఒకరోజు అతని మాజీ ప్రియురాలు, ఆమె భర్త వస్తారు అతని హోటల్. కొన్నేళ్ల క్రితం చెప్పాపెట్టకుండా ఆమె అతని జీవితంలో నుండి అంతర్ధానమయింది. ఇప్పుడు వచ్చి తనకు, తన భర్తకూ సాయం చేయమంటోంది, అదీ చట్ట విరుద్ధంగా. పట్టుబడితే దండన తప్పదు హీరోకి. ఇప్పుడామెకు సహాయం చేయాలా వద్దా? ఆమె భర్తనేం చేయాలి? అతను తలుచుకుంటే పోలీసులకు సులభంగా పట్టివ్వగలడు. ఈ అద్భుతమైన సెంటిమెంటల్ సినిమాలో హంఫ్రీబోగార్ట్ ప్రియురాలిగా ఇంగ్రిడ్ బెర్గ్‌మన్ గొప్పగా నటించింది.

ఎడ్డీ మర్ఫీ కొత్త సినిమాలో కథను మరింత కాంప్లికేట్ చేశారు. ప్లూటోనాష్ శత్రువులు బయటవాళ్లు మాత్రమే కాదు. అతన్ని క్లోన్ చేస్తే పుట్టిన దుష్టశక్తి (అంటే అతనిలాగే ఉంటుంది. అదే శక్తియుక్తులతో)ని కూడా అతను ఎదిరించవలసి వస్తుంది. కానీ అతనికి సహాయంగా ఒక రోబో ఉంటుంది. తుపాకీ పేల్చ గల తల్లి ఉంటుంది. వీరు చాలనట్టు ఒక ఇటాలియన్ సింగర్ ఫ్రెండొకడు. రాన్ అండర్‌వుడ్ దర్శకత్వంలో ఈ సినిమా జనవరిలో రిలీజవబోతోంది.

రీమేక్‌లు ఎడ్డీకి బాగా కలిసివచ్చాయి. అతని సినిమా జీవితం ఇక ముగిసినట్టే అనుకునే దశలో "నట్టీ ప్రొఫెసరు" (జెర్రీలూయిస్ సినిమాకి





రీమేక్) అతన్ని రక్షించింది. జంతువులతో మాట్లాడే ప్రొఫెసరు 'డా ॥ డూలిటిల్' పాత్ర ఒరిజనల్‌గా రెక్స్ హారిసన్ వేశాడు 1967లో. దాన్ని ఎడ్డీ మర్ఫీ రీమేక్ చేయించుకున్నాడు. 'డిస్టింగ్విష్‌డ్ జంటిల్మన్' కథ కూడా 1939 నాటి 'మిస్టర్ స్మిత్ గోస్ టూ వాషింగ్టన్' కథ ఆధారంగా (దాన్ని పేరడీ చేస్తూనే అనుకోండి) నిర్మితమైంది. అలాగే 'ఫ్లాటోనాష్' కూడా ఎడ్డీకి కలిసిరావచ్చు.

ఎడ్డీ మర్ఫీ అసలు స్వరూపం... ?

కొందరు నటుడంటారు. కొందరు కమెడియన్ (సభ్యాసభ్యాలు పాటించని అని చేరుస్తారు కొందరు) అంటారు. కొందరు గాయకుడంటారు. కొందరు గాత్రకుడు (ఏనీమేటెడ్ మూవీస్‌లో పాత్రలకు గాత్రాన్ని సమకూర్చాడు. కాబట్టి) అంటారు. ఇవన్నీ కాక కథా రచయిత. దర్శకుడు, నిర్మాత కూడా! 'బెవర్లీ హిల్స్ కాప్' పాత్ర అతని కెంతో ఖ్యాతి తెచ్చింది. "నట్టీ ప్రొఫెసర్" వంటి రీమేక్ చిత్రాలు అతని కథ ముగిసిపోయిందనుకున్న సమయంలో మళ్ళీ నిలబెట్టాయి. అంత మాత్రం చేత అతన్ని ఆ పాత్రలకే పరిమితం చేయడం అన్యాయం. అతని కాన్వాస్ అతి విస్తృతమైనది. 1994లో 'వెబ్' మేగజైన్‌లో ప్రఖ్యాత దర్శకుడు జాన్ వేండీస్ మర్ఫీని 'బోనఫైడ్ (అసలైన) మూవీస్టార్' అని అభివర్ణించాడు. అంటే (బర్ట్ లంకాస్టర్, విలియమ్ హొల్డెన్ వంటి) హాలివుడ్ స్వర్ణయుగం నాటి నటుడని రేండిస్ భావం.

ఎందుకంటే ఆ రోజుల్లో హాలివుడ్ నటులని చిన్న వయస్సులోనే స్టూడియో అధినేతలు గుర్తించే వారు. వారికి తర్ఫీదునిచ్చి, సానబట్టి (విజయా వారు రామారావు, రంగారావు, రేలంగిలను తయారుచేసినట్టు) చక్కని నటీనటులుగా రూపు దిద్దేవారు. తారలు కూడా క్రమంగా ఎదిగే వారు. ఒక సూపర్‌హిట్ (పాతాళ భైరవి లాటిది)తో స్టూడియోలకు లాభాలు చేకూర్చి, తదుపరి సినిమాలతో మరింత లాభాలు చేర్చి తాము కూడా బాగా సంపాదించుకునేవారు. ఉన్నత శిఖరాల నధిరోహించాక ఎగుడుదిగుడులు అనుభవించినా తమకంటూ ఓ స్థానాన్ని పదిలం చేసుకునేవారు ప్రేక్షకుల మనస్సుల్లో.

మర్ఫీ కథ కూడా ఇలాటిదే. 19 ఏళ్ల వయస్సుకే యూత్ సెంటర్లలో లోకల్ బార్లలో ప్రదర్శనలిచ్చేవాడు. దానికి కథా, దర్శకత్వం అతనిదే. క్రమంగా మేన్ హట్టన్‌లోని 'కామిక్ స్ట్రిప్' స్థాయికి ఎదగడం, ఆ క్లబ్ యజమానులు ఇతన్ని చూసి ముచ్చటపడి అతని కెరియర్‌ను తీర్చిదిద్దుతామన్నారు. వందలాది టాలెంట్ పోటీలకు హాజరయ్యేక, స్టేజిపై పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్నాక '48 అవర్స్' అనే సినిమాతో తెరప్రవేశం చేశాడు - అది కూడా నిర్మాతలు ఆఖరి నిమిషంలో ప్లాన్లు మార్చుకుని ఇంకో పాత్ర పెడదామనుకోవడంతో! ఒక పిచ్చి హాస్పటల్లోంచి పారిపోయిన వాడికోసం పోలీసు అన్వేషించడం గురించిన కథ అది. ఆ పోలీసుకి సహాయపడే ఓ కిల్లాడి పాత్రను చేర్చారు కొత్తగా. దాన్ని ఎడ్డీకి ఆఫర్ చేశారు. ఎడ్డీ ఎంత తెలివైన వాడంటే పాత్ర చేతికి చిక్కగానే డైరెక్టరుని



## జీవిత విశేషాలు

అసలు పేరు: ఎడ్వర్డ్ రీగన్ మర్ఫీ. పుట్టిన తేది: 1961 ఏప్రిల్ 3. పుట్టినది: న్యూయార్కులో బ్రూక్లిన్‌లో. చదువు: నాసావూ కమ్యూనిటీ కాలేజీలో, (ఓ పక్క చెప్పుల కంపెనీలో సేల్స్‌మన్‌గా పని చేస్తూనే) తల్లి: లివియన్, టెలిఫోన్ ఆపరేటర్, తండ్రి: పోలీసు ఆఫీసరు. ఎడ్డీ తండ్రి బాల్యంలోనే మరణించాడు. తల్లి తిరిగి వివాహం చేసుకుంది. సవతి తండ్రి వెర్నాన్ లించ్ ఐస్‌క్రీమ్ ఫ్యాక్టరీలో ఫోర్‌మన్. తల్లి, సవతి తండ్రి ఎడ్డీని అతని తమ్ముడు చార్లీని (అతనూ నటుడు, సినీ రచయిత అయ్యాడు) సాకేరు.

కుటుంబం: మొదటి భార్య నికోల్ మిషెల్ (మోడల్) రెండో భార్య (1993 నుండి) నికోల్.



ఊహించుకోవచ్చు.

'కమింగ్ టు అమెరికా' (1988) ఇంకో మైలు రాయి. ఓ ఆఫ్రికన్ యువరాజుకు గారాబం ఎక్కువవడంతో తల్లిదండ్రులు చెప్పిన అమ్మాయిని కాకుండా స్వేచ్ఛగా బతికే తెలివైన అమ్మాయి కోసం అమెరికా రావడంపై అల్లిన కథ.

## చెప్పుకోదగ్గ చిత్రాలు

"48 అవర్స్" (1982)
"ట్రేడింగ్ ప్లేసెస్" (1983)
"బెవర్లీ హిల్స్‌కాప్" (1984)
"కమింగ్ టు అమెరికా" (1988)
"ది డిస్టింగ్విష్డ్ జంటిల్మన్" (1992)
"బెవర్లీ హిల్‌కాప్ -3 " (1994)
"ది నట్టీ ప్రొఫెసర్" (1996)
"ములాన్" (1998) (గాత్రం మాత్రం)
"డా॥ డూలిటిల్" 1998
"నట్టీ ప్రొఫెసర్ ॥ ది క్లంప్స్" (2000)
"ష్రెక్" (గాత్రం మాత్రం)
"డా॥ డూలిటిల్ 2 " (2001)

కలిసి పాత్ర గురించి తన అభిప్రాయాలు చెప్పి దాన్ని ఇంకా ఎలా బాగా చేయవచ్చో చర్చించాడు. ముందుగా పాత్రపేరు 'విల్లీబిగ్స్' బొత్తిగా నీగ్రోపేరులా ఉంది. రెగ్గీహామండ్ అని పెడదాం' అన్నాడు. డైరెక్టరు వాల్టర్ హిల్ సరేనన్నాడు. క్రమేపీ ఆ పాత్రకు అనేక మెరుగులు దిద్ది స్వంతం చేసుకున్నాడు. సినిమా కూడా ఆద్యంతం ఉత్కంఠ భరితంగా సాగుతుంది. దానితో తన తొలి సినిమా తోనే ఎడ్డీ మర్ఫీ విజయ పతాకాన్ని ఎగురవేశాడు. అప్పటికి అతనికి 21 ఏళ్లు ఆ వెనువెంటనే వచ్చింది. - 'ట్రేడింగ్ ప్లేసెస్' (1983). ఓ నిజాయితీపరుడైన, వ్యాపారస్తుడు ఓ రోడ్డు సైడు కిల్లాడి స్థానాలు మార్చుకునే కథ. బ్రహ్మాండమైన కామెడీ. సూపర్‌హిట్. ఆ తర్వాత వచ్చినది ఎడ్డీ లైఫ్‌టైమ్ పాత్ర. 'బెవర్లీ హిల్స్ కాప్' (1984). దానికి మూడు సీక్వెల్స్ వచ్చేయంటేనే అదెంత గొప్ప సక్సెసో

ఇన్ని విజయాలు పొందడం ఓ నల్ల నటుడుకి (ఆఫ్రో - అమెరికన్ నటులంటారు వీరిని - అంటే ఆఫ్రికా నుండి వలస వచ్చి అమెరికాలో స్థిరపడ్డ నీగ్రో సంతతికి చెందినవారన్నమాట) అసాధ్యం అనుకున్నవారు నాలిక కరుచుకోవలసి వచ్చింది. కానీ దీనివల్ల ఎడ్డీ మరో కొత్త భారాన్ని నెత్తికెక్కించుకోవలసి వచ్చింది. హాలివుడ్‌లో మరింత మంది నల్లజాతీయులు ప్రముఖ స్థానాలను పొందేట్లుగా చూడడం ఎడ్డీ నైతిక బాధ్యత అని తీర్మానించారు అతని జాతి వాళ్లు. స్పైక్‌లీ అనే దర్శకుడు బహిరంగంగా ఎడ్డీని ఛాలెంజ్ చేశాడు. 'పారమౌంట్' స్టూడియోతో నీకున్న పలుకుబడిని ఉపయోగించి వెనుకబడ్డ నల్లవారిని పైకి తీసుకురా. లేకపోతే నువ్వూ తెల్లవాళ్ళతో కలిసిపోయినట్టే" అని. దీనికి స్పందించో ఏమో కానీ ఎడ్డీ "హార్లెమ్‌నైట్స్" సినిమా తీశాడు. కథ, నటన, దర్శకత్వం, నిర్మాణం అతనిదే. తనతోబాటు ఎంతోమంది. బ్లాక్ కళాకారులకు ముఖ్య పాత్రలిచ్చాడు . కథ కూడా పాతధోరణి గాంగ్‌స్టర్ మూవీల తరహాలో ఉంటుంది. కానీ దాన్ని విమర్శకులు గానీ ప్రేక్షకులు గానీ ఎవ్వరూ ఆదరించలేదు. ఆ తర్వాత వరుసగా ఫ్లాప్‌లు వచ్చి పడ్డాయి. దాంతో ఎడ్డీ మర్ఫీ యుగం ముగిసి జిమ్ క్యారీ శకం అరంభమయినట్టే అన్నారందరూ.



చిత్ర పరిశ్రమ యావత్తూ మంగళం పాడేస్తున్న సమయంలో ఎడ్డీ మర్ఫీ ఓ చమత్కారం చేశాడు- 'ది నట్టి ప్రొఫెసర్'తో. 1963 నాటి జెర్రీ లూయిస్ 'ది నట్టీ ప్రొఫెసర్' రీమేక్ ఇది. పునర్జీవితం పొందాడని అభిమానులు అనుకుంటుండగా "మెట్రో (1997) వచ్చి ఆశలు తుడిచి పెట్టేసింది. మళ్లీ అతన్ని బతికించినది వాల్ట్ డిస్నీ వారు తీసిన 'ములాన్' అనే ఏనిమేటెడ్ సినిమా. చైనీస్ జానపద కథపై ఆధారపడిన ఈ సినిమాలో డ్రాగన్ పాత్రకు 'వాయిస్' ఇచ్చాడు ఎడ్డీ. ఆ మరుసటి సంవత్సరమే వచ్చింది. జంతువుల భాష తెలిసిన ప్రొఫెసర్‌గా వేషం కట్టిన డా ॥ డూలిటిల్! అది హిట్ కావడంతో దాని రెండో భాగం కూడా వచ్చింది-ఈ సంవత్సరం హిట్ అయింది. అంతకుముందే "నట్టీ ప్రొఫెసర్ -2: "ది క్లంప్స్'' వచ్చింది 2000లో కానీ





ఫెయిలయ్యింది (ఈ రెండు సినిమాలకు అతను తీసుకున్న పారితోషికం మాత్రం సమానమే! 20 మిలియన్ డాలర్లు. కానీ ఫలితాలు మాత్రం వేరుగా వచ్చాయి.

ఈ సంవత్సరం విడుదలైన వాటిల్లో 'ష్రక్' అనే ఏనిమేటెడ్ సినిమా ఉంది. ష్రక్ అనే భూతానికి గొంతు అరువిచ్చినది మైక్ మయ్యర్. ("ఆస్టియన్ పవర్" ఫేమ్) కానీ అతనికంటె గాడిదకు పాత్రకు గొంతిచ్చిన ఎడ్డీకి ఎక్కువ పేరు వచ్చింది.

ప్రతిభ ఎంత ఉన్నా ఉత్థాన పతనాలు తప్పవని ఎడ్డీ మర్ఫీ తెరజీవితగాథ తెలువుతుంది. దానితోబాలు ప్రతిభ ఉన్నవాడు పాతాళం నుంచి పైకెగసి చందమామను చేరుకోగలడనీ చెబుతుంది. మరి చందమామపైనే కథ నడిచే 'ఫ్లూటోనాష్' ఎడ్డీ అభిమానులను ఊరిస్తోంది. ఫలితాలు వేచి చూడవలసినదే!

-కమ్యూనికేటర్ ఫీచర్స్

## జైలు నుండి పలాయనం ఎడ్డీ మర్ఫీ పుణ్యం

"ది డిస్టింగ్విష్డ్ జంటిల్మన్' నుండి "బే ఫింగర్" దాకా అనేక ఎడ్డీ మర్ఫీ సినిమాలలో ఒకర్ని చూసి మరొకరని పొరబడడం జరుగుతూంటుంది. సినిమాను నిజ జీవితంలో అనుకరించిన గాథ ఇది. కెవిన్ జెరోమ్ పుల్లమ్ అనే 31 ఏళ్ల వ్యక్తి లాస్ ఏంజిలిస్ జైల్లో శిక్ష అనుభవిస్తున్నాడు. 1999లో హత్యకు పాల్పడ్డాడని అతనిపై అభియోగం. 2001 జులై 6న జైలు ఆఫీసులో నుంచి సివిలియన్ దుస్తులు దొంగిలించి వేసుకుని ఒక దొంగ ఐడెంటిటీ కార్డు తయారు చేసి అది దాని సహాయంతో చూపించి విశాల ప్రపంచంలోకి జారుకున్నాడు పుల్లమ్. ఆ ఐడెంటిటీ కార్డుపై అతను అతికించిన ఫోటో ఎవరిదో తెలుసా? ఎడ్డీమర్ఫీది. "డా॥ డూ లిటిల్ -2" సినిమా అడ్వర్టయిజ్‌మెంటులో కనబడే ఫోటోను చింపి దానికి అతికించి ఆ కార్డు తయారుచేసాడు. ఇప్పుడు ఎక్కుడున్నాడో తెలియదు కానీ, 'ఎడ్డీమర్ఫీ జిందాబాద్' అనుకుంటాంటాడు గాబోలు!



■ 1985 ప్రాంతాలలో నటుడిగా మంచి పాపులర్‌గా ఉండగా ఎడ్డీ మర్ఫీ మ్యూజిక్ కెరియర్ మొదలుపెట్టాడు. రిక్‌జేమ్స్‌తో కలిసి 'హౌకుడ్ ఇట్ బీ' ఆల్బమ్, 'పార్టీ ఆల్ ది టైమ్' సింగిల్ చేశాడు. 1989లో 'సో హ్యాపీ' వచ్చింది.

■ రిచర్డ్ ప్రయర్ అంటే ఎడ్డీ మర్ఫీకు ఆరాధనా భావం. తను కమెడియన్ కావడానికి అతనే కారణం అంటాడు. అతను స్టేజ్ షోలు ఇచ్చినప్పుడు 'ఇతను రిచర్డ్ ప్రయర్ శిష్యుడు, వారసుడు' అన్నారు ప్రేక్షకులు. ఎడ్డీకూడా అదేబాటలో ముందుకుసాగాడు. ప్రయర్‌ని గురువుగా ఎంచాడు. తనకు పేరు వచ్చాక గురువుగార్ని మర్చిపోకుండా 1989లో 'హార్లెమ్ నైట్స్' నిర్మించినప్పుడు ప్రయర్‌కు ముఖ్యపాత్ర ఇచ్చి గురుభక్తి చాటుకున్నాడు.

■ మొట్టమొదటి ఎమ్‌టీవీ వీడియో మ్యూజిక్ ఎవార్డ్స్ ఫంక్షన్ 1984లో జరిగింది. దాన్ని హోస్ట్ చేసినది ఎడ్డీ మర్ఫీయే. మరుసటి సంవత్సరం కూడా ఆ గౌరవం అతనికే దక్కింది.

■ కమెడియన్‌గా తనకు స్ఫూర్తి నిచ్చినది రెడ్ ఫాక్స్ అని చెప్పుకుంటాడు ఎడ్డీ మర్ఫీ! చెప్పుకుని ఊరుకోలేదు. రెడ్‌ఫాక్స్ మరణించినప్పుడు అంత్యక్రియల ఖర్చు భరించాడు.

■ మైకేల్ జాక్సన్ 'రిమెంబర్ ది టైమ్' అనే వీడియో సింగిల్ రిలీజ్ చేశాడు. అది సూపర్ డూపర్ హిట్ అయింది. దానిలో జాక్సన్ ఒక ఈజిప్షియన్ రాణి ప్రియుడు. 'మనం ప్రేమించుకున్న రోజులు గుర్తున్నాయా?' అంటూ ఆమెనుద్దేశించి జాక్సన్ పాడతాడు. ఆమె భర్త, అంటే ఈజిప్టు రాజు జాక్సన్‌ను చంపమని ఆదేశిస్తాడు. కానీ జాక్సన్ అనేక రూపాలు మార్చి ('భారతీయుడు'లో మాయా మశ్చీంద్ర పాటలో కమలహాసన్‌లా) పారిపోతాడు. దానిలో రాజు వేషం వేసింది ఎడ్డీమర్ఫీ! జాక్సన్‌కెంత పేరు వచ్చిందో మర్ఫీకి అంతపేరు వచ్చింది. ఆ వీడియో ద్వారా!

■ జనవరి 2002 నాటికి ఎడ్డీమర్ఫీ ఐదోసారి తండ్రి కాబోతున్నాడు.

■ చార్లీచాప్లిన్‌లా ఓ సినిమాకు కథ రాసి, నటించి సంగీతం సమకూర్చి, దర్శకత్వం వహించి నిర్మించాలని ఆశ నాకు ముప్పై వచ్చేలోగా ఆ పని చేసి తీరతా!" అన్నాడు. ఎడ్డీ మర్ఫీ! 1985లో అంటే 1991 దాకా అతనికి గడువుందన్నమాట. అప్పటిదాకా ఆగకుండా 1989ల్లో 'హార్లెమ్ నైట్స్' చిత్రాన్ని నిర్మించాడు.

ఈ పాటను వివరంగా కావాలని కోరినది శ్రీమతి జి.వి.మంగాదేవి (హైదారాబాదు)




| | |
|---|---|
| చిత్రం | : అక్కాచెల్లెలు (1970) |
| బ్యానర్ | : జగపతి |
| దర్శకత్వం | : ఎ.సంజీవి |
| సంగీతం, దర్శకత్వం | : కె.వి.మహదేవన్ |
| ఈ పాట రచన | : ఆచార్యఆత్రేయ |
| పాడినది | : పి.సుశీల |
| అభినయించినది | : షావుకారు జానకి, అక్కినేని నాగేశ్వరరావు |



పాండవులు పాండవులు తుమ్మెదా
పంచ పాడవులోయమ్మ తుమ్మెదా
కన్నెగానె బతుకు గడిచిపోతుంది
నన్నెవరేలుకుంటారు అనుకున్నది
జానకి అనుకున్నది
శ్రీరామచంద్రుడే చేసుకుంటాడని విన్నది
ఒళ్ళంత జల్లన్నది
ఓయమ్మ ఒళ్ళంతా జల్లన్నది ॥పాండ॥

నవమన్మథుని వంటి నాథుని కనులార
ఒక్కసారి చూడగా ఉబలాట పడ్డది ॥నవ॥
తుమ్మెదా ఉబలాట పడ్డది
పెళ్ళిపీటల మీద వెళ్ళికూర్చున్నది
కళ్ళలో.... కామి సిగ్గు కమ్మేసింది
ఓయమ్మా బుగ్గలకు పాకింది ॥పాండ॥

నీగుండెలో నేనుండి పోవాలి
నా నోము పంట పండాలి ॥నా నోము॥
రాముడే రాముడు జానకే జానకని
ముందు వెనకందరూ మురిసిపోవాలని
జానకి మొక్కుతూ మొక్కుకుంది ॥పాండ॥

# పాండవులు పాండవులు తుమ్మెదా....

పని చేస్తున్నప్పుడు పడే శ్రమని మరచిపోవ టానికి పాట తప్ప మరో మార్గం లేని రోజుల్లో కొన్ని పదాలు జానపదం నుంచి పుట్టాయి. పొలాల్లో దుక్కిదున్నేటప్పుడు, నాట్లు వేసేటప్పుడు, కోత కోసేటప్పుడు, కుప్ప నూర్చేటప్పుడు - ఒక రాగం, ఒక లయ, జతకూడితే అలసట, సేదతీరినట్టు ఉంటుంది. అందుకే 'పనీపాటా' అనే వారు. ఒలియో, చందామామా, ఉయ్యాల, వెన్నెలా, జాజిరి, కోలోకోలో, తుమ్మెదా వంటి పదాలు ఆ అవసరం లోంచి పుట్టినవే. అలాగే దమ్ముపెట్టి చేసే పనులకు హైలెస్సా, జంబైలే జోలంగరు వంటి పదాలు సమకూరాయి. పండిన పంట చేతికొచ్చిన ఆనందంలో స్త్రీలు 'పాండవులు పాండవులు తుమ్మెదా' అంటూ పాడేవారు. ఆ జానపద గీతం పల్లవి ఇలా ఉండేది:

పాండవులు పాండవులు తుమ్మెదా
పండపాండవులె తుమ్మెదా
ఓయి భామల్లాల తుమ్మెదా
పండిన వరి చేలు తుమ్మెదా
పాయల్లో తొక్కింది తుమ్మెదా

ఈ పల్లవిని తీసుకొని ఆత్రేయ 'అక్కాచెల్లెలు' చిత్రంలో రాసిన పాటే - 'పాండవులు పాండవులు తుమ్మెదా పంచ పాండవులోయమ్మ తుమ్మెదా'! ఎన్నాళ్ళనుండో కన్యగా ఉండిపోయిన ఓ యువతి తన నోము పంట పండిందన్న సంతోషంతో పాడే పాటకు పంటలు పండే వేళలో స్త్రీలు పాడే పల్లవిని జత చేస్తే బావుంటుందన్న ఆలోచన ఆత్రేయకు వచ్చి ఉండాలి. అందుకే చివరి చరణంలో 'నా నోము పంట పండాలి' అంటూ రాశాడాయన.

పోతన భాగవతంలోని 'కమలాక్షు నర్చించు కరములు కరములు ;శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ' పద్యాన్ని లాటానుప్రాస అలంకారానికి సదుపమానంగా వ్యాకరణ పండితులు పేర్కొంటారు. ఈ పాటలో ఆత్రేయ రాసిన 'రాముడే రాముడు 'జానకే జానకనీ' 'జానకి మొక్కుతూ మొక్కుకుంది.' వాక్యాలు కూడా ఆ అలంకారానికి ఉదాహరణగా చెప్పుకోవచ్చేమో... అదీకాక ఈ వాక్యాలు - నుదిటి రాత ఇలా ఉంటే బావుంటుందని అనుకోవటం లాంటివి కనుక - 'లలాటానుప్రాస' అని చమత్కరించుకుంటే పండితులు రంధ్రాన్వేషణ చేయకుండా రసాస్వాదన గావిస్తారనే అనుకుందాం.

ఇక సంగీతపరంగా చూసుకుంటే - జానపద బాణీల ఆధారంగా ఎక్కువ పాటలను చేసిన సంగీత దర్శకుడు కె.వి.మహదేవన్ కనుక ఈ అవకాశాన్ని ఆయన నూటికి నూరుపాళ్ళూ చక్కగా ఉపయోగించుకున్నాడు. ఎంతగా సద్వినియోగం చేసుకున్నాడంటే "అసలు బాణీ ఎంతో - మహదేవన్ కాంట్రిబ్యూషన్ ఎంతో తెలియనంత... లేదా... మహదేవన్ పూర్వీకులెవరో ఎప్పుడో చేసిన ట్యూనే మనకి జానపదసంప్రదాయంగా వచ్చేసిందా అనే అనుమానం కలిగేటంత....!?".

కొన్నేళ్ళ తర్వాత 'మనవూరి పాండవులు' చిత్రం కోసం బాపు దర్శకత్వంలో ఇదే పల్లవితో మళ్ళీ మహదేవన్ మరో ట్యూన్ చేయవలసి వచ్చిందంటేనే ఊహించుకో వచ్చు మొదటి పాట ఎంత హిట్ అయిందో...!?

ఇదిలా ఉండగా, అడపాదడపా పాటల కోసం స్టెప్పులు అందంగా వేయవలసిన పరిస్థితి అక్కినేనికి ఉన్న అదృష్టవంతులు, దసరాబుల్లోడు, ప్రేమనగర్ చిత్రాల తర్వాత అక్కినేని - మహదేవన్ - ఆత్రేయ కాంబినేషన్ అంటే చాలు అద్భుతమైన స్టెప్పులు పాటలో ఉంటాయన్న నమ్మకం, క్రేజు ప్రేక్షకులలో ఏర్పడిపోయింది. అటువంటి ఉధృతమైన ఊపులో - అక్కినేని చేత పాటలో ఒక్క సెప్పు వేయించకుండా అంత వరకు స్టెప్పుల పరంగా ఏ మాత్రం ఇమేజ్ లేని షావుకారు జానకి చేత స్టెప్స్ వేయిస్తే, "ఆ పాట, ఆ సీను హిట్ అవాలంటే పాటలో ఎంత దమ్ము ఉండాలి!?". పైగా అంతవరకు ఎడిటర్‌గా పని చేసిన అక్కినేని సంజీవి ఈ చిత్రానికి దర్శకుడు. అంతకుముందు ఆయన 'ఇల్లాలు' అనే ఓ చిత్రానికి దర్శకత్వం వహించారు. అది ఫెయిలయింది. ఆ నేపథ్యంలో ఈ నిర్ణయం నిజంగానే ఓ సాహసం అనే చెప్పాలి. ఏమైతేనే పాట హిట్ అయి ఇవాళ్టికీ గుర్తుండి పోయివుంటే నిజంగా ఆ పాటలోని సత్తాయే కాబోలు!

# మహేంద్ర కపూర్‌తో ఇంటర్వ్యూ



మహేంద్ర కపూర్ అనగానే మీకే పాట గుర్తొస్తుంది?
'మేరే దేశ్ కీ ధర్తీ....'?
'చలో ఇక్ బార్...'
'ఆధాహై చంద్రమా...'
'నీలే గగన్‌కే తలే...'
ఏది గుర్తుకు వచ్చినా ఆశ్చర్యం లేదు.
అన్నీ గుర్తుకు వచ్చినా అబ్బురం లేదు.
నిండైన, తన కంఠస్వరంతో
ఆయన లోతుగా వెళ్లి
హృదయాన్ని స్పృశించే
గజల్ పాడ గలడు. లేదా పైకి వెళ్లి
హైపిచ్‌లో ఎలుగెత్తి పాడి భగవంతుణ్ని
తన భజన్‌ద్వారా మేల్కొల్పి కిందకు
తీసుకురాగలడు. ఆయనకు పద్మశ్రీతో
సహా అనేక రాష్ట్ర, కేంద్ర అవార్డులు
వచ్చాయి. ఇటీవల మరో తురాయి
కిరీటానికి అమిరింది.
అది మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఇచ్చే
లతామంగేష్కర్ అవార్డు.
ఆ సందర్భంగా ఆయన
చెప్పిన కొన్ని ముచ్చట్లు

**ఇవి...**

1950లలో 'ఆలిండియా మెట్రో మర్ఫీ సింగింగ్ కాంపిటీషన్' పేర కొత్త గాయకులను ఎన్నుకునే ప్రక్రియ జరిగింది. అప్పట్లో మర్ఫీ బహుళ ప్రాచుర్యం ఉన్న రేడియో కంపెనీ. ఐదుగురు ప్రఖ్యాత హిందీ సంగీత దర్శకులు - నౌషద్, సి.రామచంద్ర, మదన్‌మోహన్, అనిల్ బిశ్వాస్, వసంత్ దేశాయి ఒక టీముగా ఏర్పడి వారికి సహాయ పడ్డారు. దేశం మొత్తం మీద ఒక గాయకుడిని, ఒక గాయనిని ఎంపిక చేయాలి. అలా ఎన్నికైన వారికి ఈ సంగీత దర్శకులు తమ సినిమాలలో పాడించి ఛాన్స్ నివ్వాలి. అదీ ఒప్పందం. దేశం మొత్తం అంటే పోటీ ఎంత తీవ్రంగా ఉంటుందో ఊహించుకోవచ్చు. పాల్గొనే వారికి శాస్త్రీయ సంగీతం తెలిసి ఉండాలి. ఏ తరహా పాటైనా పాడగలిగి ఉండాలి. అలా 10 ఎలిమినేషన్ రౌండ్స్‌లో కాచివడపోయగా గాయకుడిగా ఎన్నికయ్యారు మహేంద్రకపూర్. సి.రామచంద్ర తన మాట నిలబెట్టుకున్నారు. ఆయన అప్పుడు శాంతారాం 'నవరంగ్' (1959) 'నవరంగ్' కి సంగీత దర్శకత్వం వహిస్తున్నారు. అది పూర్తి సంగీత, నృత్యభరిత చిత్రం. శాంతారాం పెర్‌ఫెక్షనిస్టు. సి.రామచంద్ర మంచి 'ఫామ్'లో ఉన్న రోజులవి. పాడడానికి చాలా సాహసం కావాలి. మహేంద్ర కపూర్ ప్రొఫెషనల్‌గా పాడిన ఆ తొలిపాట 'ఆధాహై చంద్రమా'. హీరోయిన్ నెత్తిమీద ఏడు కుండలు పెట్టుకుని నృత్యం చేస్తూ హీరోతో కలిసి పాడే ఆ పాట నాలుగున్నర దశాబ్దాల పాటు తర్వాత కూడా ఇప్పటికీ మార్మోగుతూనే ఉంటుంది చెవుల్లో.

## ఆ పాట అనుభవాల గురించి:

"అది నా తొలి పాట. సి.రామచంద్రగారి సంగీత దర్శకత్వంలో ఆశాభోంస్లేతో కలిసి పాడాను. పాట రికార్డింగు తర్వాత రామచంద్రగారికి నా వాయిస్ నచ్చలేదు. 'కొత్త కుర్రవాడు నెర్వస్‌గా ఉన్నట్టున్నాడు. గొంతు బాగోలేదు. కాన్సిల్ చేసేస్తాను' అన్నారు రామచంద్ర. ఆశాజీకి ఆయన బాగా తెలుసు. అందుకని ధైర్యంగా వాదించారు. 'అతని వాయిస్‌లో ఏ లోపం లేదు. చక్కగా పాడాడు' అని, కొంత తర్జన భర్జనలయ్యాక జాగ్రత్తగా చూస్తే రికార్డింగు పరికరం ఒక దానిలో లోపం వున్నట్టు తేలింది. దాని సరిచేసాక రామచంద్ర గారికి నా వాయిస్‌తో తృప్తి పడ్డారు. ఆ విధంగా ఆశాజీకి నేనెంతో ఋణపడి వున్నాను." అని అంటారాయన

'ఆధాహై చంద్రమా...' తొలిసారిగా రికార్డు అయినా అంతకంటె ముందు రిలీజయిన పాట 'చాంద్ ఛుపా ఔర్ తారే డూబే...' అనే పాట 'సోహ్నీ మహీవాల్' అనే చిత్రం కోసం నౌషద్ ఆ ఏడు నిమిషాల ఆ పాటను అతి ధైర్యంగా మహేంద్ర కపూర్‌చే పాడించారు. 'సోహ్నీమహీవాల్' విఫల ప్రేమను తెలిపే ఓ పంజాబీ జానపద గాథ. సోహ్నీ అనే అమ్మాయి ఒక కుండ సహాయంతో నది దాటి తన ప్రియుడు మహీవాల్‌ను కలుసుకోవడం వెళ్లడం గురించి వర్ణిస్తుంది ఆ పాట. కథ పంజాబీ వాతావరణానికి సంబంధించినది కాబట్టి రస్టిక్, ఫుల్ త్రోటెడ్ పవర్‌ఫుల్ వాయిస్ కావాలి ఆ పాటకు. మహేంద్ర కపూర్ కూడా పంజాబీయే కాబట్టి అతని గొంతు దీనికి సరిపోతుందనుకున్నారు నౌషద్. ఆ విషయం అంతకుముందే ఋజువయింది కూడా. అమెచ్యూర్‌గా మహేంద్రకపూర్ 'హీరో'కి పాడిన పాట ద్వారా. పదవతరగతి చదువుతుండగా మహేంద్రకపూర్‌కి శాస్త్రీయ సంగీతం నేర్పించే వి.బల్సారా 'మద్‌మస్త్' (1953)లో స్నేహల్ భాట్‌కర్ సంగీత దర్శకత్వంలో ఓ నేపథ్య సంగీతం పాడారు. మహేంద్రకపూర్‌కి మ్యూజిక్ డైరెక్టరు ఖయ్యాం బాగా తెలుసు. ఆయన అనిల్ బిశ్వాస్‌కు సిఫార్సు చేశారు కూడా. అప్పుడాయన ప్రదీప్‌కుమార్ హీరోగా నటిస్తున్న 'హీర్' సినిమాకు సంగీత దర్శకత్వం వహిస్తున్నారు. 'హీర్ రాంఝా' కూడా పంజాబ్ నేపథ్యం గల ప్రేమకథయే! మంచి పంజాబీ వాయిస్ ఉన్న కుర్రాడి గురించి చూస్తున్న అనిల్ బిశ్వాస్ మహేంద్రకపూర్‌కి ఓ చిన్న ఛాన్స్ ఇచ్చారు. దాన్ని సరిగ్గా ఉపయోగించుకుని బిశ్వాస్ అభిమానాన్ని చూరగొన్నారాయన.

## 'సోహ్నీ మహీవాల్' పాట గురించి:

"అది హైపిచ్‌లో పాడవలసిన పాట. నౌషద్‌సాబ్ నాకు ఛాన్స్ ఇచ్చారే గానీ, ఇంత సరికొత్త గాయకుడు ఇంతకష్టమైన ఏడు నిమిషాల పాట పాడగలడా అని భయపడ్డారు. వాళ్లింట్లో కూచో పెట్టి రోజుల తరబడి రిహార్సు చేయించారు. ఎందుకైనా మంచిదని రికార్డింగు రోజున మెహబూబ్ రికార్డింగు స్టూడియోను రోజు మొత్తానికి బుక్ చేయించారు. ఫైనల్ రికార్డింగు జరగబోతుండగా ' నా పరువు కాపాడు నాయనా' అన్నారు నాతో. ఆయన ఎంత గొప్పవాడో నాకర్థమయింది ఆ క్షణాలలో. నా శక్తి కొద్దీ పాడాను. ఆయనను, శ్రోతలను మెప్పించాను. నాకు అందరు సంగీత దర్శకులూ ఇష్టమే అయినా నౌషద్ సాబ్ అంతే ప్రత్యేక గౌరవం. ఆయన అన్ని విషయాలూ దగ్గర కూచుని చక్కగా వివరిస్తారు. ఎలా పాడాలో, ఎక్కడ ఒత్తాలో, ఏ విధమైన భావాలు పలికించాలో అన్నీ చక్కగా చెప్తారు. అన్నింటి మించి కళాకారులనందరినీ గౌరవిస్తారాయన.

అందుకే కాబోలు ఆ పాట రిలీజయ్యి నాకెంతో పేరు తెచ్చి పెట్టింది. సరాసరి నా కెరియర్‌కు శ్రీకారం చుట్టింది. అది రేడియోలో వచ్చేటప్పుడు పందాలు కాసే వారుట. 'ఇది రఫీ పాడారా? లేదా?' అని తొలి పాటతోనే రఫీసాబ్‌తో పోల్చబడడం అంటే ఎంత గౌరవం చెప్పండి". అని చెప్పారు మహేంద్రకపూర్.

మహమ్మద్ రఫీ అంటే హిందీ చిత్రసీమలోని గాయకులలో రారాజు అని అందరికీ తెలుసు. గొప్ప గాయకుడిగానే గాక, మనసున్న వ్యక్తిగా, పెద్ద మనిషిగా ఆయనకు మంచిపేరు. ఆయనదీ, మహేంద్ర కపూర్ ఒకటే ఊరు, పంజాబ్‌లోని అమృతసర్. మహేంద్రకపూర్ తన చిన్నతనం నుంచి రఫీ ఇంటికి వెళ్లి కూచుంటుండే వారు.

రఫీ కూడా ఈయన మీద అభిమానంతో తన వెంట రికార్డింగు స్టూడియోలకు తిప్పేవారు. ఆయన పాడే విధానం చూసి మహేంద్రకపూర్ ఎంతో నేర్చుకున్నారు.

## రఫీతో అనుబంధం గురించి:

"నాకప్పుడు 11 ఏళ్లు. మా క్లాసుమేటు ఒకడు రఫీసాబ్ ఉండే ఇల్లు తనకు తెలుసునంటూ అడ్రసు ఇచ్చాడు ఓ రోజు. నేను వెంటనే ఆయన ఇంటికి పరిగెట్టుకెళ్లాను. నా ఆరాధ్యదైవం కళ్లెదుట కనబడితే నోరు పెగలలేదు కొద్దిసేపు. కాస్సేపటికి తేరుకుని నాకు సంగీతం నేర్పమని అడిగాను. ఆయన చిరునవ్వి నవ్వి 'వెళ్లి మీ అమ్మా, నాన్న అనుమతి తీసుకురా' అన్నారు. మా అమ్మగారు మంచి గాయని. ప్రొఫెషనల్‌గా పాడ లేదనుకోండి. మా అమ్మా నాన్నా - ఇద్దరూ పొంగి పోయారు ఆ మాట విని. రఫీసాబ్, వారి అన్న హమీద్‌సాబ్ కూడా నేనంటే ఎంతో అభిమానంగా ఉండేవారు. మా ఇంటికి తరచుగా వచ్చేవారు. మా అమ్మ చేసిన పంజాబీ లస్సీ అంటే రఫీ సాబ్‌కి ఎంతో ఇష్టం కూడా. ఆయన దగ్గర నేనెంతో నేర్చుకున్నాను". అని అంటారు రఫీ గురించి.

బి.ఆర్.చోప్డా సినిమాలలో మహేంద్ర కపూర్ పాటలు తప్పనిసరిగా ఉంటాయి సినిమాలే కాదు. 'మహాభారత్, విష్ణుపురాణ్' వంటి టీవీ సీరియల్స్ తీసినా మహేంద్రకపూర్ ఉండాల్సిందే. చోప్డా సినిమాలలో హీరో రాజేంద్రకపూర్ అయినా సరే, సునీల్‌దత్ అయినా సరే వారికి ఇతర చిత్రాలలో రఫీ పాడుతున్నా ఇక్కడకొచ్చేసరికి మహేంద్రకపూర్ చేత పాడించే వారు చోప్డా. అలాగే వారి ఆస్థాన సంగీత దర్శకుడు రవి. రవి-మహేంద్ర కపూర్ కాంబినేషన్‌లో ఎన్నో ఆణిముత్యాలు వెలువడ్డాయి.

## చోప్డా ఫిలిమ్స్‌తో తమ అనుబంధం గురించి:

"ఆధాహై చంద్రమా" "చాంద్‌భుపా" పాటల తర్వాత రికార్డిస్టు కౌశిక్. యశ్ చోప్డాకు నా పేరు రికమెండ్ చేశారు. ఆయన తన అన్నగారు బి.ఆర్.చోప్డాకు పరిచయం చేసారు. అప్పుడు వారు 'ధూల్‌కా ఫూల్ (1959 ) నిర్మిస్తున్నారు. ఎన్.దత్తా సంగీత దర్శకుడు. లతాజీతో నా తొలి డ్యూయెట్ పాడించారు ఆ చిత్రంలో. అక్కణ్నుంచి మా అనుబంధం మరింత దృఢం అయింది. 'గుమ్రాహ్' (చలో ఇక్ బార్, ఇన్ హవావోఁమే....) 'హమ్‌రాజ్' (నీలే గగనన్‌కే తలే..." "తుమ్ అగర్ సాథ్....' 'వక్త్' (దిన్‌హై బహార్...') 'ధుంద్' (టైటిల్‌సాంగ్) ఇలా ఎన్నో గొప్ప పాటలు తయారయ్యాయి".

మహేంద్ర కపూర్ ఎన్నో ప్రేమగీతాలు పాడేరు. రఫీతో వివాదాలు వచ్చాక ఓపి నయ్యర్ మహేంద్రకపూర్ చేత పాడించుకున్నారు కాబట్టి మరిన్ని రొమాంటిక్ సాంగ్స్ జతపడ్డాయి. అయినా దేశభక్తి గీతాలకు మహేంద్రకపూర్ పేరుబడ్డారు. దానికి కారణం 'మేరే దేశ్‌కీ ధర్తీ...' (ఉప్‌కార్) పాట. ఆ సంవత్సరమే జాతీయ అవార్డులు ఉత్తమ గాయకుడికి ఇవ్వడం ప్రారంభమయింది. బహుమతి తొలిసారిగా మహేంద్రకపూర్‌కి దక్కింది.

## మేరే దేశ్‌కీ ధర్తీ పాట గురించి:

"మనోజ్‌కుమార్ భారీ ఎత్తున స్వంతంగా తీసిన తొలిచిత్రం ఉప్‌కార్. దానిలో ఈ పాట అతి ముఖ్యమైనది. గుల్షన్ బావ్రా రాశారు. సంగీతం కల్యాణ్‌జీ ఆనంద్‌జీ సమకూర్చారు. రికార్డింగు తార్‌దేవ్‌లోని ఫేమస్ రికార్డింగు స్టూడియోలో. మధ్యాహ్నం మూడు గంటలకు చేరారు. అక్కడికి వచ్చేందుకు ముందు 5 సార్లు రిహార్సిల్సు వేసుకు వచ్చినా రికార్డింగు తృప్తికరంగా రాలేదు. 22 టేకుల తర్వాత ఫైనల్‌గా రికార్డు చేసాం. పూర్తయ్యేసరికి తెల్లవారుఝామున 5 గంటలు. బయట తుపాను. ఎక్కడ చూసినా నీళ్లు. మా కార్లు సగం మునిగిపోయేటంతగా నీళ్లు నిలిచిపోయాయి. అయినా మాకిదేమీ తెలియలేదు. పాట సూపర్‌హిట్. 'ఉప్‌కార్' వెనువెంటనే వచ్చిన మనోజ్‌కుమార్ చిత్రం 'పూరబ్ ఔర్ పశ్చిమ్ ( 1970 )'లో మరో దేశ భక్తిగీతం 'హై ప్రీత్ జహా కీ రీత్ సదా' కూడా మంచిపాట. హిట్ అయిన పాట.'

## ఇప్పుడు ఏం చేస్తున్నారంటే....?

"నేను మనోజ్‌కుమార్, సునీల్‌దత్, దిలీప్‌కుమార్, వినోద్‌ఖన్నా, ధర్మేంద్ర, అమితాబ్ బచ్చన్, బిశ్వజిత్, రాజేష్‌ఖన్నా, రాజ్‌బబ్బర్, రిషికపూర్... ఇలా ఎందరికో పాడాను. చివరిసారిగా 'దిల్లగీ' (1978) సినిమాకై ధర్మేంద్రకు పాడాను. ఈ రోజుల్లో స్టూడియోకు వెళ్లి ఎవరి ముక్క వారు పాడుకుని వచ్చేయడమనే పద్ధతి నాకు నచ్చదు. అలా అయితే మూడ్‌లోకి రావడం కష్టమని నా అభిప్రాయం. నాకుండే వ్యాపకం నాకెలాగు ఉంది. నాన్ ఫిల్మీ ఆల్బమ్స్ (ముఖ్యంగా ఆధ్యాత్మిక, భక్తి సంగీతం) చేస్తున్నాను. నేను చేసిన కొత్త పంజాబీ ఆల్బమ్ విడుదలకు సిద్దంగా ఉంది".

## లతామంగేష్కర్ పేర ఇస్తున్న అవార్డు గురించి:

"ధూల్‌కాఫూల్" (1959)లో లతాజీతో కలిసి మొట్టమొదటిసారిగా డ్యూయెట్ పాడేనని చెప్పాను కదా! తేరే ప్యార్‌కా ఆస్‌రా చాహతా హూ" అనే పాట అది. లతా వంటి గొప్ప గాయనితో కలిసి పాడడం ఎలా అని నేను భయపడుతూ కూచున్నాను. ఇంతలో ఆమె చిరునవ్వుతో స్టూడియోలోకి ప్రవేశించారు. అమ్మయ్య అనుకున్నాను. 'నువ్వు నా చిన్న తమ్ముడివి' అన్నారావిడ. నాకు ధైర్యం వచ్చింది. చక్కగా పాడగలిగేను. ఆవిడ గొప్ప ఆర్టిస్టు. సహ గాయకులను ఎప్పుడూ గౌరవిస్తారు. నా బోటి వాడిని కూడా "నేను సరిగ్గా పాడుతున్నానా?' అంటూ సంప్రదిస్తారు. ఆవిడ పేర మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఇచ్చే అవార్డు అందుకోవడం నా అదృష్టం. 2002 ఫిబ్రవరి 17న ఇస్తారు. నేనా రోజుకోసం ఆతృతగా ఎదురుచూస్తున్నాను".

-కమ్యూనికేట్ ఫీచర్స్

అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి
అనువైన శైలిలో తెలిపే

**క్లాసిక్ రీటోల్డ్**

# సాక్షి



కవిశేఖర
పానుగంటి
లక్ష్మీనరసింహారావు



# మగవారి - ఆడువేషాలు

ఒక మహిళా సంఘంలో ఉపన్యాసం ఇవ్వడానికి ఒకామె రాసుకున్న ప్రసంగ వ్యాసం సాక్షి సంఘానికి చేరింది:

మగవాడు మొదటి నుండి మన అభివృద్ధికి అడ్డుపడుతున్నాడని తెలిసి కూడా అతని పాపాన అతడే పోతాడని ఊరుకున్నాం చాలా కాలం. ఇప్పుడు వాళ్లకెదురుతిరిగి అన్నిరంగాలలో పైకి వస్తున్నాము కాబట్టి అసూయతో కొన్ని ఆరోపణలు చేస్తున్నాడు. వారికి సమానం కావాలనే దురాశతో మనం వారిని అనుకరిస్తున్నామని వెక్కిరిస్తున్నాడు. మనకు అవసరమైనది మనం చేస్తున్నాముకాని తనను అనుకరించే ఉద్దేశ్యం ఎంత మాత్రం లేదని అతనికి ఎందుకు తెలియదు? తాను మాత్రం ఎవరిని ఇమిటేట్ చేసి యిన్ని వేషాలు తెచ్చుకున్నాడు?

తను మనను కాపీ కొట్టవచ్చా? కానీ మనం మాత్రం అతన్ని కాపీ కొట్టకూడదా? నాటకాలలో స్త్రీ పాత్రలు మగవాళ్లు ఎందుకు వెయ్యాలి? సొగసుగా ఉంటుందని మనం

**లైటిలాట**






ముంగురులు ఈ చెంపా, ఈ చెంపా, ఒక్క అంగుళం వెడల్పున కత్తిరించుకుంటే ఎంత అల్లరి పెట్టాడు. అలాంటిది తను మీసాలు పూర్తిగా గొరిగించుకుని నాటకం స్టేజి మీద పోతుపేరంటాలులా నిలబడినప్పుడు మనం చెంపలు వాయిస్తే తప్పేముంది?

రైకకు బొత్తాలు అంటించి చేతులు రవంత పొడుగు చేసుకుంటే కళ్లల్లో మేకులు కొట్టుకున్నాడే! అలాంటిది అతనిప్పుడు మన రైక తొడుక్కుని మరేవో తగలబెట్టుకుని సిగ్గులేక ఉభయ భ్రష్టత్వపు ఆడ రూపంతో మగముత్తైదువులా నిలబడితే మనని అవమానించినట్లే కదా!

చుట్ట కాల్చి, మాడ్చుకున్న పెదాల మీద లత్తుక పూస్తాడు. అసలే మన తల కంటే అతని తల పెద్దది. అది చాలనట్టు దానిమీద సవరాలు పెట్టడం! మొత్తం మీద రాకాసి తలలా అనిపిస్తుంది. ఇలా తయారయ్యి తనేదో జగన్మోహిని అవతారం అనుకుంటాడు.



ఆడదానిని అనుకరించడం తన తరమా? అసలు ఆడదాని చూపును అలవర్చుకోగలడా మగవాడు? సూటిగా ఒక్క క్షణం చూసి తక్షణం చూపు మరల్చుకోగల లావణ్యం మగవాడికుందా? మంగళహారతి ఇచ్చినట్టు ఒక్కచూపుతో పరిసరాలన్నీ తిప్పి చూడగల ఆడదాని నేర్పు, కళ్ళల్లో ఒక్కసారి మెరుపు చూపించి అంతలోనే ఆర్పేయగల ఒడుపు మగవాడు స్వంతం చేసుకోగలడా? పెదాలపై పండు వెన్నెల్లా కనబడవలసిన మందహాసాన్ని పెదాల మీదనే దాచేసి కంటికొనలో ఓ మూల దాచేయడం ఆడదానికే తగుతుంది కానీ ఈ నపుంసక రూపానికా?

అసలు ఆడదానిలా నిలబడ గలడా మగవాడు? చనువు ప్రేమ, కనబరచవలసిన భర్త ఎదుట ఎలా నిలబడాలో, కాసంత మాత్రమే గౌరవం చూపాల్సిన పెద్దబావగారి వద్ద ఎలా నిలవాలో, భయగౌరవాలు రెండూ కనబరచవలసిన మామ గారి వద్ద ఎలా నిలబడాలో ఆ తేడా మగవాడు చూపగలడా? ఒక ఉదాహరణ చెప్తాను. నా భర్త 'శాకుంతలం' నాటకంలో ప్రియంవద వేషం వేస్తున్నాడంటే చూడడానికి వెళ్లాను. మొక్కలకు నీళ్లు పోయడానికి శకుంతలతో కలిసి చేతిలో చెంబు పట్టుకుని మా ఆయన స్టేజి ఎక్కాడు. ఎలా నిలబడ్డాడో తెలుసా? ఎడమ చేయి నడుము మీదికి జారి పోయింది. కుడి చేతిలో ఇత్తడి చెంబు పట్టుకుని ప్రాప్టింగు చెప్పేవాడి వైపు చూస్తున్నాడు. అదెలా ఉందో తెలుసా? టాయిలెట్ క్యూలో నిలబడినట్టుంది. అసలు ఏ స్త్రీయేనా అలా నిలబడుతుందా? నడుము మీద చేయి వేసుకుంటే, బుగ్గ మీద వేలు పెట్టుకుంటే, మాటిమాటికి పైట సవరించుకుంటే ఆడదానిని



అనుకరించినట్లేనా? వెర్రి వెర్రి పక్క చూపులు చూసి, ముసిముసి నవ్వులు నవ్వితే మనం ఆడదనుకోవాలా? ఆడదాని వేషం మగవాడికి ఎలా అబ్బుతుంది.

ఒకసారి 'ద్రౌపది వస్త్రాపహరణం' నాటకానికి వెళ్లాను. దుశ్శాసనుడు ద్రౌపది చీరలు ఒలిచే దృశ్యం. చీరలు ఎంత మట్టుకు లాగాలో దుశ్శాసనుడికి తెలియదు. ఎంతవరకూ లాగించుకోవాలో ద్రౌపదికీ తెలియదు. ఇద్దరూ కూడా చెడతాగి ఉన్నారు. ద్రౌపది వేషం స్త్రీ వేసి ఉంటే జాగ్రత్త పడి వుండేది. కానీ వేషం కట్టినది పురుషుడు కదా! 'వద్దు వద్దు' అని తెరచాటు నుండి కేకలు వేసినా దుశ్శాసనుడు ఆగలేదు. ద్రౌపది ఆపలేదు. చివరికి ద్రౌపది వేషధారికి' రైక' క్రింద గావంచా మిగిలింది. నెత్తిపైన బుట్టలా పైన సవరం ఒకటి. సృష్టికంతకు ఒక్కటే దిష్టిపెడతలా ద్రౌపది మిగిలింది. పుట్టు గుడ్డి వేషం వేస్తున్న ధృతరాష్ట్రుడు కూడా ఆ దృశ్యం చూడలేక ఎవరి సహాయం లేకుండానే తెరచాటుకి పారిపోయాడు. కర్టెన్ వేయబోతే పడలేదు. ద్రౌపదికి నాటకం కాంట్రాక్టరంటే భయం వేసింది కాబోలు కిందకు ఉరికాడు. తను ఆడో, మగో మర్చిపోయి పురుషులవైపునే పరిగెట్టాలో, స్త్రీల వైపుకు పరిగెట్టాలో అర్థం కాక చివరికి స్త్రీల వైపు పరిగెట్టి వాళ్ల మధ్యన కూచున్నాడు. ఆడవాళ్లంతా తటాలున లేచిపోయి పాక కాలినంత హడావుడి చేసి కేకలు వేసారు. చివరకు కొందరు మగవాళ్లు వచ్చి ఆ వేషధారిని చావగొట్టారు. కొంతకాలం పాటు ఆడవేషాలు వేస్తే పాత్రధారి ఇలాగే అవుతాడు.



ఇంకొక స్త్రీ పాత్రధారి గురించి చెప్తాను. ఆయన ఓ రోజు మార్కెట్లో కూరలు కొంటున్నాడు. పైన ఉత్తరీయంలో కూరలు మూట కట్టుకుని వెళ్తున్నాడు. జన్మతః ఆడంగివాడు కాదు కానీ పది సంవత్సరాలుగా ఆడ వేషం వేస్తున్నాడు ఓనాటకం కంపెనీలో. ఇంతలో ఆ కంపెనీ యజమాని అలా వచ్చాడు. అతన్ని చూడగానే ఇతను సిగ్గు పడి, ముడుచుకుపోయి మూట గట్టగా మిగిలిన ఉత్తరీయంతో పైట వేసుకోబోయి, అది చాలక పోవడంతో రెండు చేతులను కత్తెరలాగా ఛాతీపై వేసుకుని తలవంచుకుని నిలబడ్డాడు. ఒక్క నిమిషంలో తన మగతనాన్ని మసి చేసుకున్నాడు. అలా అని ఆడదీ కాలేకపోయాడు.

బాహ్య లక్షణాలే అనుకరించలేనివాడు స్త్రీ అంతరంగ లక్షణాలు అనుకరించగలడా? మనను అనుకరించడానికి ప్రయత్నించి భంగపడిన మగవాడు మనం అతన్ని అనుకరిస్తున్నామనడం హాస్యాస్పదం కదూ! అసలు మగతత్వానికి ఆడతనానికి ఎంతో భేదం ఉంది. ఒకటి కఠినం, మరొకటి మార్దవం, ఒకటి హేతుబద్ధం మరొకటి రసప్లుతం. ఇంత విభిన్నత ఉంది కాబట్టే స్త్రీ పురుషులకు ఒకరంటే ఒకరికి ఆకర్షణ ఉంది.

ఇద్దరి మధ్య ఆ గీత చెరిపి వేయబోతే ఇలాగే ఉంటుంది".

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**






నిర్మాత: అల్లు అరవింద్, దర్శకత్వం: సురేష్‌కృష్ణ.

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' పత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## తారాగణం

చిరంజీవి, సిమ్రాన్,

అషిమాభల్లా, రాజేంద్ర ప్రసాద్,
అచ్యుత్, కోట శ్రీనివాసరావు, యమ్మెస్ నారాయణ,
రాజారవీంద్ర, ఉత్తేజ్, అనంత్, గుండు హనుమంతరావు,
బ్రహ్మాజీ, అల్లు అర్జున్, బాలాజీ, అనూష్క

## టెక్నీషియన్స్

కథ: భూపతిరాజా
మాటలు: సత్యానంద్
పాటలు: సిరివెన్నెల, చంద్రబోస్
భువనచంద్ర, శ్రీనివాస్
సంగీతం: యస్.ఎ.రాజ్ కుమార్
కెమెరా: ఛోటా కె.నాయుడు
ఆర్ట్: అశోక్‌కుమార్
కాస్ట్యూమ్స్: షాజీ
మేకప్: శివ (చిరంజీవి)
ఈశ్వరరావు, మోహన్ (కోట)
స్టిల్స్: అల్లు తాతాజీ
ఎడిటింగ్: వెంకటేష్, కె.మార్తాండ్,
స్టంట్స్: విక్రమ్‌ధర్మా
కో డైరెక్టర్: సాయికృష్ణ
ప్రొడక్షన్ కంట్రోలర్: వి.మోహన్
ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: సి.నాగరాజ్









పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' పత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

నిర్మాత: కుందురు రమణా రెడ్డి.
కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం: పి.ఎస్.వాసన్

## తారాగణం

రోహిత్
అనూ
గిరిబాబు
ఎవిఎస్
ఆలీ
ఆహుతిప్రసాద్
రాళ్లపల్లి
గౌతంరాజు
వేణుమాధవ్
శివపార్వతి
శోభారాణి
హనిష్క
శ్రావణి
భాషా

## టెక్నీషియన్స్

మాటలు: నివాస్
సంగీతం: వందేమాతరం శ్రీనివాస్
పాటలు: చంద్రబోస్
నృత్యాలు: శివ శంకర్, ప్రదీప్ ఆంటోనీ, ప్రేమ్
-గోపీ
ఆర్ట్: సి.హెచ్.క్రిష్ణా
ఎడిటింగ్: కోలా భాస్కర్
కెమెరా: ప్రభు
పి.ఆర్.ఓ: ఆర్.డి.ఎస్., ప్రకాష్
ప్రొడక్షన్ ఎక్సిక్యూటివ్:
పి.సత్యనారాయణరాజు
కో - డైరె క్టర్: సి.హెచ్.సాంబశివరావు
సమర్పణ: కుందురు సరిత





రచన: చంద్రబోస్ **1** గానం: శంకర్‌మహదేవన్

లక్కీ లక్కీ ఎంతెంతో లక్కీ
ఈ లోకంలో పుట్టడమే లక్కీ లక్కీ లక్కీ ॥లక్కీ లక్కీ॥
వందేళ్ళకి ఈ ఊపిరి కూడా కొండెక్కి
వెయ్యేళ్ళైనా వెలగాలోయ్ వార్తల్లోకెక్కి
ఆడు ఆడించు, పాడు పాడించు
నవ్వు నవ్వించు, నడువు నడిపించు ॥ఆడు॥ ॥లక్కీ లక్కీ॥

చరణం : అదృష్టానికి టాటా చెప్పేయ్
నీ కష్టానికి కోటా తెచ్చేయ్
ఆవేశానికి బై బై చెప్పేయ్
అనురాగానికి భాగం పంచేయ్
మనలోని గుండెకు పొరుగోడి గుండెకు
నడిమధ్య గోడలు కట్టద్దోయ్
మనసున్న చేతితో పక్కోడి చెంపపై
కన్నీటి చారలు తుడవాలోయ్
అందరి కోసమె, ఆలోచించు ఆనందించు
ఆడు ఆడించు, పాడు పాడించు
నవ్వు నవ్వించు నువ్వు నడువు నడిపించు ॥లక్కీ లక్కీ॥

చరణం : బాంబులు లేని జగతిని చూద్దాం
బాధలు లేని బతుకులు చూద్దాం
చీకటి లేని గడపలు చూద్దాం
ఆకలి లేని కడుపులు చూద్దాం
నేరాలే తక్కువై ఖైదీలే ఉండని
సరికొత్త జైళ్ళను చూడాలోయ్
పగలంటూ మాయమై మమతేమో దైవమై
కొలువున్న గుళ్ళను చూడాలోయ్



ప్రేమించానని మత్తుగా పిచ్చెక్కించే వారిని
ఆ నమ్మొద్దంటే వెక్కిరించుట న్యాయమా న్యాయమా
ఆ నువ్వొద్దన్న మనిషిని ప్రేమిస్తేనే తగదని
నీతులు చెప్పే నిన్ను మాత్రం నమ్మటం సులభమా
ఆ కాకికి కోయిల పాట నచ్చునా కప్పకి పూవుల విలువ తెలియునా
అ లోకుల మాటలు పక్కనెట్టవే కమ్మని ముద్దుల విందు చేయవే
అసూయకు లొంగని ఆడదేది ఈ జగాన
ఆ రవ్వ రగిలింది తీపి తెక్క వెయ్‌నా వెన్నెల్లో పూల పక్క
అ రావే నా పాలకొల్లు ముంత మామిడి చేస్తా సమ్మోహనంగా సోకు ముట్టడి
ఆ సిగ్గేలేదమ్మా హవ్వా హవ్వా హమ్మో ఈ పిచ్చి పేరే లవ్వా
అ రగిలే మనసు రగలనీ పగిలే గుండెలు పగలనీ
క్షణమైనా నిను వదలలేనోయ్ ప్రియతమా ప్రియతమా
అ విరిసే మొగ్గ ఉండగా విచ్చిన పూవు ఎందుకే
పాలు నీరై కలిసిపోదాం ప్రాణమా ప్రాణమా
ఆ మంచని చెబితే నెత్తికెక్కునా గుండెలు పగలగ బుద్ధి వచ్చునా
అ వచ్చేవెన్నెల రాక మానదే పోయే చీకటి పోక మానదే
ఏ నాటికి మారదు మారదు బ్రహ్మరాత
ఆ సిగ్గేలేదమ్మా హవ్వ హవ్వ హమ్మో ఈ పిచ్చి పేరే లవ్వా
అ హమ్మో నేనాగలేను సుందరాంగుడా
కొట్టేయ్‌లవ్ సోకు మీద ముద్దు ముద్దరా
అ రావే నా సీమ రేగుపండా ఉంటాలే కొంత నీకు అండా
ఆ అదిగో చూస్తోంది రాతిబండా వేసెయ్ నా మెళ్ళో పూల దండా
అ నీ టేస్టుకి నా టేస్టుకి కుదిరిందే గొప్ప మ్యాచింగ్ కన్నె కోమలి
ఆ లోకానికి తెలియాలిగా కొట్టేయ్ నా సామి రంగ కుర్ర కౌగిలి
అ రావే నా గండిపేట గువ్వా పెడతా ఎంచక్కా ప్రేమ బువ్వా
ఆ సిగ్గేలేదమ్మా హవ్వా హవ్వా హమ్మో ఈ పిచ్చి పేరే లవ్వా ..



కొరియోగ్రఫీ: ప్రదీప్, ఆంటోని **1** గానం: కె.కె., కోరస్

సాకీ : రీలుకొంటే కెమెరా ఉచితం, రిమోటు కొంటే టీవి ఉచితం
పెట్రోలు కొంటే జిప్సీ ఉచితం, కర్చీఫ్ కొంటే జీన్స్ ఉచితం
లడ్డూకొంటే తిరుమలేశుని కరుణ కటాక్షం ఉచితం
ఉచితం ఉచితం ఉచితం
ఉచితం ఉచితం ఉచితం

పల్లవి : మబ్బుల నుండి కురిసే నీరు ఉచితం... ఉచితం
కొమ్మల నుండి వీచేగాలి ఉచితం.. ఉచితం
జాబిలి నుండి విరిసేవెన్నెల ఉచితం... ఉచితం
సూర్యుని నుండి చిందే వెలుగులు ఉచితం... ఉచితం...
పొందడానికి నువుపొందిన జన్మ ఉచితం
ఇవి పొందడానికి నువుపొందిన జన్మ ఉచితం
ఏవీ వద్దనుకొంటే ఎంచక్కా చావుకూడా ఉచితం...
ఉచితం ఉచితం ఉచితం
ఉచితం ఉచితం ఉచితం

చరణం-1 :మెడికల్ స్టోరులో మందులు ఎందుకు వనమూలికలే ఉచితం
స్టార్ హోటల్లో విందులు ఎందుకు కందమూలములు ఉచితం
క్యాసెట్ కోసం ఖర్చులు ఎందుకు కోకిలపాటే ఉచితం
వేకువ జామున వాచీలెందుకు కోడికూతలే ఉచితం
వెళ్లేందుకు కార్లు ఎందుకు కాళ్లు ఉచితం
ఉండేందుకు ప్లాట్లు ఎందుకు చెట్లు ఉచితం
చూసేందుకు సినిమాలెందుకు పోస్టర్లే ఉచితం
ఉచితం ఉచితం ఉచితం
ఉచితం ఉచితం ఉచితం



నీ కళ్లలోకి రావాలమ్మా నా కలలు
గోరింట పువ్వంటి చేయి - నీది గోధూళి ఎరుపంటి చేయి
మందార పొద్దంటి చేయి - నీది మందహాసమంటి చేయి
నీ చేతిలోన పెట్టానమ్మా నా బ్రతుకు
యీ ఎండమావుల్లో నా గుండె దీవుల్లో కురవాలే -
కన్నె చిన్ని చిరుచిరుచినుకా
॥క్రిష్ణశాస్త్రిలో॥

చరణం-2: పారాణి ప్రభవించు పాదం -
నీది పారిజాతమంటి పాదం
దివినుండి దిగివచ్చు పాదం - నీది దూదిపింజెలాంటి పాదం
నీ పాదాల చెంత చేరిందమ్మా నా హృదయం.
పవనాలు పులకించు శ్వాస -
నీది ప్రాణవాయువంటి శ్వాస
రాగాలు పలుకించు శ్వాస -
నీది రామలాలిలాంటి శ్వాస
నీ ప్రేమ లేక ఆగేనమ్మా నా శ్వాస
నా కంటి గుమ్మంలో నా యింటి గడపల్లో వెలగాలే
కన్నె చిన్ని వెన్నెల వంక ॥క్రిష్ణశాస్త్రిలో॥
..

రచన: 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి **5** గానం: ఉదిత్‌నారాయణ్, చిత్ర

అ మరొక్క మారను ఆమాటే మనస్సు వింటుంది
ఆ పదేపదే ఎద నీమాటే స్మరిస్తు ఉంటుంది.
అ నడిరేయే నిలవదుగా, వెన్నెలగా నువ్వు నవ్వుతుంటే
ఆ ఈ హాయే చెదరదుగా నా జతగానువ్వు చెంతనుంటే
అ చలికాలం రాదుగా వెచ్చనైన కౌగిలికి
ఆ చిగురెప్పుడూ రాలదుగా పచ్చనైన ఆశలకి
అ ప్రేమే పందిరై బ్రతుకే విరబూసే వేళ
ఆ మరొక్కమారను ఆ మాటే మనస్సు వింటుంది
అ పదే పదే ఎద నీ మాటే స్మరిస్తు ఉంటుంది. ॥నా ప్రాణమా॥
ఆ ఎడబాటే వంతెనగా నడిపెనుగా నిన్ను చేరుకోగా
అ తడబాటే నర్తనగా నీ నడక నన్ను వెతికిరాదా
ఆ సంకోచం తీర్చగా ముద్దుబాస చేస్తున్నా
అ సంతోషం సాక్షిగా మూగ భాష వింటున్నా
ఆ నీలో లీనమై నేనే నీవనిపించేలా
అ మరొక్కమారను ఆ మాటే మనస్సు వింటుంది
ఆ పదే పదే ఎద నీ మాటే స్మరిస్తు ఉంటుంది ॥నాప్రాణమా॥

రచన: భువనచంద్ర **6** గానం: ఎస్.పి. బాలు, కవితాసుబ్రమణ్యం, అమరానాశ్రీరాం

పల్లవి : పట్టా పక్కింటి నాటుకోడిపెట్టని
అ పెడతా ఎంచక్కా ఘాటు ప్రేమ బువ్వని ॥పట్టా॥
ఆ అదిగో చూస్తోంది నిప్పురవ్వ అయినా మోగించు ముద్దు మువ్వ
సిగ్గే లేదమ్మా హవ్వా హవ్వా హమ్మో ఈ పిచ్చి పేరే లవ్వా
అ గురివిందకి తనకిందని మచ్చేటి ఉన్నదని తెల్వదా చెలీ
ఆ తన సంగతి మనకెందుకోయ్ కమ్మంగా కానుకిస్తా కన్నెకౌగిలి
అ రావే నా మల్లెపూల తట్ట పెట్టేయ్ ఎంచక్కా తేనెరొట్టా
ఆ సిగ్గేలేదమ్మా హవ్వా హవ్వా హమ్మో ఈ పిచ్చి పేరే లవ్వా



ఆశలు అన్నీ నిజమయ్యేలా నడుమేవొంచు
ఆడు ఆడించు, పాడు పాడించు
నవ్వు నవ్వించు నువ్వు నడుపు నడిపించు ॥లక్కీ॥ ॥లక్కీ॥

రచన: శ్రీనివాస్ **2** గానం: ఉదిత్‌నారాయణ్, కవితాసుబ్రమణ్యం

ఆ మందారం బుగ్గల్లోకి మచ్చెట్లొచ్చిందే
సీక్రెట్టు చెవిలో చెప్పమ్మా ॥మందారం॥
ఆ మాదాపూర్ గుట్టల్లోకి వాకింగ్‌కొస్తుంటే
గోరింక గిచ్చేసిందమ్మా
అ నీ టక్కేమొ హైటెక్కంతుందే బుల్లెమ్మా
ఆ నీ పట్టేమో నా పైట పాకిందెట్టమ్మా
నీ యవ్వారం ఎందాక వచ్చెరో ॥మందారం॥
అ ఎల్లారెడ్డి తోటకాడ నారింజుందమ్మో
రంగు, తీపి, పులుపు చూస్తే నిరంజుందమ్మో
ఆ సింగంలాంటి చూపులుపెట్టి చురకలు వేస్తాడే
చీర రైక కలవని చోట సర్వే చేస్తాడే
అ చలిపిగ చినుకై చెంత కొస్తా
గడుసుగా తాకి వణుకులిస్తా
ఆ నీ చూపే సోకిందంటే పచ్చగడ్డి భగ్గేరో
నీ చెయ్యే తాకిందంటే ఏమై పోతారో ॥మందారం॥
చరణం : సిమ్లా పండు సిమ్రాన్ అంటూ బిరుదిస్తాడమ్మో
అ దొంగాపండు దొంగను అంటూ కొరికేస్తాడమ్మో
ఆ నడుమే చూస్తే నర్సాపూరు ట్రెయినంతుందమ్మో
జడనే వేస్తే నల్లా త్రాచు గుర్తొస్తుందమ్మో ... అమ్మో
ఆ బిగి కౌగిలిలో బిడియమంతా
బిత్తర చూపులు చూస్తూ ఉంటే
అ తెల్లారి పోయే దాక పేచి పెట్టి చంపొద్దే
చల్లారి రాతిరిదంతా వేస్టయిపోతుందే ॥మందారం॥



తాకినప్పుడు పిందెగుంది ప్రేమ
తాగినప్పుడు పండుగుంది ప్రేమ
ఆరు రుచులు ఏకమైన ఏడోరుచి యీ ప్రేమ ॥ప్రేమ॥
॥నూజివీడు॥
చరణం-2: నీ కలవరింతలో బాధ పెంచునది ప్రేమ... ప్రేమ
నీ కౌగిలింతలో సేద తీర్చునది ప్రేమ... ప్రేమ
యీ పగటి వేళలో వేలువిడవనిది ప్రేమ.... ప్రేమ
యిక చీకటేళలో జాలి చూపనిది ప్రేమ... ప్రేమ
మనసు పొరలను విప్పుతుంది ప్రేమ
సిగ్గు తెరలను చింపుతుంది ప్రేమ
గుండె గుబులును మాపుతుంది ప్రేమ
దిండు దిగులును రేపుతుంది ప్రేమ
నవరసాలే ఏకమైన నవీన రసమే ప్రేమ
॥నూజివీడు॥

కొరియోగ్రఫీ: శివశంకర్ **5** పాడినది: ఎస్.పి.బాలు, బృందం

పల్లవి : క్రిష్ణశాస్త్రిలో భావగీతమై - హుస్సేను గీసిన కావ్య చిత్రమై
ఎంకిపాటలా - ఎలమావి తోటలా
నీరెండ పొద్దుల్లో నా గుండెకొమ్మల్లో వాలవే కన్నెచిన్ని
సిరిసిరి చిలకా ॥క్రిష్ణశాస్త్రి॥
చరణం 1: నేరేడు పళ్ళంటి కళ్ళు - నీవి నీలాల కొలువున్న కళ్ళు
చేపల్లె తుళ్ళేటి కళ్ళు - నీవి చెంపకు చారెడు కళ్లు



చరణం -2:రాసేటందుకు పేపరులెందుకు తాటి ఆకులే ఉచితం
చదివేటందుకు పత్రికలెందుకు గాలివార్తలే ఉచితం
పీల్చేటందుకు పర్‌ఫ్యూమ్‌లెందుకు పూల పరిమళాలుచితం
నవ్వేటందుకు క్లబ్బులు ఎందుకు ఉత్తకితకితలు ఉచితం
తాగేందుకు గ్లాసులెందుకు దోసిలి ఉచితం
తడిమేందుకు భామలెందుకు డ్రీములు ఉచితం
బ్రతికేందుకు ఆస్తులెందుకు ఆత్మీయతే ఉచితం
ఉచితం ఉచితం ఉచితం
ఉచితం ఉచితం ఉచితం ॥మబ్బుల॥

కొరియోగ్రఫీ: శివశంకర్ **2** పాడినది: నిత్యశ్రీ

పల్లవి : సమ్‌థింగ్ న్యూ
సమ్‌థింగ్ న్యూ
సమ్‌థింగ్ న్యూ న్యూ ఐయామ్
సమ్‌థింగ్ న్యూ ॥సమ్‌థింగ్॥
ఉరికే కుందేలుకే కూలింగ్ గ్లాసెస్ పెడితే అది నేనే
మెరిసే మేఘానికే మోడ్రన్ డ్రెసెస్ చుడితే అది నేనే ॥ఉరికే॥
కోకిలమ్మకు కాస్మోటిక్స్ పూస్తే నేనే
జాబిలమ్మకు రెండు జళ్ళు వేస్తే నేనే ॥కోకిల॥
॥సమ్‌థింగ్ న్యూ॥
చరణం -1 :ఇంట్లో ఉలవచారు చేస్తా .... యింటర్‌నెట్లో ఛాట్ చేస్తా

రచన: చంద్రబోస్ **3** గానం: ఉదిత్‌నారాయణ్, చిత్ర, వైశాలి

పల్లవి : వాన వాన తేనెల వాన
వాన వాన వెన్నెల వాన
అ కురవని కురవనీ
నే నిలువున కరగనీ
పాపకంటి చూపులలో
పాలపంటి నవ్వులలో
ఆ బాల మేఘమాలికలో
జాలు వారు తొలకరిలో
తడిసి తడిసి పోనీ
మది మురిసి మురిసి పోనీ
అ తడిసి తడిసి పోనీ
ముడి బిగిసి బిగిసి పోనీ
ఆ చిరు చిరు పలుకు చినుకులలో
బిరబిర పరుగుల వరదలలో
అ తడిసి తడిసిపోనీ
మది మురిసిమురిసి పోనీ
పాప వానా వానా వెన్నెల వానా
వానా వానా వెన్నెల వానా
అ ముంగిట్లో మబ్బే వచ్చే
మనసులోన మెరుపొచ్చే
పన్నీటి చినుకే వచ్చే
ప్రాణం లోన చిగురొచ్చే
బుల్లి బుచ్చి వానదేవతొచ్చే
-కొండపైన
నీరుజల్లి లాల పోసేనేడే
ఘల్లు ఘల్లు గాలి దేవతొచ్చే
-జీవితాన
ప్రేమ జల్లి లాలి పాటపాడే
అ ఓహో శ్రావణాల, రాణి వచ్చే
ఉన్న చీకు, చింతా, చీకట్లన్నీ కడిగే
ఇంకా ఇంకా ఏంకావాలో అడిగే
ఆ మధురంగా కథే సాగుతుంటే
మన బెంగా ఇలా కరుగుతుంటే
అ వేగంగా కలే తీరుతుంటే
ఆ గంగా ఇలకు జారుతుంటే
ఆ తడిసి తడిసి పోనీ
మది మురిసి మురిసి పోనీ ।వాన।
చిన్నతనం ముందరికొచ్చే
పెద్దరికం మరుపొచ్చే
అ ఏటిగట్లు ఎదురుగ వచ్చే
ఇసుక గూళ్ళు గురుతొచ్చే
కారు మబ్బు నీరు చిందుతుంటే
కాగితాలపడవలెన్నో కంటి
ముందుకొచ్చే
పాప నీటిలోన ఆటలాడుతుంటే
అమ్మ నోటి తీపి తిట్లు
జ్ఞాపకానికొచ్చే
ఆ : ఓహో పైట కొంగే, గొడుగుకాగా
ఈ చాటు చాటు ఎంతో ఎంతో
ఇరుకే - ఏమైదంటే
నీకు నాకు ఎరుకే
ఒక్కటిగా ఇలా పక్కనుంటూ
ఇద్దరమై సగం సర్దుకుంటూ
అ ముగ్గురిది ఒకే ప్రాణమంటూ
ముద్దులతో కథే రాసుకుంటూ
ఇద్దరు: తడిసి తడిసి పోనీ మది
మురిసి మురిసి పోనీ ॥వాన॥



రచన: 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి **4** గానం: హరిహరన్

పల్లవి : గుమ్మాడీ గుమ్మాడీ ఆడిందంటే అమ్మాడీ
డాడీ ఊపిరిలో మురిసే కూచిపూడి
చిందాడి చిందాడి తుళ్ళిందంటే చిన్నారి
మమ్మీ చూపుల్లో చూడు ఎంత వేడి
వద్దంటే వినదే పగలంతా ఆడిపాడి
ముద్దైనా తినదే పరిగెత్తే పైడేడి లేడి చిలకల్లే చెవిలో ఎన్నో ఊసులాడి
పడుకోదే పన్నెండైనా ఏం చెయ్యాలి ॥గుమ్మాడి॥
చరణం : ఎన్నెన్నో ఆశలతో పెంచానమ్మా గుండెల్లో ॥ఎన్నెన్నో॥
నువ్వే నా కలలన్నీ పెంచాలే నీ కన్నుల్లో
నా తల్లివి నువ్వో నీ తండ్రిని నేనో
ఎవరినెవరు లాలిస్తున్నారో
చిత్రంగా చూస్తుందే నీ కన్న తల్లి
పొంగిందే ఆ చూపుల్లో పాలవెల్లి ॥గుమ్మాడి॥
చరణం : వర్షంలో తడిసొచ్చి హాయ్‌రే హాయనుకుందామా ॥వర్షం॥
రేపుదయం జలుబొచ్చి హాచ్చీ హాచ్చీ అందామా
ఓ వంక నీకు ఓ వంక నాకు ఆవిరి పడుతూనే మీ మమ్మీ
హైపిచ్‌లో మ్యూజికల్లే తిడుతుంటుంటే
మన తుమ్ములు డ్యూయెట్టల్లే వినపడుతుంటే ॥గుమ్మాడి॥

రచన: 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి **5** గానం: ఉదిత్‌నారాయణ్, చిత్ర

అ : నా ప్రాణమా సుస్వాగతం నీదే సుమా ఈ జీవితం
ఆ అనురాగమా అభినంధనం అనుబంధమా శుభవందనం
అ నీ కోసమే పుట్టానని నా ఊపిరన్నది
ఆ ఏ నాటికి విడిపోననీ చెప్పాలనున్నది



గుళ్ళోగౌరిపూజ చేస్తా.... డిస్కోథెక్‌లో డాన్సేస్తా ॥ఇంట్లో॥
తాతమ్మకు జడవేస్తా ... టాటా సియోర్రా నడిపిస్తా
ముంగిలిలో ముగ్గేస్తా.... ముసలాడికినే సైటేస్తా
గరిస గరిస గరిస గరిస రిగమాగ్గారిస పాప్పా పాప్పా
॥సమ్‌థింగ్ న్యూ॥
చరణం - 2 :తోట్లో పూలు నేను కోస్తా ... టెన్నిస్ కోర్టులో దూకేస్తా
కొట్లో సరకులన్నీ కొంటా.... కుంగ్‌పూ ఫైట్లో పాల్గొంటా
ఆస్ట్రాలజీ చూస్తుంటా - టెక్నాలజీలో ముందుంటా
ఆచారం పాటిస్తా - చాదాస్తాలే వదిలేస్తా
గరిస గరిస గరిస గరిస రిగమాగ్గారిస పాప్పా పాప్పా
-॥సమ్‌థింగ్ న్యూ॥

కొరియోగ్రఫీ:ప్రేమ్-గోపీ **3** పాడినది: శ్రీరామ్ ప్రభు, స్వర్ణలత, బృందం

పల్లవి : ప్రేమలో పడదామా - ప్రేమ మొదలెడదామా
ప్రేమనే గాలిలాగ పీల్చిమనమే ప్రేమను తాగి ప్రేమను తిందామా
ప్రేమలో పడదామా - ప్రేమమొదలెడదామా
చరణం-1 : మొలకలు ఎదిగి మొక్కైనట్టు - స్నేహం పెరిగెను ప్రేమగా
మల్లెల కలయిక మాలైనట్టు - మనసులు కలిసెను మమతగా
పగలు రాత్రి రోజైనట్టు - యిరువురు చేరెను ఒకటిగా
పసుపు వెన్నెలు ముద్దైనట్టు - పెదవులు కూడెను ముద్దగా
మన యిద్దర్ని స్పందన ప్రేమ
మన మనసుల వంతెన ప్రేమ



యిది కాలం చూపిన మధురమైన మహిమ ॥ప్రేమ॥
చరణం-2 : ఆశల గుర్రం నడిపించాను - అల్లరి అంబర వీధిలో
అక్కడ ఎదురుగా కనిపించావు - దోసిలి నిండిన మనసుతో
అమృత వర్షం కురిపించావు - ఆహా నీ తొలి స్పర్శతో
అద్భుత మేదో చూపించావు - అధరపు అరుణిమ సరస్సులో
యిది కన్నులు పట్టిన కలమా
మది సాగును చేసిన హలమా
ప్రేమన్నది మదనుడు చిలుకు మంత్ర జలమా
॥ప్రేమలో॥

కొరియోగ్రఫీ: ప్రదీప్, ఆంటోని **4** పాడినది: ఉదిత్ నారాయణ్, మహాలక్ష్మి, బృందం

పల్లవి : నూజివీడు మావిడికన్నా తియ్యగున్నది ప్రేమ
ఓరుగల్లు మిర్చీకన్నా ఘాటుగున్నది ప్రేమ
పొంగుతున్నా లావాకన్నా వేడిగున్నది ప్రేమ ॥పొంగు॥
ఫ్రిజ్జ్‌లోని మంచుకన్నా చల్లగ వున్నది ప్రేమ.. ప్రేమ...
॥నూజివీడు॥
చరణం-1: నువు నవ్వినప్పుడు గొప్పగున్నది ప్రేమ
నువు నసిగినప్పుడు చప్పగున్నది ప్రేమ
వాటేసినప్పుడు వగరుగున్నది ప్రేమ
వదిలేసినప్పుడు చేదుగున్నది ప్రేమ
చూసినప్పుడు మొగ్గగుంది ప్రేమ
చేరినప్పుడు పువ్వుగుంది ప్రేమ

## అనువాద రచన



# ఆడెళ్ళూ-మగాళ్ళూ



మన భాషలో లభించే హాస్య రచనలను తరచి చూడడంతో బాటు ఇతర ప్రాంతాల, ఇతర దేశాల హాస్య సాహిత్యాన్ని కూడా పరిశీలించడం ఎంతో అవసరం. ఎన్ని రకాల హాస్య ప్రక్రియలున్నాయో, ఎలాంటి సందర్భాలలో హాస్యం పుడుతుందో తెలుసుకోవచ్చు. వారి అనుభూతులు మన అనుభూతుల కంటె వేరు కావని అర్థం చేసుకోవచ్చు. ఈ శీర్షిక క్రింద ఈ సారి ఇచ్చే కథ చదివి చూడండి. మూల ఆంగ్ల కథ పేరు **The Sexes** రచన **Dorothy Parker**

మఫ్లర్ మెడకు చుట్టుకున్న ఆ అబ్బాయి సోఫాలో కూచున్న ఆ అమ్మాయి కేసి మళ్లీ చూపుసారించాడు. ఆమె ఓ రుమాలు కేసి అతి దీర్ఘంగా చూస్తోంది. జన్మలో అదే మొదటిసారి రుమాలు చూడడంలా దాని అంచులను, ఆ రుమాలు మీద డిజైన్‌ను, తెగ స్టడీ చేసేస్తోంది. అతను గొంతు సవరించుకున్నాడు అవసరం లేకుండానే ఆ కార్యక్రమం కూడా సవ్యంగా సాగినట్టు లేదు. అతను మాట్లాడినప్పుడు మాటలు వినగానే సగం వినబడలేదు. వినబడినంత వరకూ.

"చాక్‌లెట్ కావాలా"

"అక్కర్లేదు, కానీ థాంక్స్" అడిగినందుకు అందామె.

'సారీ, నా దగ్గర ఇదే బ్రాండ్‌ది ఉంది. నీ దగ్గర వేరేది ఉందా?"

"ఉందేమో, తెలీదు. అయినా థ్యాంక్స్"

"నీ దగ్గర లేదేమో, వెళ్లి పట్టుకు రానా, వీధి చివరే షాపు, ఐదు నిమిషాలు పట్టదు'.

'థాంక్యూ, నీకంత శ్రమ ఇవ్వడం నా కిష్టం లేదు. ఏనీ వే, నా గురించి ఇంత ఆలోచించినందుకు థ్యాంక్స్'.

'ఆ థాంక్యూలు కాస్త ఆపుతావా, దణ్ణం పెడతాను'.

"ఏం, అంత బాధగా ఉన్నాయా, సారీ నీ మనస్సు నొప్పించానని తెలియదు. మనసు బాధపడితే ఎలా ఉంటుందో నాకు తెలుసు. నా వల్ల నీకు కష్టం నాకు తోస్తే అది నా పొరబాటే. ఎవరికైనా థాంక్స్ చెప్పడం తప్పని తెలియదు. ఇంతకుముందు ఎవరూ నన్ను థాంక్స్ చెప్పినందుకు గాను తిట్టలేదు. అందువల్ల..."



"నేను తిట్టానా?"

"ఓహో తిట్టలేదా, తెలియలేదులే".

"మహాప్రభో, బయటకు వెళ్లి నీకిష్టమైన చాక్‌లెట్లు తెచ్చి పెట్టనా అని అడిగేనంతే! అది తిట్టడమైందా? దాని గురించి రాద్ధాంతం చేయాలా?

"అలా వెళ్లక్కర్లేదు అనడం రాద్ధాంతం చేయడమా...? నాకు తెలియదులే, నేనో స్టుపిడ్‌ని..."

"వాదనలెందుకు గాని, నేను వెళ్లి చాక్‌లెట్లు తెస్తాను. నువ్వింకేం అనకు".

"నీ కిక్కడ నుండి వెళ్లిపోవాలని ఉంటే మహరాజులా వెళ్లు, ఎవ్వరైనా సరే, నా కోసం బలవంతంగా ముళ్ల మీద కూచున్నట్టు కూచుంటే నాకు నచ్చదు."

"నువ్వలా మాట్లాడకు".

"ఎలా మాట్లాడకూడదు?"

"అసలు సంగతేమిటి?"

"సంగతా? సంగతేమిటి?"

"నువ్వు అదోలా ఉన్నావు. నేను వచ్చిన దగ్గర్నుంచి ఒక్క మాట కూడా మాట్లాడలేదు".

"పాపం... నువ్వు సరదాగా గడపాలని వచ్చినట్టున్నావు. ఇక్కడే కూచుని బోరు కొట్టించుకోవాలని అనుకోకు. నువ్వు వెళ్లదలచుకుంటే ఇక్కడ కంటే బోల్డు

---

**4 సిద్ధాంతాలు-రాద్ధాంతాలు** | **ఆఫీసాలజీ** | బొమ్మలు: బాలి

అత్యంత రహస్యమైన
డాక్యుమెంట్లు లభించే చోటు -
జిరాక్స్ మెషిన్ అద్దం మీద

-ప్యూన్‌కి తెలిసిన
యదార్థం.



చెప్పిన గడువుకు
వారం రోజుల
ముందే
అయిపోయేది -
అసలు గడువు!



చోట్లున్నాయి, ఖుషీగా గడపడానికి. నాకు ముందే తెలియకపోవడం నా తప్పు. సారీ, ఇవాళ చాలా పన్లున్నా నువ్వు వస్తావని ఉంటే మానుకుని కూచున్నాను. ఫర్వాలేదులే. నా పొరబాటుకి నువ్వేం చేస్తావ్, వెళ్లు. వెళ్లి హాయిగా ఎంజాయ్ చేయి. నా కారణంగా ఓ ప్రాణి బోరు ఫీలవుతున్నాడని అనుకొనే ఖర్మ నాకెందుకు?" "నాకే బోరూ లేదు. నేకెక్కడికి వెళ్లను. డార్లింగ్, సంగతేమిటి చెప్పు, ప్లీజ్".

"సంగతా, ఏ సంగతీ లేదు. నువ్వు దేని గురించి మాట్లాడుతున్నావో నాకేం తెలియటం లేదు".

"లేక పోవడమేం, నిక్షేపంలా ఉంది. నేనేదైనా తప్పు చేస్తే, నా వల్ల ఏదైనా పొరబాటు జరిగితే చెప్పేయ్".

"నువ్వు ఏం చేస్తే మాత్రం నేనేం అనగలను నాకేం హక్కుంది. గనక....? అయినా నాకు సంబంధించిన వ్యవహారం కాదు."

"నువ్వు అలా మాట్లాడడం కాస్త ఆపుతావా"

"ఎలా మాట్లాడడం.....?"

"అది నీకూ తెలుసు. నేను ఫోన్ చేసినప్పుడు కూడా అంతే. ఎంత ఏడుపుగొట్టుగా మాట్లాడావంటే అసలు నీతో మాట్లాడడానికే భయం వేసింది".

"ఎలా మాట్లాడాను....? ఏదీ, మళ్లీ అను".

"సారీ, నా ఉద్దేశ్యం అది కాదు. నీ ధోరణి ఎంత చిర్రెత్తించిందంటే..."

"ఇక చాలు. నాతో ఇప్పటివరకు అలా మాట్లాడినవాళ్లు లేరు".టటటటట

"సారీ అన్నానుగా, నా ఉద్దేశ్యం అది కాదన్నానుగా, అసలా మాట ఎలా అన్నానో నాకే తెలీటం లేదు. క్షమించు. క్షమిస్తావుగా".

"నీ అంతటి వాళ్లు అడిగేక క్షమించకపోవడమా, తప్పుకదూ, అయినా ఒక విషయం తెలుసుకో, నువ్వు క్షమాపణ అడిగినా అడక్కపోయినా ఒకటే. ఏమీ తేడా లేదు. ఎట్‌లీస్ట్ - నాకు సంబంధించినంత వరకూ. తమాషా ఏమిట్రా అంటే ఇతను జంటిల్‌మన్‌రా అనుకుంటూ ఉంటాం. అంతేనే ఉన్నపళాన మన ఇంటికి వచ్చి నోటి కొచ్చినట్టు మాట్లాడేస్తారు. ఇదేమిట్రా అని తెల్లబోతాం. అంతే, ఎనీ వే, డోంట్ వర్రీ, ఏమీ డిఫరెన్స్ పడదులే".

"నాకూ తెలుసు ఏమీ కాదని, నీతో ఎంత ప్రేమగా మాట్లాడినా ఏమీ డిఫరెన్స్ పడదు. నువ్వు నేనంటే మండిపడుతున్నావు ఇవాళ".

"నేను.... నువ్వంటే.... మండి పడితున్నానా? అసలు నీకు ఆలోచన ఎలా వచ్చింది?"

"అదే నేనూ అడుగుతున్నాను. అసలు నా మీద కోపం తెచ్చుకోవాలన్న ఆలోచన ఎలా వచ్చిందని. అసలు నీతో ఫోన్లో మాట్లాడేక, నువ్వు మాట్లాడిన తీరు విన్నాక, నాకు ఆఫీసులో పని చేయబుద్ధి కాలేదనుకో".



"అయ్యో, నా వల్ల నీ పని పాడవడం నా కిష్టం లేదు. అలాటి మాటలు వింటే నాకు కష్టం తోస్తుంది కూడా. చాలా మంది అమ్మాయిలు అలాటి మాటలు వింటే విని సంతోషిస్తారు గానీ నేను అలా అనుకొనే రకాన్ని కాదు. నా వల్ల ఇంకోరి పని పాడవుతోందనుకోవడం వినడం నా మట్టుకు నాకు ఆనందాన్ని ఇవ్వదు."

"నేను అలా అనలేదే...!".

"అనలేదా....? నాకు ఏదీ సరిగ్గా అర్థం కాలేదులే. నేవొట్టి మొద్దుని."

"నేనింక కదిలితే మంచిదేమో, నేను ఏం మాట్లాడినా నువ్వు వేరేలా అర్థం తీస్తున్నావు. నేను ఇక్కడ ఉన్న కొద్దీ నీకు చికాకు పెరుగుతోంది."

"నీ ఇష్టం వచ్చినట్టు చేయి. నా మీద నెపం పెట్టకు. నువ్విక్కడ కూచుని నన్ను ఉద్ధరించినట్టు పోజు పెట్టడం నాకు సుతరామూ ఇష్టం లేదు. నువ్వు హాయిగా, కావాలన్న చోటుకు.... కావాలనుకున్నవారి... చోటుకు వెళ్ళచ్చుగా. రీటా దగ్గరకు వెళితే సంతోషిస్తుంది కూడా".

"రీటా లేదు, పీటా లేదు. నేనెందుకు వెళ్లాలి. పెద్ద తలకాయనొప్పి".

"అలాగా, మరి నిన్న రాత్రి పార్టీలో మాత్రం తలకాయ నొప్పి వచ్చినట్టు కనబడ లేదే, నీకు పాపం వేరెవరితోనూ మాట్లాడే తీరిక కూడా లేక పోయింది."

"అవునా, మరి అంతసేపు తనతో ఎందుకు మాట్లాడానో నీకు తెలుసా?"

"నాకేం తెలుస్తుంది, అందంగా ఉంది కాబట్టేమో! అందంగా ఉన్న వాళ్లతో మాట్లాడాలని అందరూ ఉబలాట పడతారు. దానిలో తప్పుపట్టుకోవాల్సింది ఏమీ లేదులే. రీటా అందగత్తేగా".

"రీటా అందగత్తో, మోసగత్తో, నాకు తెలియదు. మళ్లీ సారి చూస్తే గుర్తుపడతానో లేదో కూడా తెలియదు. నేను మాట్లాడినది ఎందుకురా అంటే నువ్వు నన్ను పట్టించుకోలేదు కాబట్టి. నేను నీ దగ్గరికి వచ్చి నీతో మాట్లాడబోయాను. నువ్వు పెద్ద గొప్పగా, 'హలో, కులాసానా', అని ఊరుకున్నావు. హలో, కులాసానా, అంతే, ఆ తర్వాత నన్ను కన్నెత్తి చూడలేదు".

"నేను నీకేసి చూడలేదా, అలాగా...! భలేజోక్. నవ్వనా, నవ్వితే నీకేం అభ్యంతరం లేదు కదా?"

**5** సిద్ధాంతాలు-రాద్ధాంతాలు **ఆఫీసాలజీ** బొమ్మలు:బాలి

తడుముకోకుండా చెప్పే సాకులు-

**-మేం ఎప్పుడూ అలాగే చేస్తామే!**

**-మీకు దాని గురించి అంత తొందర ఉందని మాటమాత్రం అనలేకపోయారా?**

**-అది మా డిపార్టుమెంటుకి చెందదండి**

**-మీరు ఓ సారి చూసేసి సరేనంటే మొదలు పెడదామని ఆగానండి**

**-ఇదీ దానిలాగానే అనుకున్నానండి**



**-ఆ వ్యవహారాలు చూసేది మూర్తి గారండి, నేను కాదు**

**-ఏదో మాట వరసకన్నారనుకున్నాను గానీ పెద్ద ఇంపార్టెంటు అనుకోలేదండి**

**-ఎక్కడ సార్, తీరిక దొరకందే!**

**-ఎలా మొదలు పెట్టాలో ఎవరూ చెప్పలేదండి**

**-మనకున్న స్టాఫ్ సరిపోరండి.**

"హాయిగా పగలబడి నవ్వుకో. కానీ సత్యం అయితే మాత్రం అదే".

"ఆగు, నువ్వు పార్టీ జరిగే హాల్లోకి వస్తూనే రీటా వెంటబడ్డావు. ఇక ఎవర్నీ పలకరించే ఉద్దేశ్యం ఉన్నట్టు కనబడలేదు. మీ ఇద్దరూ అంత ఆనందంలో తేలిపోతూంటే మధ్యలో పానకంలో పుడకలా నేనెందుకని...."

"హారి భగవంతుడా, ఆ పిల్ల, దాని పేరేమిటి, రీటా.... మహాతల్లి! నేను వస్తూండగానే నన్ను పట్టుకుంది. అసలు అటూ ఇటూ బుర్ర తిప్ప నివ్వలేదు. ఒకటే వాగుడు. అలాటి పరిస్థితుల్లో నేనేం చేయాలని.... పిడికిలి బిగించి ముక్కు మీద ఒక్కటిచ్చుకోవాలా?"

"అలా చేద్దామని ప్రయత్నించినట్టు నాకేం అనిపించలేదులే"

"అదలాగుంచు. నేను నీ దగ్గరికి వచ్చి మాట్లాడదామని ప్రయత్నించడం గమనించావు కదా. అది మాత్రం నిజమే కదా, నువ్వేం చేసావ్? హలో, కులాసానా.... అంతే. అప్పుడేమయింది. ఆ పిల్ల, దాని పేరేమిటి చెప్మా, వెధవది మర్చిపోతూనే ఉంటాను. ఆ... రీటా... అది వచ్చింది. బంకపిశాచంలా పట్టుకుంది. నా దృష్టిలో అదో ఫూల్."

"నాక్కూడా దాని గురించి అదే అభిప్రాయమనుకో. అఫ్‌కోర్స్, అది నా పర్సనల్ వ్యూలే. కొంతమంది కంటికి అది అందంగానే కనబడుతుంది. కొంతమంది అనగా విన్నాను కూడా".

"అందమా, పాడా... నువ్వూ అదీ ఒకే రూములోఉంటే దాన్ని కన్నెత్తి చూసేవాళ్లుండరు"

"దాని ముక్కు బండముక్కు. అసలు ఆడపిల్లకు అలాటి ముక్కుంటే పెళ్లెలా అవుతుందానిపిస్తుంది నాకు".

"కరెక్టుగా చెప్పావు. బండ ముక్కు. ముక్కంటే నీ ముక్కులా ఉండాలి. చూడు ఎంత సూటిగా ఉందో".

"చాల్లే, నీదో వెర్రి"

"కళ్లు మాత్రం.... నీలాంటి అందమైన కళ్ళెందరికి ఉంటాయి? జుట్టుతో పోటీ పడుతూంటాయి. ఆ చిన్నినోరుకి సరైన కంపెనీ ఇచ్చినట్టు. అసలు నీ అందమంతా నీ చేతుల్లో ఉంది. చూడు ఎంత నాజూకుగా ఉన్నాయో, ముట్టుకుంటే కందిపోతుందన్నట్టు, ఏదీ ముట్టుకు చూడనీ,... లోకంలో కల్లా అందగత్తె ఎవరో చెప్పుకో చూద్దాం..."

"ఎవరో నాకేం తెలుసు".

"తెలీదూ, తెలుసులే, నీకు తెలుసని నాకు తెలుసు"

"నిజంగా తెలియదు. రీటాయా"

"ఒహ్హో, మళ్ళీ ఆ పిశాచం పేరెత్తేవంటే ఊరుకోను. నువ్వు నిన్నరాత్రి మాట్లాడనందుకు నాకు రాత్రంతా నిద్రలేకపోవడం, పొద్దున్న ఆఫీసులో పని చేయలేకపోవడం, ఫోన్ చేస్తే నువ్వు కోపగించుకోవడం. ఎందుకొచ్చిన గొడవ? అసలు నీలాంటి అపురూపసుందరి రీటా లాటి దాని గురించి బుర్రబద్దలు కొట్టుకోవడమా....? ఛ, ఛ."

"నేనేం బుర్రబద్దలు కొట్టుకోలేదు. నువ్వు ఎందుకలా అనుకుంటావ్! నువ్వో పిచ్చాడివి. ఏ వెర్రి పడితే ఆ వెర్రే ఆగాగు, ముత్యాల హారం తెగిపోతుంది. మా అమ్మ తిడుతుంది. కాస్త ఆగమంటూంటే......

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

రచయిత్రి గురించి - డరోతీ పార్కర్ (1893-1967): అమెరికాకు చెందిన కవయిత్రి, కథా రచయిత్రి, విమర్శకురాలు, Vogue, Vanity Fair పత్రికలలో కవయిత్రిగా, సమీక్షకురాలిగా కెరియర్ ఆరంభించి, అనేక పత్రికలకు కథలు, సమీక్షలు, కాలమ్స్ రాసేది. ఆమె రచనలలో ఒక Sardonic wit, irreverent sophistication కనబడుతుంది. 1926లో ఆమె వెలువరించిన కవితా సంకలనం Enough Rope బాగా ప్రజాదరణ పొందింది. కథా సంకలనాలు Laments for the Living (1930), After Such Pleasure (1933) రెండూ ప్రఖ్యాతి పొందినవే. 1939లో అప్పటిదాకా ఆమె సాగించిన రచనలతో 'Here Lies' అనే పుస్తకంలో వెలువడింది.



ఎం.చిత్తరంజన్

# లలిత సంగీతం

## పాట పాడుమా కృష్ణా!

పాటకు జనరంజకంగా రాగాన్ని సమకూర్చటం ఒక్కొక్కసారి మనోధర్మం బట్టి, ప్రతిభను బట్టి సులువే అనిపించవచ్చు. కానీ అలా ట్యూన్ అయిన పాటను స్వరాలపరంగా నొటేషన్ రాస్తూ తెలియజేయటం అంత సులువైన విషయం కాదు. అందుకు శాస్త్రీయ పరిజ్ఞానంతో పాటు విశేషానుభవం కూడా ఉండాలి. పైగా వేరొకరు స్వరపరచిన పాటకు స్వరం రాయాలి అంటే ఇవన్నీ రెట్టింపు స్థాయిలో ఉండాలి. ప్రముఖ, గాయకుడు, లలిత సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు, స్వరకర్త అయిన శ్రీ ఎం. చిత్తరంజన్, స్వర్గీయ యస్.రాజేశ్వరరావు అలనాడు స్వరపరచిన 'పాట పాడుమా కృష్ణ' పాటకు స్వరాలను కేవలం 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకంగా రాయటాన్ని ఒక అదృష్టంగా భావిస్తున్నాం. యస్.రాజేశ్వరరావు స్వరపరచి, గానం చేసిన ఆ పాట ఆ నాటినుంచి ఈనాటి వరకు ఎందరి హృదయాలలో సుస్థిరంగా ఉందో ప్రత్యేకంగా తెలియజేయ నవసరం లేదు. ఆవధరించండి.

రాగం: అభేరి (కర్ణాటక సంగీతం)/
భీంపలాస్ (హిందుస్తానీ సంగీతం)
22వ మేళకర్తయగు ఖరహరప్రియ రాగజన్యం
తాళం: త్రిశ్ర ఏక (కర్ణాటక సంగీతం)
దాద్రా (హిందుస్తానిసంగీతం)
ఆరోహణ: స గ మ ప ని స
అవరోహణ : స ని ద ప మ గ రి స
ఆరోహణలో - షడ్జము, సాధారణ గాంధారము, శుద్ధమధ్యమము, పంచమము, కైశికినిషాదము, తారషడ్జము.
అవరోహణలో - తార షడ్జము, కైశిక నిషాదము, చతుశృతి దైవతము, పంచమము, శుద్ధ మధ్యమము, సాధారణ గాంధారము, చతుశృతి రిషభము, షడ్జము.

ఈ పాటకు సంగీతం కూర్చడానికి ఆరోహణ, అవరోహణ అనే మూర్ఛనాక్రమము నకు కట్టుబడక, స్వతంత్ర స్వర సంచారమును గావించారు స్వరకర్త. అన్యస్వరమైన శుద్ధ దైవతమును కూడా ఉపయోగించుకున్నారు. అదే యీ పాట యొక్క ప్రత్యేకత, విశిష్టత.

పాట పాడుమా... ఆ ...
పాట పాడుమా కృష్ణా
పలుకు తేనెలొలుకు నటుల
మాటలాడుమా ముకుంద
మనసు తీరగా ॥ పాట॥

శృతిలయాదులన్ని చేర్చి
యతులు నిన్ను మదిని తలచే
శృతిలయాదులన్ని చేర్చి
యతులు నిన్ను మదిని తలచె
సదమలహృదయా నిను
సన్నుతింతు వరనా మను ॥ పాట॥

సామవేదసారము
సంగీతము సాహిత్యమెగా...ఆ...
సామవేదసారము
సంగీతము సాహిత్యమెగా
దానికంతమగు గానము
పాటకూర్చి పాడుమా ॥ పాట॥

# సాలూరి రాజేశ్వరరావు



పల్లవి:



**1993** సం॥లో రాజేశ్వరరావు గారితో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం కోసం నేను ప్రత్యేకంగా రూపొందించిన "సంగీత చర్చా కార్యక్రమం" (రేడియోలో ప్రసారం 27 జూన్ 1993 రాత్రి 8 గం. 15 ని) లో వారు వివిధ సంగీత ప్రక్రియల ద్వారా అనేక విశిష్ట ప్రయోగాలతో స్వరపరచిన గేయాలను విశ్లేషణాత్మకంగా చర్చిస్తుండగా, వారి "పాట పాడుమా కృష్ణా" గీతం నుంచి నేను ఒక ప్రశ్న వేశాను. "అభేరి రాగంలో ఆ పాటకు బాణీని కూర్చారు గదా. ఆ రాగం ఆరోహణ ప్రకారం 'స గ మ ప ని స' అని వుండగా మీరు పాట పల్లవి లోనే 'ప ద ని స' అని ప్రయోగం చేసి మూర్ఛనా క్రమాన్ని అనుకరించక స్వతంత్ర స్వర సంచారం సాగిస్తూ బాణీ అంతా కూడా అదే విధంగా రూపొందిచారు. అన్యస్వరాన్ని కూడా చేర్చారు కదా. మరి 1940వ దశకంలో మద్రాసులో పక్కు కర్ణాటక సంగీతమే ఎక్కువగా వినబడతుండే ఆ రోజులలో మీరు చేసిన ఈ ప్రయోగానికి మీ సహ స్వరకర్తలనుండి గాని, సంగీత విద్వాంసుల నుండి గాని మీరు వ్యతిరేకతను ఎదుర్కోలేదా" అని అడిగాను. ఆయన కొంత సేపు సుదీర్ఘంగా ఆలోచించి ఆనాటి సంఘటనను గుర్తుకు తెచ్చుకుని "నేను చేసిన యిటువంటి ప్రయోగాల్ని సహృదయతతో విద్వాంసులు నన్ను అభినందించి ఆదరించి ప్రోత్సహించారు. కాబట్టే నేను అటువంటి ప్రయత్నాలు చేస్తు ముందుకు వెళ్ళ గలిగాను" అని ఆయన ఎంతో సంతృప్తితో అన్నారు. అలా వారు 1940వ దశకంలోనే ఎన్నో రాగాలలో శాస్త్రీయ సంగీతపు నియమనిబంధనలను, కట్టుబాట్లను అధిగమించి, కొత్త కొత్త మార్గాలను అన్వేషిస్తూ స్వతంత్ర స్వర సంచారాల తోను, అన్యస్వరాలను మిశ్రమం చేసుకుంటూ ఆయా సన్నివేశాలకు సంబంధించిన రస పోషణకై రాగాలను మలచుకొంటూ వినూత్నమైన హృద్యమైన బాణీలను సమకూర్చి, ముందుముందు లలిత సంగీతం తనదైన ఒక విశిష్ట రూపాన్ని, శైలిని సంతరించుకుని సంగీత ప్రపంచంలో ఒక ప్రత్యేక శాఖగా సుస్థిర స్థానాన్ని సంపాదించుకొనేందుకు ఎంతో దోహదం చేశారు సాలూరి వారు. కనుకనే లలిత సంగీతానికి ఆద్యులైన వారిలో రాజేశ్వరరావుగారు ప్రముఖులు.

**అక్టోబరు 26 స్వర్గీయ యస్.రాజేశ్వరరావు గారి వర్ధంతి సందర్భంగా**

## పేరడీ పెరేడ్

అతడు : అమ్మాయే తన్నగా అరపన్నే ఊడగా
గతి తప్పి కుర్రాళ్ళే మంచాన పడ్డారే
ఆమె : అబ్బాయే కోతిలా ఇకిలిస్తే రోతగా
ఆ బోడి నవ్వులకు ఒళ్ళేమో మండేను
అతడు : ఆ తన్నులు ఈ చిన్నెలు
కలిసొస్తే ఓటేలే
అతడు : పైత్యం పుట్టేవేళ ఒళ్ళంతా చిమచిమలే
పైత్యం ముదిరేవేళ పళ్ళన్నీ జివజివలే
ఆమె : చెప్పే తోడుంటే అది చేతిలో పిస్తోలే
చెప్పే వెంటుంటే పులియైనా పిల్లేలే
అతడు : నీ ఇంట్లో ఏ డస్టయినా
నా పాలిట పాండ్సేలే
నువ్విచ్చే పచ్చినీళ్ళైనా
నా నోటికి పెప్సీలే



ఆమె : ఈ తిక్కలె తలకెక్కగా
అది తొక్కలొ వ్యవహారం
॥అమ్మాయే॥

**పంపిన వారు: టి. అపర్ణ,**
సెయింట్ గేబ్రియల్ స్కూల్,
నల్లకుంట, హైదరాబాద్



## కొంటె కొశ్చెన్లు తుంటరి జవాబులు

(ఎ)ప్ర॥ నిజమైన దేశభక్తుడు ఎవరు?

జ॥ ఆగష్టు పదిహేనున, జనవరి ఇరవై ఆరున గుడికి వెళ్ళి 'భారతమాత' పేరు మీద అర్చన చేయించేవాడు.

(బి)ప్ర॥ శ్రీకృష్ణుడు ద్వారకానగరాన్ని సముద్రం మధ్య లోనే ఎందుకు నిర్మించాడు?

జ॥ దీపావళికి అగ్ని ప్రమాదాలు సంభవిస్తే నీళ్ళకి కొరత ఉండకూడదని.

(సి)ప్ర॥ అమితాబ్ "కౌన్ బనేగా కరోడ్ పతి" గోవిందా 'చప్పడ్ ఫాడ్ కే' హిట్ అయి అనుపమ్ ఖేర్ 'సవాల్ దస్ కరోడ్‌కా' ఫెయిలవడానికి కారణం ఏమిటి?

జ॥ అతనేమో బడేమియా, ఇతనేమో ఛోటేమియా కదా! సందట్లో సడేమియా లా ఈయనెందుకూ అని జనం ఫీలయ్యారేమో!?





## డబుల్ రోల్

(ఎ) ఆ 'జరీ' చీర కట్టు కున్నావిడే ట్రె'జరీ' ఆఫీసులో పని చేస్తోంది.

(బి)'పాలసీ' కట్టమంటా వేంటయ్యా బాబూ.... 'పాలసీసా' కొంటానికే డబ్బుల్లేక చస్తుంటే.

(సి) మా 'పల్లె'లో నన్నెవ్వరూ 'పల్లెత్తు' మాట కూడా అనరు తెలుసా!?



## పేరు - రిపేరు

(ఎ)మమ్మీ - డాడీ - అటు అమెరికా ఇటు ఇండియా

(బి) చిరంజీవి - శ్రీదేవి - జగదేకవీరుడు అతిలోక సుందరి

(సి)ఆంటీ - నువ్వు నాకు నచ్చావ్ - నిన్నే పెళ్ళాడుతా- ఛాలెంజ్.

## చిలిపి కవిత

నా కవితలంటే మా ఇంట్లో వాళ్ళకి భయం.
స్టాంపులకి డబ్బులివ్వాలని
నా కవితఅంటే పక్కింట్లో వాళ్ళకి భయం.
ఏ సమయంలో వినాల్సొస్తుందోనని
నా కవితలంటే పోస్టల్ వాళ్ళకి భయం
అట్నించిటు, ఇట్నుంచటు మోసిచావాలని
నా కవితలంటే పత్రికల వారికి భయం
ముద్రిస్తే జనం తంతారేమోనని
అందుకే
నా కవితలంటే నాకే భయం.
అయిడియా తట్టిన దగ్గర్నుంచి ఎంతమంది? చంపాల్సొస్తుందోనని!!



## చిలిపిలిపి

Ph.D. = పాస్డ్ విత్ హై డిఫికల్టీ
వైదేహి = ఎందుకు అడుక్కోవడం!?
P.T.O. = పేజీ తిప్పండొహో








కె.వి.రావు



## జాతకబలం

హెచ్.యం.రెడ్డిగారి వద్ద భోజరావు అనే ఓ గుమాస్తా ఉండేవాడు. అతనికి బయట చేయవలసిన పనులు చెప్పి ఆఫీసు నుంచి పంపేవారు. ఆ పనులు తొందరగా అయిపోయినా, అతను ఆ రోజు మళ్లీ ఆఫీసుకు వచ్చేవాడు కాదు. మరోపని ఆ రోజు చేయవలసి వచ్చినా, ఇంకో మనిషి వుండే వాడు కాదు.ఇలా అతనితో విసిగి వేసారిపోయిన రెడ్డిగారు ఓ రోజున "భోజా! రేపట్నుంచి నువ్వు ఉద్యోగంలో లేవు. జీతం తీసుకు వెళ్లిపో!" అన్నారు.వెంటనే ఆ భోజారావు నిర్భయంగా "నాకు పదో ఇంట్లో శుక్రుడు ఉన్నాడు మీకు ఏడో ఇంట్లో కుజుడు ఉన్నాడు. అంచేత మీరివాళ పంపినా, నేను వెళ్ళిపోయినా, రాత్రంతా మీరు పశ్చాత్తాపపడి, రేపు నాకు కబురు చేస్తారు. నా ఉద్యోగం నాకే యిస్తారు. ఈ ఒక్క రోజు కోసం నా ఉద్యోగం పీకడం ఎందుకు?" అన్నాడు.

ఆ మాటలకు రెడ్డిగారు పకపకా నవ్వి "సర్లే - వుండు" అన్నారు.

## రంగారావు 'సత్యాగ్రహం'

అన్నపూర్ణా పిక్చర్స్ చిత్రాల్లో ఒకసారి నటించిన నటీనటులు తరుచుగా ప్రతి చిత్రం లోనూ వుండే వారు. ఎప్పుడో గాని మారే వారు కాదు అంచేత ఆ నటీ నటుల్ని 'అన్న పూర్ణా నాట్య మండలి' అని అంటూ వుండే వారు కొందరు ఆప్తులు. 'వెలుగు నీడలు' చిత్రంలో మొదట యస్.వి. రంగా రావు గారికి ఏ పాత్రా అనుకో లేదు. ఈ విషయం తెల్సిన రంగా రావు గారు ఓ ముహూర్తాన ఆఫీసుకు వచ్చి 'నా కంపెనీలో నాకు వేషం లేదా? నేను లేకుండా ఎలా షూటింగ్ చేస్తారో చూస్తా - ముహూర్తం నాడు వచ్చి, కెమెరాకి అడ్డంగా నిలబడి షూట్ చేసి పారేస్తా' అని బెదిరించారు. (ఆయనకు తుపాకి లైసెన్సు వుండేది...!) ఆ తర్వాత నిర్మాత, దర్శకుడు, తదితరులూ తర్జన భర్జనలు చేసి రంగారావుకి పాత్ర ఇచ్చారు. చిత్రంలో ఆయన నటించిన పాత్రకు రేలంగినీ, రేలంగి ధరించిన పాత్రకు అల్లు రామలింగయ్యను అనుకున్నారు. కాని రంగారావు 'సత్యాగ్రహం' వల్ల పాపం అల్లు రామలింగయ్యకి వేషం లేకుండా పోయింది....!



## నచ్చిన నెచ్చెలి



శ్రీమతి సావిత్రికి తోడుగా దాక్షాయణి అనే ఓ అమ్మాయి ఎప్పుడూ ఆమెతో ఉండేది. మేకప్ వగైరాలు శ్రద్ధగా చూసేది. అంతేకాదు ఆమె ఏ దృశ్యంలో ఏ నగలు పెట్టుకుందో ఏ చీర కట్టుకుందో కేశాలంకరణ వివరాలు అన్నీ తను ఓ పుస్తకంలో రాసుకునేది. దాని పక్క దృశ్యం వివరాలు రాసేది. నగలు వివరాలు (స్వంత నగలు వాడితే) సహాయ దర్శకుడికి చెప్పేది. (బాపాలాల్ నెక్లెస్, సింగపూర్ చెయిన్, సిలోన్ గాజులు ఇలా) ఎప్పుడు మళ్ళీ అవసరం వచ్చినా, దృశ్యం వివరిస్తే ఆ నగలన్నీ తీసుకు వచ్చేది.

అన్నపూర్ణావారి 'చదువుకున్న అమ్మాయిలు' (1963) చిత్రంలో ఆమెతో పాటు ఇ.వి.సరోజ, కృష్ణకుమారి కూడా ఉన్నారు. ముగ్గురూ కలసి వుండే షాట్స్ చిత్రంలో చాలా ఉన్నాయి. వాళ్ళిద్దరి కన్నా సావిత్రి పొట్టి కనుక ఆమె సింగపూర్ నుంచి ప్రత్యేకంగా తెచ్చుకున్న 'హైహీల్స్' జోడు వాడేది.షాట్స్ గమనించే దాక్షాయణి - అలాంటి షాట్ తీస్తుంటే, మూడో కంటికి తెలియకుండా ఆ చెప్పులు తీసుకువచ్చేది కాళ్ల దగ్గరకు."అక్కా! అంద సెరుపు కొండువందెన్! (అక్కయ్యా! ఆ చెప్పులు తెచ్చాను!) అని చెవిలో చెప్పి వెళ్లిపోయేది. సావిత్రి వాటిని తొడుక్కుని చిత్రంలో ఎక్కడా పొట్టిగా కనిపించకుండా జాగ్రత్త పడింది.

## సహదర్శకుని సహకారం



లలితా శివజ్యోతి వారి 'లవకుశ' (1963) చిత్రంలో గర్భవతిగా వున్న సీత పరుగున వస్తున్న షాట్‌ను చిత్రీకరిస్తున్నారు దర్శకులు శ్రీ సి. పుల్లయ్య. అది గమనించిన సహాయ దర్శకుడు జి.వి.ఆర్.శేషగిరిరావు (తర్వాత 'పాపకోసం' డైరెక్టు చేశారు)."సీత అలా పరుగున రావడం ఎబ్బెట్టుగా కనిపిస్తున్నదండి" అన్నారు!

"కవిగారు రాశారు కదండీ! మనం అలా తీయాల్సిందే" అని పరుగున వస్తున్నట్టే చిత్రీకరించారు దర్శకుడు సి.పుల్లయ్య.

కాని, ఆనాడు ఇంటికి వెళ్లిన తర్వాత ఈ విషయం పుల్లయ్య బాగా ఆలోచించారు. రచయితతో మాట్లాడారు. అలా పరుగున రావడం ఎబ్బెట్టుగానే వుంటుందని కూడా అన్నారట!

మర్నాడు షూటింగ్‌లో - "శేషగిరి రావుగారూ! మీ మాట వినకుండా సీత పరుగున వస్తున్నట్టు షూట్ చేశాను. తర్వాత నాకూ మీలాగే తోచింది, కవిగారు కూడా ఒప్పుకున్నారు. అంచేత ఆ షాట్‌ను మళ్లీ తీద్దాం" అని రీ షూట్ చేశారట!




**ఇం**డోర్‌లో పుట్టి బొంబాయికి చేరిన జానీవాకర్ మొదట్లో రోజూ పూనా నుండి కూరగాయలు, పళ్లు తెచ్చి అమ్మేవాడు. పన్నెండు మంది కుటుంబ సభ్యులను పోషించే భారం అతనిపై ఉండేది. కొంతకాలం బస్ కండక్టరుగా కూడా చేశాక ఓ రోజు ఒకతను ఓ ఫిల్మ్‌స్టూడియోకు తీసుకెళ్లి స్పాట్ బాయ్‌గా ఉద్యోగం ఇప్పించాడు. అక్కడే అతన్ని చూసి జాలిపడి బలరాజ్ సహానీ చేతన్ ఆనంద్ (దేవ్ ఆనంద్ అన్న)కు పరిచయం చేశాడు. చేతన్ తను అసిస్టెంటు డైరెక్టరుగా పని చేస్తున్న "ఆఖరీపైగామ్" (1949) అనే చిత్రంలో ఓ జూనియర్ ఆర్టిస్టుగా వేషం ఇప్పించాడు.

**జా**నీవాకర్ తొలిరోజుల్లో నటించిన ఓ చిత్రంలో బలరాజ్ సహానీతో కలిసి నటించాడు. అందులో జానీవాకర్ ఖైదీపాత్ర వేశాడు. జైలర్ పాత్ర బలరాజ్ సహానిది. తమాషా ఏమిటంటే ఆ రోజుల్లో బలరాజ్ సహానీ కమ్యూనిస్టు కార్యకర్త అయిన కారణంగా ఓ జైల్లో ఖైదీగా ఉండేవాడు. షూటింగ్ ఉన్నప్పుడు ఇద్దరు పోలీసులు అతన్ని వెంటబెట్టుకు వచ్చి షూటింగ్ కాగానే తీసుకుపోయేవారు. బలరాజ్ సహాని ఉన్న జైల్లో - జైలరుకీ ఆయనకీ స్నేహం కుదిరిందో లేదో కానీ, తెరమీద జైలర్ (బలరాజ్)కీ ఖైదీ (జానీవాకర్)కీ స్నేహం కుదిరింది.

## జానీ వాకర్...

పెద్దగా అందగాడేం కాదు. అయినా ప్రేక్షకులు పడిచచ్చేవారు. అద్భుతమైన పర్సనాలిటీ లేదు. అయినా బరువైన పాత్రలు సైతం ఆ శరీరంలో సునాయాసంగా ఇమిడిపోయేవి. అసలతని విచిత్ర స్వరంతోనే సగం కామెడీ పలికేది. పండేది.... ఒకానొక దశలో హీరోలతో సమానంగా... ఒక్కొక్కసారి అంతకంటే ఎక్కువగా కూడా.... ఆయన అభినయించిన పాటలకు డిమాండ్ ఉండేది.



# జానీవాకర్ జీవితంలో మైలురాళ్లు

**గు**రుదత్ - బాజీ (1951) తీసే రోజులవి. ఒక చిన్న పాత్రకు తగిన వ్యక్తి గురించి చూస్తున్నాడు. 'బాజీ' సినిమాకు కథ సమకూర్చిన (గురుదత్ మెరుగులు దిద్దాడు.) బలరాజ్ సహానీ ఆ పాత్రకు జానీవాకర్‌ను రికమెండ్ చేశాడు. తనను కలిసిన జానీవాకర్‌ను నటించి చూపమన్నాడు గురుదత్. తాగుబోతుగా నటించి చూపి అతణ్ని ముగ్ధుణ్ని చేసాడు జానీవాకర్. అంతా బాగుంది కాని నీ పేరు మారుద్దాం అన్నాడు గురుదత్. అప్పుడు తన పేరు బద్రుద్దీన్ కాజీ. ఏం పేరు పెడదామా అని ఆలోచించాడు గురుదత్. ఆ సమయంలో విస్కీ తాగుతున్నాడతను. అది 'జానీవాకర్' బ్రాండ్‌ది. హఠాత్తుగా గురుదత్ మొహంలో వెలుగు. 'ఇవాల్టి నుంచి నీ పేరు జానీవాకర్' అన్నాడు. అంతే ... అదే పాపులరయికూచుంది.

## టైటిలాట






అప్పటిదాకా 30 సినిమాల్లో నటించినా రాని గుర్తింపు ఒక్క 'బాజీ'తో వచ్చింది జానీవాకర్‌కి. బాజీలో చిన్న పాత్రతో మొదలైన గురుదత్ - జానీవాకర్ స్నేహం గురుదత్ మరణించేవరకు కొనసాగింది. గురుదత్ సినిమాల్లో జానీవాకర్‌కి ముఖ్యపాత్ర తప్పకుండా ఉండేది - 'కాగజ్‌కే ఫూల్' వంటి సీరియస్ సినిమాలో కూడా! 'ప్యాసా'లో 'తేల్‌మాలిష్' పాట ద్వారా జానీవాకర్‌ని తెరమీద అజరామరం చేసేశాడు గురుదత్! 'చౌధ్వీకా చాంద్'లో చాలా పెద్ద పాత్ర ఇచ్చాడు కూడా. 'సాహిబ్ బీబీ ఔర్ గులాం'లో మాత్రం తగిన పాత్ర లేకపోవడం వల్ల కాబోలు జానీవాకర్ కనబడడు.






జానీవాకర్‌ను ఓవర్‌యాక్టింగ్ చేసే కమెడియన్‌గా కొట్టి పారేస్తారు కొందరు. మాస్‌కి మాత్రమే నచ్చే నటుడనుకుంటారు మరికొందరు. కానీ హృషీకేశ్ ముఖర్జీ అలా అనుకోలేరు. 'ఆనంద్' (1970) సినిమాలో మరువలేని పాత్ర యిచ్చాడు జానీవాకర్‌కు. తెలియని వాళ్లను కూడా ఏదోపేరుపెట్టి పలకరించే పాత్ర ఆనంద్ (రాజేష్‌ఖన్నా)ది. ఆ పలకరింపుకి అందరూ తెల్లబోతూ ఉంటారు. కానీ అలా తెల్లబోకుండా తిరిగి ఆనంద్‌ను మరోపేరుపెట్టి తికమకపెడతాడు, నాటకాలేసే ఈశాభాయ్ సూరత్ వాలా (జానీవాకర్). అనంద్ తను నవ్వుతూ ఇతరులను ఏడిపిస్తూ ఉంటారు. ఆ సినిమాలో ఆనంద్ పాత్రను పోలిన పాత్ర ఇతనొక్కడిదే! దాన్ని అద్భుతంగా పోషించాడు జానీవాకర్.

జానీవాకర్ అతి తక్కువ కాలంలో ఎంతగా పాపులర్ అయిపోయాడంటే సినిమాలో అతని మీద కనీసం ఒకపాటైనా చిత్రీకరించే వారు. ఠోకర్ (1953) సినిమా తీసే రోజుల్లో సంగీత దర్శకుడు సర్దార్ మాలిక్ జానీవాకర్ లాటి పాపులర్ కమెడియన్ మీద ఓ సరదా పాట పెడితే బాగుంటుంది అని తీర్మానించాడు. అలా పుట్టిందే "మైతో నహపీతా" జానీవాకర్ మానరిజమ్స్‌ను అనుకరిస్తూ మహ్మద్ రఫీ ఆ పాట బ్రహ్మాండంగా పాడాడు. అదే జానీవాకర్ మీద చిత్రీకరించిన తొలిపాట. ఆ తరువాత ఎన్నోగొప్ప పాటలకు జీవం పోశాడు జానీవాకర్. 'జంగల్ మే మోర్‌నాచా కిసీనే న దేఖా (మధుమతి) 'మై బొంబాయికా బాబూ' (నయాదౌర్) 'మాలిష్ తేల్ మాలిష్' (ప్యాసా) మచ్చుకు కొన్ని.

కమెడియన్‌గా మహర్దశ అనుభవించిన వాడు జానీవాకర్. కొంతకాలం అతను లేకుండా హిందీ సినిమాలు తయారయ్యేవి కావు. హీరో డేట్స్ దొరికినా ఇతని డేట్స్ దొరికేవి కాదు. అతని పేరున 'జానీవాకర్' అంటూ 1957లో ఒక సినిమా తయారయ్యింది కూడా. (దానిలో శ్యామా హీరోయిన్, సంగీతం: ఓ.పి.నయ్యర్) దరిమిలా జోహార్‌కి తప్ప ఈ గౌరవం మరెవ్వరికీ దక్కలేదు.



జానీవాకర్ ఇంగ్లీషు కమెడియన్‌లను ఎన్నడూ అనుకరించలేదు. హిందీ కమెడియన్ చార్లీ (అసలు పేరు నూర్ మొహమ్మద్) అతడి అభిమాన హాస్య నటుడు. కదర్‌ఖాన్, మెహమూద్ బ్రాండ్ వెకిలి హాస్యంతో విసిగిపోయి చిత్రరంగానికి దూరమయి పోయానంటాడు జానీవాకర్. కానీ 'చాచీ 420' (1997) (భామనే సత్యభామనే హిందీ వెర్షన్)లో కమలహాసన్ మంచి పాత్ర ఇవ్వడంతో మళ్ళీ మొఖానికి రంగువేశాడు.

-కమ్యూనికేటర్ ఫీచర్స్






**జాజ్ మ్యూజిక్ గురించి**
**మీకు తెలుసు.....**
**మోడ్రన్ జాజ్ గురించి.....**
**తెలీదా, ఎప్పుడూ వినలేదా?**
**అయితే మోడ్రన్ జాజ్**
**ప్లేయర్‌గా**
**పేరు తెచ్చుకున్న**
**టైరిస్‌నే**
**అడుగుదాం....**

## మోడ్రన్ జాజ్ అంటే....

ఆధునిక టెక్నాలజీని, మోడ్రన్ ఎలక్ట్రానిక్ వాయిద్య పరికరాలను ఉపయోగించడం తెలిస్తే 'మోడ్రన్‌జాజ్' సులువుగా వాయించవచ్చు. జాజ్‌లో పాప్, ఫంక్, రాక్ మ్యూజిక్‌లను మేళవించడమే మోడ్రన్ జాజ్....

## ఈ ఆసక్తి ఎలా కలిగింది?

టైరిస్ తండ్రి చర్చిలో మతబోధకుడు. టైరిస్ కూడా చర్చిలోనే శిక్షణ పొందాడు. అప్పుడప్పుడు చర్చిలో వాయించే వాడుకూడా. అయితే ఓసారి తండ్రి తీవ్రంగా మందలించాడు, వినడానికి తప్పితే వాయించడానికి చర్చికి రావద్దన్నాడు. కాని టైరిస్‌కి మాత్రం తన టాలెంట్ నిరూపించుకోవాలని ఉండేది. దాంతో తనే సొంతంగా ఓ బ్యాండ్ ఏర్పాటు చేసుకున్నాడు.

## బార్‌లలో వాయించేవాడా?

అవును అది కూడా తండ్రికి తెలీకుండా జాగ్రత్తపడేవాడు. అయితే నిజం ఎన్నోరోజులు దాగదు కదా! ఓ రోజు టైరిస్ మ్యూజిక్ ప్రోగ్రాం ఇచ్చే చోటు నుండి ఫోన్ వచ్చింది. మీరు మీ వాద్య పరికరాన్ని ఇక్కడ మర్చిపోయారు. తీసుకెళ్ళ గలరన్నది దాని సారాంశం. ఆ ఫోన్ కాల్‌ని టైరిస్ తండ్రి రిసీవ్ చేసుకున్నాడు. దాంతో అతనికి నిజం చెప్పేయక తప్పలేదు. అలాంటి చోట్ల వాయించడానికి కనీసం ఇరవై ఒక్క ఏళ్ళైనా ఉండాలి. అప్పుడు అతని వయసు సరిగ్గా ఇరవై ఒక్క ఏళ్ళు.




టైరిస్ చెప్పింది విని తండ్రి అర్థం చేసుకున్నాడు. అయితే ఇంతవరకు ఆయన కొడుకు సంగీత కార్యక్రమాలకి ఒక్కసారికూడా హాజరు కాలేదు. పేపర్లలో వచ్చేవార్తలు చదివి ఆనందించే వాడు, గర్వించేవాడు. కాకపోతే కొడుకు, మ్యూజిక్ స్టైల్ మాత్రం ఆయనకి అర్థం అయ్యేది కాదు.

## పాటగాడేనా!?

సింగపూర్‌లో ప్రోగ్రాం ఇస్తున్నప్పుడు తన బ్యాండ్‌లో ఓ సింగర్ జబ్బు పడటంతో ఆ స్థానాన్ని టైరిస్ భర్తీ చేయాల్సి వచ్చింది. అలా మొదటసారి తన గాత్రాన్ని శృతి చేసుకున్నాడు. ఇక అప్పటి నుంచి ప్రేక్షకుల కోరిక మీదకు పాటలు పల్లవిస్తూనే ఉన్నాడు. కేవలం అలా పియానో వాయించడం కాకుండా పాటకూడా పాడుతుంటేనే ప్రోగ్రాం మరింత సక్సెస్ అవుతుందని, టైరిస్ స్వీయ అనుభవం.

## డిఫరెంట్ స్టైల్

అవును పాటలో కూడా తన ప్రత్యేకతను నిలుపుకుంటున్నాడు అతను. ప్రేక్షకులు అడిగిన పాటని యథాతథంగా అంటే ఆల్రెడీ కంపోజయిన ట్యూన్‌లో పాడితే టైరిస్ గొప్పతనం ఏముంది? అందుకే ఏ పాటనైనా తనకి అనుగుణంగా మార్చుకుంటాడు. అలా దానికి టైరిస్ ముద్ర పడిపోతుంది. 'ఓ పాటని యథాతథంగా కాపీ చెయ్యడం కన్నా ఇలా స్టయిల్ మార్చితేనే ప్రేక్షకులు ఎక్కువగా ఆదరిస్తారని' చెప్పాడు టైరిస్.

## మ్యూజిక్ థెరపీ!

సంగీతం అతని జీవనం
సంగీతం అతని జీవితం
సంగీతం అతని ఆత్మ.... ప్రాణం

అతనికి స్వస్థత చేకూర్చేది కూడా సంగీతమే... మూడ్ బాగుండకపోతే మ్యూజిక్ థెరపీనే ఆశ్రయిస్తాడు. పియానో ముందు కూర్చుని మూడ్ మారేదాకా రకరకాలుగా ప్లే

# మోడ్రన్ జాజ్ ఇండీ పాప్‌ల సమ్మేళనకర్త



చేస్తుంటాడు. ఆ తర్వాత అవే ట్యూన్స్‌గామారి అతని ప్రోగ్రామ్‌లలో చోటు చేసుకుంటాయి.

## ఆల్బమ్స్ ఏవైనా....

ఇప్పటికి రెండు ఆల్బమ్స్ రిలీజ్ అయ్యాయి. మొదటి ఆల్బమ్‌కి పేరు వెరైటీగా ఉండాలని 'టైరిస్' అని తన పేరే పెట్టేసుకున్నాడు. మొదటి ఆల్బమ్ పూర్తి చేయడానికి అతనికి దాదాపు నాలుగేళ్ళు పట్టింది. కాని రెండో ఆల్బమ్ మాత్రం రెండేళ్ళ లోనే పూర్తి చేయగలిగాడు. దాని పేరు 'ఏంజిల్' ప్రస్తుతం మూడో ఆల్బమ్ కోసం వర్క్ చేస్తున్నాడు.

## ప్రోగ్రాం ముందు ప్రిపరేషన్...

పెద్దగా అవసరం ఉండదు కాని ఏం ప్లే చేయాలనేది అతని మూడ్ మీదే ఆధారపడి ఉంటుంది. అలాటే ప్రోగ్రాంకి హాజరైన వారి మూడ్‌ని బట్టి కూడా నిర్ణయించుకుంటాడు.

## ఫేవరేట్స్.....

'ఫిర్ భీ దిల్ హై హిందుస్థానీ'లో 'ఐయామ్ ది బెస్ట్' అనే ఓ పాట ఉంది. అదంటే టైరిస్‌కి చాలా చాలా ఇష్టం.

## ఇంకా.....

ఈ రోజుకీ చర్చిలో పాడతాడు. డెట్రాయిట్‌లోని ఓ చర్చిలో టైరిస్ మ్యూజిక్ డైరక్టర్‌గా వ్యవహరిస్తున్నాడు. ఇందుకోసం చికాగో నుంచి వారానికి రెండుసార్లు ఫ్లైట్‌లో డెట్రాయిట్ వెడతాడు. జాజ్ మ్యూజిక్‌కి సంబంధించి ఎవరైనా తన దగ్గరికి వస్తే వారికి పాఠాలు చెప్తాడు.

శివమణి (సింగర్)తో కలిసి ఓ ఇండిపాప్ ఆల్బమ్ చేయాలనే ఆలోచనలో వున్నాడు టైరిస్. ఇందుకోసం పాటల రచన కూడా మొదలు పెట్టాడు. టైరిస్‌కి తన మ్యూజిక్ ప్రొడక్షన్ కంపెనీని ముంబైలో కూడా నెలకొల్పే ఆలోచన ఉంది.

## మంచి డిజైనర్.....

నిజమే... త్వరలో తన బ్రాండ్ పేరుతో బట్టలు మార్కెట్‌లోకి విడుదల చేసే ఆలోచన కూడా టైరిస్‌కి ఉంది. అతను ఇక్కడ చేపట్టిన పనులు భారతదేశంలో ఎక్కువ కాలం గడపాలన్న నిర్ణయానికి ప్రాణం పోస్తున్నాయి.

**నన్ను చూడగానే, చిరునవ్వుల సరిగమలు నీ అధరాలపై**
**నాట్యమాడతాయి...**
**నీ కనులలో ప్రేమ సంగతులు సంగీతాలుగా విన్పిస్తాయి.**
**నీ స్పర్శలో అలౌకిక ఆనందం అనుభవించే నేను**
**నీ అంత అద్భుతంగా ఈ ప్రపంచంలో**
**నన్ను ఎవరైనా ప్రేమించగలరా అని ఆశ్చర్య**
**పోతుంటాను.**
**నీ ప్రేమ నీ అంతరాత్మని తట్టిలేపి**
**ఏదో దివ్యలోకాల్లోకి తీసుకువెడుతుంది.**
**నీకు తెలుసు నీ ప్రేమ నిత్యనూతనమనీ....**
**అజరామరమని.....॥**

అంటూ టైరిస్ పాడుతుంటే
ఏ హృదయం చెమ్మగిల్లదు?
ఏ కళ్ళకు ఆ తడి అంటదు....?

**-ఆదెళ్ళ శివకుమార్**




జానపద చిత్రాన్ని 'క్లాసిక్స్' అనదగ్గ స్థాయిలో తెలుగువారికి సమర్పించిన దర్శకుడు కెవిరెడ్డి. అందరికి ఆదర్శప్రాయమైన నిర్మాతలు నాగిరెడ్డి - చక్రపాణి. క్రొంగొత్త పదాలను సరళమైన తెలుగులో అందించిన కవి పింగళి నాగేంద్రరావు. వీరి కలయికతో అపూర్వ సృష్టిగా 1951లో విడుదలైంది...



విజయావారి

# పాతాళభైరవి

ఈ చిత్రంలోని పాటలన్నీ హిట్టే. అందులో ఆరు పాటల గురించి...

పల్లవి : తీయని ఊహలు హాయిని గొలిపే - వసంత గానమె హాయీ
వసంత నాట్యమె హాయ్‌హాయ్ ॥తీయ॥
ఇందు : చివురుల దాగి తీవెలనూగి - పూవులు ఘుమఘుమ నవ్వగా
వనియంతా పరిమళించెనే మనసెంతో - పరవశించెనె ॥తీయ॥
గిలిగింతలు చెరలాడి - చిరుగాలి సరాగము చేయగా
వనియంతా ఝుల్‌ఝులించెనే - తనువెంతో పులకరించెనే ॥తీయ॥
క్రొత్తరాగమున కుహూ, కుహూమని మత్తిలి కోయిల కూయగా
వనియంతా రవళించేనే - నన్నెంతో మురిపించెనే ॥తీయ॥

ఈ పాటను పి.లీల, బృందం, పాడగా తెరపై మాలతి, చెలికత్తెలుగా నటించిన ఉపపాత్రధారులు కనిపిస్తారు. ఎన్.టి.ఆర్. బాలకృష్ణ కూడా అభినయించారు. మూడు చరణాలలోనూ పల్లవికి దోవ చూపేలా ఉపసంహారం కోసం 'వనియంతా' ....అని ఉపయోగించడం ఓ ప్రయోగం. అలాగే ఝుల్‌ఝులించటం, మత్తిలి ఇవన్నీ పింగళికి సొంతమైన ప్రయోగాలు. ఇక సంగీతపరంగా చెప్పాలంటే మూడు చరణాల్లోనూ రెండోపాదాల ట్యూన్ ఒకేలా ఉన్నా మొదటి పాదాల వరసల్ని డిఫరెంట్‌గా చేయటం వీటికి ఈ రెండో పాదాల ట్యూన్ లింకు సరిపోయేలా ఉండటం సంగీత దర్శకుడు ఘంటసాలకి సంబంధించిన క్రెడిట్స్. మోహనరాగం ఈ పాటకు ఆధారం.

ఇందు : కలవరమాయే మదిలో - నా మదిలో -
కన్నులలోన కలలే ఆయే మనసే ప్రేమ మందిరమాయె
రాము : కలవరమాయే - మదిలో నా మదిలో
కన్నులలోన గారడిఆయే మనసే పూల మంటపమాయె ॥కల॥
ఇందు : నాలోయేమొ నవభావనగా - మెల్లన వీణ మ్రోగింది
అనురాగాలే - ఆలాపనగా మనసున కోయిల కూసే ॥కల॥
రాము : నాలోయేమొ నవరసరాగం - పిల్లనగ్రోవి ఊదిందీ
మోహాలేవో మోసులు వేసి - ఊహాగానము చేసే ॥కల॥
ఇందు : కన్నులలోన కలలేఆయే - మనసే ప్రేమ మందిరమాయే
కలవరమాయే మదిలో నా మదిలో
రాము : కలవరమాయే మదిలో నా మదిలో

ఈ పాటను ఘంటసాల, పి.లీల ఆలపించగా ఎన్.టి.రామారావు, మాలతి అభినయించారు. అతి క్లుప్తంగా ఉండే పల్లవులు, చిన్ని చిన్ని చరణాలు ఈ పాట ప్రత్యేకత. ఇంటర్లూడ్‌లతోసహా వింటే ఓ పెద్ద పాటలా అనిపిస్తుందేమో కాని రాసుకుని చూస్తే ఈ పాటలో అర్థం కాని పదం ఏదైనా ఉంది అని ఎవరైనా అంటే వారిని తెలుగురానివారుగా జమకట్టక తప్పదు. కలవరమాయె మదిలో అనే ఎక్స్‌ప్రెషన్ ఎంతగా ప్రజల్లో చొచ్చుకు పోయిందంటే తర్వాత వచ్చిన ఎన్నో కథలకు టైటిల్స్‌గా, ఒక్కోసారి ప్యారడీ టైటిల్స్‌గా, మరి కొన్నిసార్లు సన్నివేశాలకు సహకరించే డైలాగ్‌గా ఉపయోగపడుతూ ఈ నాటికీ సజీవంగా ఉంది. ట్యూన్‌పరంగా చూసుకుంటే చరణాల్లో - మెల్లగా వీణ మోగింది అనే వాక్యం తర్వాత వీణబిట్‌ని, పిల్లన గ్రోవిని ఊదింది అనే వాక్యం తర్వాత ఫ్లూట్ బిట్‌ని ఉపయోగించటం చాలా బావుంది అని అంటే ఇవాళ కొందరికి అంత గొప్పగా అనిపించకపోవచ్చుగానీ ఒక పక్క హీరోయిన్ పైట అందాల గురించి హీరో పాడాలని కవిగారు రాయగా పాటకూడా రికార్డు చేశాక ఆ హీరోయిన్ జీన్స్‌ఫాంటు, షర్ట్ వేసుకుని ఉండడంతో పోలిస్తే నిజంగా ఆ రోజుల్లో ఎంత ప్లాన్డ్‌గా ఉండేవారో అని అనుకోకుండా ఉండలేం కదా!?



ఇందు : ఎంత ఘాటు ప్రేమయో ఎంత తీవ్రవీక్షణమో ॥ఎంత॥
కన్నుకాటు తిన్నదిగ కళలు విరిసెనే
నా... మనసు మురిసెనే - ఎంతఘాటు ప్రేమయో
రాము : ఎంతలేత వలపులో ఎంతచాటు మోహములో ॥ఎంత॥
కన్నులలో కనినంతనే తెలిపిపోయెనే - నా మనసు నిలిచెనే
ఇందు : ఈ జాబిలి ఈ వెన్నెల ఈ మలయానిలమూ
విరహములో వివరాలను విప్పిచెప్పెనే ॥ఎంత॥
రాము : ఓ జాబిలి ఓ వెన్నెల ఓ మలయానిలమా
ప్రియురాలికి విరహాగ్నిని పెంపుజేయరే ॥ఎంత॥

తమ మనోభావాలను ప్రతిఫలింపజేసుకుని చూసుకునే అపురూప గీతంగా 'ఎంత ఘాటు ప్రేమయో' పాటను చెప్పుకోవాలి. తెరపై మాలతి, ఎన్.టి.రామారావు అభినయించిన ఈ పాటను పి.లీలతో కలిసి స్వీయ సంగీత దర్శకత్వంలో శ్రోతల హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయేలా పాడేరు ఘంటసాల. హిందుస్థానీ సంప్రదాయానికి చెందిన 'రాగేశ్రీ' అనే రాగాన్ని ఈ పాటను స్వరపరచటానికి ఉపయోగించారాయన. అందుకు సంబంధించి ఓ సంఘటన ఇక్కడ ఉదహరించాలి.

1948లో ప్రముఖ హిందుస్థానీ విద్వాంసుడు బడేగులాం ఆలీఖాన్ మద్రాసుకి వచ్చి సంగీత కచ్చేరి ఇవ్వడం జరిగింది. ఆ ప్రదర్శనను మద్రాసు మ్యూజిక్ అకాడమీ వారు ఏర్పాటు చేశారు. ఆ అకాడమీ ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబరయిన ప్రసిద్ధ విద్వాంసులు జి.యన్.బాలసుబ్రహ్మణ్యాం ఈయన పేరుని ప్రతిపాదించగానే పరమ నిష్ఠాగరిష్ఠులైన కొందరు కర్ణాటక సంగీత విద్వాంసుల తరపు నుండి తీవ్ర నిరసన వ్యక్తం అయ్యింది. 'ఒక్కసారి విని చూడండి. ఆ తర్వాత -మీకే తెలుస్తుంది' అని అందర్నీ సమాధానపరచి బడేగులాం ఆలీఖాన్ రప్పించారు. ఆ సంగీత ప్రదర్శనకు వచ్చిన వారంతా తన్మయత్వంలో మునిగిపోయారు. మర్నాడు ఉదయం ఏ నోట విన్నా బడేగులాం ఆలీఖాన్ గురించే.... ఆ ఊపులో ఒక్క మద్రాసులోనే 30 నుండి 40 సంగీత ప్రదర్శనలిచ్చారు బడే గులాం ఆలీఖాన్. ఆ తర్వాత మొత్తం దక్షిణాదిని తన స్వర సామ్రాజ్యంలో లీనం చేసుకోగలిగారాయన. ఆ ప్రభావంలో పడిన వారిలో ఘంటసాల కూడా ఒకరు. బడే గులాం ఆలీఖాన్‌ని తన ఇంటికి ఆహ్వానించి రెండు రోజుల పాటు ఆతిథ్యం ఇచ్చి ఎన్నో హిందుసానీ రాగాలను ఆకళింపు చేసుకున్నారు. ఆయనతో తీయించుకున్న ఫోటోలు ఘంటసాల వారింట్లో ఇప్పటికి వుంటాయి. ఈ పాటకు 'రాగేశ్రీ' రాగాన్ని ఉపయోగించడంలో ఘంటసాలపై బడే గులాం ఆలీఖాన్ వలన పొందిన సాంగత్య ప్రభావం ఉందంటారు కొంతమంది.

ఘాటు ప్రేమ, చాటుమొహం, తీవ్రవీక్షణం, కన్నుకాటు. ఇవన్నీ పింగళి వారి సాహితీ క్షేత్రంలో అలవోకగా మొలకెత్తి ఎందరో రసజ్ఞుల హృదయాలను పులకింతలతో నింపిన 'పదకావ్యాలు' ముఖ్యంగా ప్రేమకు ఘాటుని అన్వయించటం ఓ మహత్తర ప్రయోగం. శ్రీశ్రీ అంతటి మహాకవి కూడా 'ఎంత ఘాటు ప్రేమయో ఇంత లేటు వయసులో' అంటూ (నవరాత్రిలో) పేరడీ చేసేటంత గాఢంగా ముద్ర వేసుకుందా ప్రయోగం. ఆ తరువాత 'అత్తగారు -కొత్తకోడలు' చిత్రంలో 'ఘాటు ఘాటు ప్రేమ నడబాటులాయెనే' అంటూ మరోపాట వచ్చినా, ప్రేమగురించి ఎవరైనా మాట్లాడితే 'అంత ఘాటు ప్రేమా మీది?' అనే ప్రశ్న వ్యావహారికం లోకి వచ్చేసినా దానికి తొలిప్రేరణ 'పాతాళభైరవి' లోని ఈ పాటేనని ఘంటాపథంగా చెప్పొచ్చు.

వినవేబాల నా ప్రేమగోల - నినుకనువేళా నిలువగ జాలా ॥వినవే॥
గుబుల్ గుబుల్‌గా - గుండెల దడగా
దిగుల్ దిగుల్‌గా యిదియిదిగా ॥వినవే॥
చిరునవ్వు చాలే - చిత్తయిపోతానే
మురిపిస్తే చాలే - మూర్చేపోతానే ॥వినవే॥
జోడిగూడి తోడిరాగం పాడుకొంటూ మేడమీద
పైడిబంగార్ - తూగుటుయ్యాల్ వేడుకలరా
ఊగరావా ఊగరావా ఊగరావా ఊగరావ
చెట్టాపట్టీల్ జడకోలాటం తొక్కుడు బిళ్ళాఆడే నాతో
తొక్కుడుబిళ్ళా ఆడేనాతో .... ఆడేనాతో.... ఆడేనాతో



ఈ పాటను రేలంగి, మాలతి, ఎన్.టి.రామారావు బాలకృష్ణపై చిత్రీకరించారు. రేలంగే ఈ పాటను పాడటం జరిగింది. ఆయనకు ఆయనే పాడుకున్నాడు కనుక ఆయన పేరుని ఆనాడు నేపథ్య గాయనీగాయకుల టైటిల్ కార్డులలో పేర్కొనలేదు. ఒక్క ఆయన పేరు మాత్రమే కాదు 'ఇతిహాసం విన్నారా' పాటను పాడిన టి.జి.కమల పేరు, 'ప్రేమకోసమై' పాటను పాడిన వి.జె.వర్మ పేరు. ఇంకా మనకు తెలిసిన చాలామంది పేర్లు టైటిల్స్‌లో లేకపోవటం గమనించవచ్చు. గుబుల్/దిగుల్/పైడిబంగార్/తూగుటుయ్యాల్/చెట్టాపట్టీల్ వంటి పొల్లులతో పొల్లు పోని హాస్యం అందించారు పింగళి. విజయా వారి వద్ద హెమండ్ ఆర్గన్ వంటి కొన్ని వాద్యాలుండేవి. వాటిని ఒక్క మాస్టర్ వేణు మాత్రమే వాయించే వారు. ఈ 'వినవేబాలా' పాటలో 'హుప్ హుప్' అని రేలంగి అన్న తర్వాత వచ్చే 'తొక్కుడు బిళ్ళా ఆడే నాతో' దగ్గర వినిపించే వాద్య సంగీతం (తెరపై పాము రావటం కనిపిస్తూ వుంటుంది వేణు వాయించినట్టుగా అనిపిస్తుంది. టైటిల్స్‌లో జాగ్రత్తగా గమనిస్తే ఆర్కెస్ట్రా నిర్వాహకుడిగా మాస్టర్ వేణు పేరుని మనం ఇప్పుడు కూడా గమనించవచ్చు.



వగలోయ్ వగలు తళుకుబెళుకు వగలూ
బావలూ మామలూ బావలు మావలు బావలూ
లాలలూ లాలలూ లాలలు లాలలు లాలలూ
చింగారీ వీడెంట మావ రంగేళి పిల్లంటబావ
కొంగు తాకిందంటే... హేయ్.... కుయ్ కుయ్ కుయిలే ॥లాలులూ॥
నీ వెంట వస్తాను - ఆ నీజంట ఉంటాను - ఏం ॥నీ వెంట॥
సైయంటే బావా ఉ అంటె మావా
చెలియనీ, భళియనీ, సరేయనీ, చెలామణి
నా వెంట మీరంతా, గుమిగుమి, గుమిలే
లలలూ, లలలూ, లలలు, లలలు, లలలూ
వగలోయ్ వగలు, తళుకు బెళుకు వగలూ

**ఈ** పాటను జిక్కి, బృందం పాడగా తెరపై ప్రధాన నృత్యకారిణిగా లక్ష్మీకాంత కనిపిస్తుంది. యస్వీ రంగారావు, యన్.టి.రామారావు, పద్మనాభం, బాలకృష్ణ, వల్లం నరసింహారావు మొదలైన వారందరూ సన్నివేశంలో కనిసిస్తారు. 'చెలియని/భళియని/సరేయని/చెలామణి - కుయ్ కుయ్ కుయిలే/ గుమిగుమిలే' ఇవన్నీ పింగళి పాళీ కేళీలు. ఇక సంగీతపరంగా చెప్పాలంటే - 1948లో 'ది లవ్స్ ఆఫ్ కార్మెన్' అనే చిత్రం విడుదలయింది. ఆ చిత్రంలో రీటా హేవర్త్ హీరోయిన్. ఆమె జిప్సీ డాన్స్ చేస్తూ అభినయించిన 'లలలూ లలలూ' అనే గీతం 'ఈ వగలోయ్ వగలు'కి ప్రేరణ. ఈ పాటలో 'తళుకు' అని వచ్చినప్పుడల్లా జిక్కి 'థళుకు' అని పలకటం వల్ల 'తళుకు'కి అందమైన ఒత్తిడి ఊపు వచ్చాయి. జిక్కి అసలు పేరు కృష్ణ వేణి. అందుకే టైటిల్స్‌లో 'కృష్ణవేణి' అంటూ వేసి బ్రాకెట్లో జిక్కి అని కూడా ఉంచారు. ఇదిలా వుండగా విజయా వారు 'భైరవ ద్వీపం' సినిమాను తీసినప్పుడు యస్.జానకి చేత పాడించిన 'నరుడా ఓనరుడా ఏమి కోరికా' అనే పాటను సంగీత దర్శకుడు మాధవపెద్ది సురేష్ అటు ఆ 'లవ్స్ ఆఫ్ కార్మెన్' లోని 'లలలూ లలలూ' పాటని ఇటు ఈ 'వగలోయ్ వగలు' పాటని కలిపి ఇన్స్పిరేషన్‌గా తీసుకున్నాడు. దొరికితే ఈ రెండు పాటల్నీ మార్చి మార్చి విని చూడండి. పోలిక తెలుస్తుంది.



ప్రేమకోసమై వలలో పడెనే, పాపం పసివాడు...
అయ్యో పాపం పసివాడు
వేమరుదేవుల వేడుకొని తన కొమరుని క్షేమం కోరుకుని
ఏమైనాడో - ఏమౌనోయని కుమిలే తల్లిని కుములుమనీ ॥ప్రేమ॥
ప్రేమకన్ననూ పెన్నిధియేమని యేమిధనాలిక తెచ్చుననీ
భ్రమసి చూచు ఆ రాజకుమారిని
నిముసమె యుగముగా గడుపుమనీ ॥ ప్రేమ॥
ప్రేమలు దక్కని బ్రతుకేలాయని ఆ మాయా విని నమ్ముకొని
ఏమివ్రాసెనో... అటు కానిమ్మని బ్రహ్మదేవునిదే భారమనీ ॥ ప్రేమ॥

**ఈ** పాటను వి.జె.వర్మ పాడగా మధ్యన ఒక ఆలాపనతో ఘంటసాల తన గొంతును కలిపారు. ఎన్.టి.రామారావు, యస్వీ రంగారావు, సురభి కమల, మాలతిపై చిత్రీకరించారు. సింధుభైరవి రాగచ్ఛాయలలో ఈ పాటను స్వరపరిచారు ఘంటసాల. పాటల రచయితగా ఈ పాట ద్వారా పింగళి సాధించిన విజయం చాలా వుంది. 'ప్రేమకోసమై వలలో పడెనే పాపం పసివాడు' అనే వాక్యం ఒక సామెతలా తెలుగునాట ఈ నాటికీ చెలామణిలో ఉందంటేనే ఆలోచించుకోవచ్చు - ఆ విజయం ఎంతటిదో!? వాసిగల వాక్యానికి వార్ధక్యం ఉండదంటారు.... బహుశా ఇదేనేమో!! ఈ పాటను పాడింది విజెవర్మ అని చాలామందికి తెలియదు. ఈ పాటను మొత్తం పాటను ఘంటసాలే పాడేరనుకునే వాళ్ళయితే లెక్కేలేదు.



ఈ పాటలే కాక 'పాతాళభైరవి'లో ఎన్నదగిన పాటలు యింకా వున్నాయి. కాకపోతే ప్రజాదరణతో పోలిస్తే పైన ఉదహరించిన పాటలకే ప్రాచుర్యం ఎక్కువ. తెలుగు సినీ చరిత్రలో ఎన్నో సినిమాలను తిరిగి నిర్మించడం జరిగింది. పాతాళభైరవికి నకలుగా చాలా సినిమాలు రిపీట్ అయ్యాయి కానీ మళ్ళీ 'పాతాళభైరవి'ని తెలుగులో తీయలేక పోయారంటే కారణం అంతటి ప్రామాణికత దాదాపు అసంభవం కనుక...!

# న్యూస్ ఫ్లాష్

## మ్యూజికల్ డబ్బింగ్



సినీ గాయకునిగా ఇప్పుడిప్పుడే నిలదొక్కుకుంటున్న పాత్రికేయుడు గంగాధర్ 'జాబిలి' సినిమా హీరోకి డబ్బింగ్ చెప్పాడు. బాలూ, మనో లాంటి వాళ్ళు అప్పుడప్పుడు డబ్బింగ్ చెప్పినా అది వాళ్ళు సింగర్‌గా బాగా పేరు తెచ్చుకున్న తర్వాతే జరిగింది. మరి గంగాధర్ విషయంలో అందుకు భిన్నంగా జరగటానికి కారణం ఏమై ఉంటుందని 'జాబిలి' చిత్ర దర్శకుడు యస్వీ కృష్ణారెడ్డిని అడగటం జరిగింది. "ఈ సినిమాలో హీరోయిన్‌కి సునీత డబ్బింగ్ చెప్పింది. ఆమె కూడా సింగరేనని మీకు తెలుసుగా... ఆమె డబ్బింగ్ చెపుతుంటే డైలాగ్స్ మ్యూజికల్‌గా వినిపించాయి. అలా హీరోకి కూడా చెప్పిస్తే బావుణ్ణనిపించింది. వెంటనే గంగాధర్ మనసులో మదిలాడు. ఎలా చెప్తారో చూద్దాం అని పిలిపించి టెస్ట్ చేశాం. చాలా చక్కగా నేను అనుకున్నట్టు చెప్పాడతను. అతను కూడా డబ్బింగ్ చెపుతుంటే మ్యూజికల్‌గా వినిపించాయి డైలాగ్స్" అన్నారు యస్వీ కృష్ణారెడ్డి.

## విదేశీ గడ్డపై మృగయా వినోదం



ప్రతీ ఏడాదీ ఆగస్టు, సెప్టెంబరులలో ఇంగ్లండులోని ఎడింబరోలో ఒక సాంస్కృతిక మేళా జరుగుతూంటుంది. అసలవి ఐదు విడివిడి ఉత్సవాలు. అన్నిటినీ కలిపి ఇప్పుడు ఫ్రింజ్ ఫెస్టివల్ అంటున్నారు. రెండు వారాల పాటు జరిగే ఈ ఉత్సవంలో ప్రపంచంలోని నలుమూలల నుండి వచ్చిన వివిధ రంగాలకు చెందిన కళాకారులు పాల్గొనే షోలు రోజుకి 200 ఉంటాయంటే ఇది ఎంత పెద్ద మేళాయో అర్థం చేసుకోవచ్చు. ఈ ఏడాది మనదేశం నుండి కొంత మంది కళాకారులు ఒక బృందంగా వెళ్లి ఎడింబరో ఫెస్టివల్‌లో పాల్గొన్నారు. వారిలో మహారాష్ట్ర యాదవుల నృత్యం చాలామందిని ఆకట్టుకున్నదట. "ఇండియన్ ఓషన్" అనే బృందం కూడా తమ పాటలతో జనాలను అలరించింది. అందరి కంటె ఎక్కువ మార్కులు కొట్టేసినది- 'మృగయా' అనే బ్యాండ్. దానిలో ఇండియన్ క్లాసికల్ నుండి వరల్డ్ మ్యూజిక్ దాకా అన్నీ కలిసి వచ్చేట్లు - క్లాసికల్ నుండి జాజ్‌దాకా అన్నీ వున్నాయి. శరత్‌చంద్ర శ్రీవాస్తవ (వయొలిన్) గ్యాన్‌సింగ్ (తబలా), సోనమ్ షెర్పా (గిటార్స్) ఇంద్రనీల్ హరిహరన్ (బాస్ గిటార్), సచిన్‌కపూర్ (కీబోర్డ్) రజత్ కక్కడ్ (డ్రమ్స్) సుక్రీతి సేన్ భట్టాచార్య (గాత్రం) - తో కూడిన ఆ బృందం పర్యాటకులను విశేషంగా ఆకర్షించిందట.

(యింకా మరిన్ని 66వ పేజీలో)




## డాక్టర్లు - పేషంట్ల స్పెషల్



ఒక చోట బాక్సింగ్ పోటీలు జోరుగా జరుగుతున్నాయి. "ఊ కొట్టు.... కొట్టు.... దెబ్బకు వళ్ళన్నీ రాలి పోవాలి.... అని ప్రేక్షకుల్లోంచి అరుస్తున్నాడో వ్యక్తి.

'మీకు బాక్సింగ్ అంటే అంతిష్టమా?' అడిగేడు పక్కనున్న వ్యక్తి.

'ఇష్టమా.... పాడా....!? నేను పక్కవీధిలో ఉన్న డెంటిస్ట్‌ని....' అన్నాడా డా॥ అరుపుల్రావు.



"నాకు నాలో నేను మాట్లాడుకునే అలవాటుంది.... అది చూసి నన్ను ఎవరైనా పిచ్చోడిగా భావించరు కదా డాక్టర్"

"చూస్తే ఏమీ అనుకోరు. కానీ ఏవైనా వినబడితేనే అనుకుంటారు".



"ఆహోహో ఐకమత్యం అంటే ఇలా వుండాలి..."

"మీరన్నదేమిటో అర్థం కావటం లేదు డాక్టర్"

"బ్లడ్ ప్రెషర్, షుగర్, ఇస్నోఫీలియా, అల్సర్.... ఇలా అన్ని జబ్బులూ మీ ఒక్కరి దగ్గరే కల్సి వున్నాయి.... వండ్రఫుల్".



"నాకిలా రక్తపోటు రావడానికి ముఖ్య కారణం ఏమిటంటారు డాక్టర్"

"రక్తం వుండడం...."



"ఓ రెణ్ణెల పాటు జాగ్రత్తగా ఉంటే మామూలుగా అయి పోతావు. అన్ని పనులూ స్వంతంగా అద్భుతంగా చేసుకోగలవు కూడా" అన్నాడు డాక్టరు - రాము చేతికి కట్టుకడుతూ

"వయొలిన్ వాయించ గలనా?" అడిగాడు రాము ఆశగా

"భేషుగ్గా...."

"అరె ... అదెలా.... ఇప్పటి వరకు నాకు వయొలిన్ పట్టుకోవడం కూడా రాదు కదా" అన్నాడు రాము ఆశ్చర్యంగా.



సరిగ్గా కనిపించటం లేదని కళ్ళ డాక్టర్ దగ్గరకు వెళ్ళాడో కుర్రాడు. ఎదురుగా ఉన్న ఓ బోర్డు చూపించి చదవ మన్నాడు. "ఊహు" అన్నాడా కుర్రాడు తల అడ్డంగా తాటిస్తూ. "నేనున్నాగా... ఏం ఫరవాలేదు." అంటూ రకరకాలుగా టెస్ట్ చేశాడా డాక్టరు.

ఎన్నో అద్దాలు మార్చాడు. ఎంతో శ్రమ తీసుకున్నాడు. అయినా ఫలితం కనిపించలేదు.

ఆశ్చర్యపోయాడా డాక్టరు. "నిజం చెప్పు.... అస్సలేం కనిపించటం లేదా....?" అంటూ అడిగాడు గాభరగా. "అస్సలు కనిపించటం లేదని ఎవరన్నారు...? అన్నాడా కుర్రాడు. "మరి చదవడానికేం తెగులు" అడిగాడు డాక్టరు విసుగ్గా. "నాకు చదవటం వచ్చని చెప్పానా మీతో..." అంటూ ప్రశ్నించాడా కుర్రాడు కూల్‌గా.



"డాక్టరు గారూ నాకు నిద్రలో నడిచే అలవాటుంది. పోవాలంటే ఏం చేయాలి?

పడగ్గది మొత్తం గుండు సూదులు జల్లితే సరి....."

జలుబు నిర్లక్ష్యం చేస్తే ఏమవుతుందోనన్న భయం. దానాలూ, ధర్మాలు చేయకపోతే ఏమవుతుందోనన్న భయం -
ఒకటి వైద్యుడి పంట పండిస్తుంది. మరోటి పూజారి పంట పండిస్తుంది.
-Nicholas Chamfort




## డాక్టర్లు - పేషంట్ల స్పెషల్



"ఉన్నట్టుండి మా ఆయన 'నేను కారుని' అంటుంటాడు. ఇవాళ ఆ కారుకూతలు మరీ ఎక్కువై పోయాయి. భయం వేసి వెంఠనే మీ దగ్గర కొచ్చాను డాక్టర్"

"మీ ఆయన్ని కూడా తీసుకు రావల్సింది...."

"వచ్చేరండీ.... బైట పార్కింగ్ ప్లేస్‌లో ఉన్నారు. అంతకు మించి ముందుకు రాకూడదట..."



"మా నాన్నగారి డెత్ సర్టిఫికెట్ సబ్మిట్ చేస్తేనే గాని మా అమ్మకు పెన్షన్ ఇవ్వరట.

అదేదో ఇచ్చి పుణ్యం కట్టుకోండి డాక్టరు గారూ"

"ఓ.... అలాగే.... దానికేం భాగ్యం... ఇంతకీ మీ నాన్నగార్ని ట్రీట్ చేసిన డాక్టరెవరు?"

"ఏ డాక్టరూ ట్రీట్ చేయులేదండి... ఆయనంతట ఆయనే పోయేడండి..."

పేరు మోసిన డాక్టరంటే - ఆపత్సమయంలో మీరు వెంటనే తలచుకొనేవాడు, వెంటనే పరిగెడితే దొరకనివాడు!
-Denis Diderst



"మిమ్మల్ని మీరు దేవుణ్ణనుకునే ఈ పిచ్చి మీకు పోవాలంటే... మీ చిన్నతనం, మీరు పుట్టి పెరిగిన వాతావరణం.... అన్నీ ఒక్కటొక్కటిగా గుర్తు చేసుకుంటూ రండి..."

"య్యస్ డాక్టర్... మీరంటుంటే ఒక్కొక్కటీ గుర్తొస్తున్నాయి..."

"గుడ్... ఏ మాత్రం డిస్టర్బ్ కాకుండా అలాగే గుర్తు చేసుకుంటూ రండి.... కమాన్..."

"ఓ మహా సముద్రం కనిపిస్తోంది డాక్టర్..."

"వెరీ గుడ్... ఆపద్దు... కంటిన్యూ..."

"ఆ మహా సముద్రం పై ఓ మర్రి ఆకు"

"ఆఁ"

"ఆ ఆకు పై నేనే... కాలి బొటన వేలు చీక్కుంటూ...."

"అదేంటీ..."

"అదంతే. నేపథ్యం నుంచి 'వటపత్ర శాయికి వరహాల లాలి' అనే పాట వినిపిస్తోంది".

"ఇప్పుడర్థం అయింది"

"అయింది కదా.... గుడ్... అప్పుడేం జరిగిదంటే ముందు విశ్వాన్ని సృష్టించానన్నమాట."

"ఆ తర్వాత.. నన్ను చెప్ప నీయండి... ఆ విశ్వంగారు శంకరాభరణం, సాగర సంగమం తీశారు. ఆ తర్వాత స్వాతిముత్యం తీద్దామని ఇళయరాజాకి, సి.నారాయణరెడ్డికి, సుశీలకి కబురు పెట్టారు."

"ఎందుకూ...?"

"ఎందుకు అంటే ? నేపథ్యం లోంచి మీకు వినబడ్డానికి' వటపత్ర శాయికి వరహాల లాలి' పాటని తయారు చెయ్యొద్దా మరి..."



"సిస్టర్.... నిన్న మనం ఓపెన్ హార్ట్ సర్జరీ చేసిన పేషెంట్ కండిష నెలా ఉంది?"

"బాగానే ఉంది డాక్టర్.... కాకపోతే హార్ట్ బీటే రెండు రకాలుగా వినబడుతోంది"

"థాంక్ గాడ్.... కష్టపడి గడించిన సొమ్ము ఎక్కడికీ పోదని మరోసారి ఋజువైంది.... బిల్లు వేసేటప్పుడు గుర్తు చేయండి. ఎమౌంట్ కొంచెం ఎక్కువ కలెక్ట్ చేసి మరో రిస్ట్ వాచ్ కొనుక్కోవాలి...."




'మీరు చేసే ఆపరేషన్‌ని థియేటరులో కాక మార్చురీలో ఎందుకు చేస్తారు?' అడిగేడు విలేకరి.

"డెడ్ బాడీని తరలించే తతంగం అతి తొందరగా అయిపోతుందని చెప్పాడు కొత్త డాక్టర్."



"ఎందుకో డాక్టర్ ... సడన్‌గా నిగ్రహం పోతూ ఉంటుంది. పిచ్చ కోపం వచ్చేస్తుంటుంది...?

"సారీ... సరిగ్గా వినలేదు. ఏవన్నారు...?,

"రోగం చెప్పుకోవడానికి పేషెంటొస్తే చెవులెక్కడ పెట్టుకు చచ్చావురా చెవలాయ్..!? నీ పిండం పిల్లులకి పెట్టా, అసలు నీకు డాక్టర్ డిగ్రీని ఇచ్చిన త్రాష్టుడెవర్రా... వాడి శవాన్ని నిలువుగా పెట్టి తగలెట్టా...'

నయం చేసేది దేవుడు
వసూలు చేసేది వైద్యుడు.
-Benjamin Franklin.

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : దిల్ చాహతాహై |
| బ్యానర్ | : ఎక్సెల్ ఎంటర్‌టెయిన్‌మెంట్ ప్రొడక్షన్స్ |
| నిర్మాత | : రితేష్‌సిద్వానీ |
| కథ, స్క్రీన్ ప్లే, మాటలు, దర్శకత్వం: | : ఫర్హాన్ అఖ్తర్ |
| పాటలు | : జవేద్ అఖ్తర్ |
| సంగీతం | : శంకర్ - ఎహసాన్ - లాయ్ |
| ఈ పాటను పాడినది | : షాన్, కవితా సుబ్రహ్మణ్యం |
| అభినయించినది | : సోనాలీ కులకర్ణి, సయీఫ్ అలీఖాన్ |

# ఓ లడ్కీ హై కహా౦....

లగాన్ తర్వాత హిట్ అయిన ఆమీర్‌ఖాన్ సినిమా - దిల్ చాహతా హై! కానీ దీని విజయంలో అతనితో బాటు చాలామందికి వాటా ఉంది. అతనితో బాటు నటించిన ఇతర నటీనటులకే కాదు, అంత క్లీన్‌గా సినిమా తీయడానికి ధైర్యం చేసిన నిర్మాత, దర్శకులకు కూడా!

ఇది ముగ్గురు మిత్రుల కథ. వారి స్నేహబంధం గురించిన కథ. ఆమీర్‌ఖాన్, అక్షయ్‌ఖన్నా, సయీఫ్ ఆలీఖాన్ ముగ్గురికి ప్రాధాన్యత కలిగిన పాత్రలు లభించాయి. వీరిలో అక్షయ్ ఒక పెయింటర్. భర్తతో విడిపోయి ఆ బాధతో తాగుబోతు అయిన డింపుల్ కపాడియాతో అతనికి ఒక బ్యూటిఫుల్ రిలేషన్‌షిప్ ఏర్పడుతుంది. ఆమీర్‌ఖాన్‌కి ప్రేమంటే సదభిప్రాయం లేదు. తనవెంట పడితిరిగే దీపా అనే మోడల్‌ని పట్టించు కోడు. చివరికి ఒపేరా చూడడానికి వెళ్లిన ప్పుడు హఠాత్తుగా అతనికి జ్ఞానోదయం కలుగు తుంది, ప్రేమంటే ఏమిటో తెలిసి వస్తుంది. అతనికి జంటగా ప్రీతి జింటా నటించింది.

ఇక మిగిలినది సయీఫ్ ఆలీ ఖాన్. కనిపించే ప్రతీ అమ్మాయినీ ప్రేమిం చేస్తూ ఉంటాడు. ఫెయి లైన ప్రతిసారీ 'ఇది ప్రేమ కాదు' అనుకుంటూ ఉంటాడు. మరో అమ్మాయి కనబడగానే 'ఇదే అసలు ప్రేమ' అంటూ మళ్ళీ వ్యవహారాన్ని కొనసాగిస్తూ వుంటాడు. ఇవన్నీ అతని తల్లిదండ్రులకు తెలియవు. సోనాలీ కులకర్ణితో పెళ్ళిచూపులు ఏర్పాటు చేస్తారు. చూడగానే నచ్చేస్తుంది సైఫ్ అలీఖాన్‌కి. కానీ ఆ అమ్మాయికి ఓ బాయ్‌ఫ్రెండ్ ఉంటాడు. అతను ఓ బీసీ నాటి మనిషి. అతని ప్రభావం సోనాలీ కులకర్ణిని తన వైపు తిప్పుకుని పెళ్ళి చేసుకోడానికి నానా పాట్లూ పడతాడు సైఫ్ ఆలీఖాన్. అదీ కథ.



సైఫ్ ఆలీఖాన్ సోనాలీ కులకర్ణి ఇద్దరూ కలిసి సినిమాకు వెళ్ళినప్పుడు తెర మీద వచ్చే పాట ఇక్కడ ప్రస్తావించడం జరుగుతోంది. పాతహిందీ సినిమాల పాటలను అనుకరిస్తూ, వెక్కిరిస్తూ స్టూడియోలోనే బ్యాక్ ప్రొజెక్షన్స్ సహాయంతో జీపులో ప్రయాణాలు చేసేస్తూ పాత బెల్‌బాటమ్ ఫాంట్లు, పెద్దపెద్ద కాలర్లున్న చొక్కాలు వేసుకుని, స్టెపులు వేస్తూ పిక్నిక్‌లు చేసుకునే కృత్రిమ వాతావరణాన్ని ఎత్తి చూపుతూ సరదాగా సాగిన పాట ఇది. సరదాగా సాగు తూనే ఒక జీవిత సత్యాన్ని చాటిచెపుతుందీ పాట. సాధారణంగా మనం ఎదురుగా ఉన్న వజ్రాన్ని వదిలిపెట్టి, ఎక్కడో ఉన్న గులకరాయిని వెతుకుతాం. తెలుసుకు నేటప్పటికి చాలా ఆలస్యం అయిపోతుంది.

అదేవిధంగా ఇద్దరు స్నేహితుల మధ్య ఉన్న రిలేషన్‌షిప్ ఎటువంటిదో - బయటవాళ్ల సంగతి సరే - వాళ్లకు వాళ్లకే తెలియదు. దాన్ని ప్రేమగా నిర్వచించాలో లేదో వాళ్లు తేల్చుకోలేరు. 'నువ్వే కావాలి...' సినిమా కూడా అదే థీమ్ మీద తయారయ్యింది. అలాగే ఈ సినిమాలో కూడా సయీఫ్ అలీ ఖాన్‌కి సోనాలీపై తనకున్న భావాలను గుర్తుపట్టడం ఈ సన్నివేశం ద్వారా చిత్రీకరించారు. దీనిలో ఓల్డ్ ఫ్లేవర్‌తో బాటు, కొత్త గుబాళింపు కూడా కలవడంతో చక్కటి పాట తయారయింది.

## పాట

జిసే ఢూండ్‌తా హూఁ మై హర్ కహీఁ
జో కభీమిలీ ముఝే హైనహీఁ
ముఝే జిస్‌కే ప్యార్ పర్ హెూ యకీఁ
వో లడ్కీ హై కహాఁ
జిసే సిర్ఫ్ ముఝ్‌సే హై ప్యార్
జో యే కహ్‌నేకో భీ తయార్ హెూ
సునో తుమ్ హైమేరే దిల్‌దార్‌హెూ
వో లడ్కీ హైకహాఁ
జో తుమ్హారే ఖ్వాబోంమే హైబసీ
వో హసీన్ మూర్తి ప్యార్‌కీ
మిలేగీ తుమ్హే కభీనకభీ
జరాదేఖ్ యహాఁ వహాఁ
చలో ఢూండ్ తే హై హమ్ తుమ్ కహీ
వో పరీవో హూర్ వో నాజ్ నీఁ
జిసేదేఖో తో కహెూ తుమ్ వహీ
అరే యే తో హై యహాఁ

జానే క్యో ఖయాల్ ఆయా ముఝే
కి వో లడ్కీ కహీ తుమ్ తో నహీఁ
తుమ్హే ధోకా లగ్తా హై హోగయా
ముఝే హై సమఝ్ లియా జానేక్యా
న మై హూ పరీ న మై అప్సరా
కరో తుమ్ న యే గుమాన్
జిసే ఢూండ్ తా హూ మై హర్‌కహీ
జో కభీమిలీ ముఝే హైనహీ
ముఝే జిస్ కే ప్యార్ పర్ హెూ యకీన్
వో లడ్కీ హైకహా
మాన్‌లో అగర్ మై యే కహూఁ
కే మేరే ఖ్వాబ్ మే తుమ్ హీతో
జాన్‌లో మేరా అర్‌మాన్ హై
కి మేరాసాథ్ హీ అబ్‌తుమ్ రహెూ
ముఝే తుమ్‌నే క్యా సమఝాదియా
మేరా దిల్‌కో జైసే ధడ్కా దియా
మేరాతన్ బదన్‌తో పిఘలాదియా
వో సునాయే దాస్తా
జిసే ఢూండ్‌తా హూ మై హర్‌కహీఁ
జో కభీ మిలీ ముఝేహై నహీఁ
ముఝే జిస్‌కే ప్యార్ పర్ హెూయకీఁ
ఓ లడ్కీ హై కహా ఁ
ఓ లడ్కీ హై యహా ఁ

## స్వేచ్ఛానువాదం

అతడు : అక్కడ ఇక్కడ వెతికా...
వేసారా...
ఒక్కసారైనా కలవకున్నా
తన మనుసు నాదేనని
ననునమ్మించిన
ఆ చిన్నది ఎక్కడో....
2 నన్ను మాత్రమే వలచి
నోరారా అది తెలిపి
నువ్వేరా నా వన్నెకాడివని పలికిన
ఆ పడుచు ఎక్కడో....
ఆమె : నీ కలల్లో డేరా వేసిన
ఆ అందాల ప్రేమరాశి
తారసిల్లుతుంది నేడో, రేపో
తరచి చూడు ఆ వైపో, యీ వైపో
4 కలిసి వెతుకుదాం పద
కంటబడితే అంటావేమో ఇలా-
ఈ చక్కని చుక్క నా పక్కనే ఉందే!
ఇన్నాళ్లూ కట్టెదుటే కొలువు తీరిందే!
అతడు 5 తరచి చూస్తే, తలచి చూస్తే
అనిపిస్తోంది ఆ వధువు నీవేనేమో
నిరంతరం నే వెతికే ఆ అందాలన్నీ
నెలవై యున్నాయి నీలోనే సుమా
ఆమె 6 ఏమారిపోయావనుకుంటా, ఎందుకీతంటా
ఏమనుకున్నావో, నన్నేమనుకున్నావో
అందాల అప్సరనా? దిగివచ్చిన దేవతనా?
అందమైన ఈ పొరబాటు
మానుకుంటే మేలంటా!
కోరస్
అతడు 7 అన్నాననుకో ఒక వేళ నీతో
నా కలల రూపానివి నీవేనని
నా ఆశల సౌధానివి నీవేనని
నా తోటే నీ బతుకని
ఆమె 8 ఏం ఊరించావో, ఎలా ఒప్పించావో
నా గుండె సవ్వడి పెంచింది
ఒళ్లు మై మరచి కరిగి నీరైంది
ఊసులు చెప్తాను ఊ కొట్టమంటోంది
కోరస్ ఎక్కడుందో ఏమో ఆ వయ్యారి
ఇక్కడే ఉంది చూడోసారి మరి

ఈ పాటను షాన్, కవితా సుబ్రహ్మణ్యాం పాడేరు. ఇటీవల విజృంభిస్తున్న కవితా సుబ్రహ్మణ్యాం, ప్రతిభ ఈ పాటలో మరింతగా కనిపిస్తుంది. ఒక విధంగా ఆమె షాన్‌ను డామినేట్ చేసిందన్న అందులో అతిశయోక్తి లేదు.

శంకర్ - ఎహసాన్ - లాయ్ ఈ చిత్రానికి సంగీత దర్శకత్వం వహించారు. ఆ ముగ్గురూ ఎవరో కాదు. గాయకుడు శంకర్ మహదేవన్, గిటారిస్ట్ ఎహసాన్ నూలానీ, కీబోర్డ్ ప్లేయర్ లాయ్ మెండోన్సా.

మరో విశేషం ఏమిటంటే ఈ పాటను లండన్‌లోని టౌన్ హౌస్ స్టూడియోలో మాస్టర్ చేసినా రికార్డ్ చేసింది మాత్రం చెన్నైలోని కలసా స్టూడియోలో!

ఇదిలా ఉండగా ఈ చిత్రంలోని పాటలన్నిటికీ స్ట్రింగ్స్ వాయించింది మన కె.శ్రీనివాసమూర్తి! శ్రీనివాసమూర్తి అంటే ఎవరో కాదు. యస్పీ బాలు దగ్గర వయోలినిస్ట్‌గా జీవితాన్ని ప్రారంభించి అసిస్టెంట్‌గా ఆయన వద్ద 'మయూరి' వంటి చిత్రాలకు పని చేసి తరువాత ఎ.ఆర్.రెహమాన్ దగ్గర



అసిస్టెంట్‌గా చేస్తూనే ఇటీవల ఇవీవీ తీసిన 'మా ఆవిడ మీదొట్టు మీ ఆవిడ చాలా మంచిది' సినిమాకి సంగీతాన్ని ఇచ్చాడు. ఇవన్నీ మనం గర్వించదగ్గ విషయాలు.

ఈ పాటలో తారసిల్లే కొన్ని మాటల గురించి ముచ్చటించుకోవాలంటే 'ఖ్వాబ్'- అనేక హిందీ సినిమా పాటలలో తరచుగా వినబడుతూంటుంది. కల అని అర్థం. 'పరీ' - ఇంగ్లీషులో 'ఫెయిరీ' కి సమానార్థం అందమైన దేవకన్య అనవచ్చు మనం. 'హూర్'- కూడా అటువంటి అర్థమే. ముస్లిముల ప్రకారం స్వర్గం (జన్నత్ అంటారు) లోని అప్సరలు. ఖయాల్ (కొన్ని చోట్ల ఖ్యాల్ అని కూడా రాస్తారు) కూడా మనకు అనేకసార్లు తగులుతుంది. అంటే అభిప్రాయం, ఊహ అని రెండు అర్థాలలో పాటల్లో ఉపయోగిస్తారు. శ్రద్ధ, జ్ఞాపకం అనే అర్థంతో సంభాషణలలలో ఉపయోగిస్తారు. గుమాన్- అంటే సందేహం, ఊహ, అర్‌మాన్ అంటే ఆశయం, కోరిక అనే అర్థాలున్నాయి. పిఘల్‌నా అంటే కరిగిపోవడం.




# శాస్త్రీయ స్వరసరోవరంలో ఇంగ్లీషు కెరటాలు లేపిన మధురశిల్పి

బాపూ రమణలకు ఇష్టమైన వాటిల్లో సంగీతం ఒకటి. చిత్ర నిర్మాతలు అయ్యాక వారి చిత్రాలను సంగీత భరితంగా తీర్చిదిద్దడం వల్ల వారి అభిరుచి అందరికీ బాగా తెలిసిందే. అయితే ఈ అభిరుచి అంతకుముందు నుండే ఉందన్న సంగతి పాత్రికేయుడుగా రమణ రచనలను చూస్తే తెలుస్తుంది. సాలూరి రాజేశ్వరరావుగారిపై నాలుగు వ్యాసాలు రాసారు రమణ. బాపూ గారి బొమ్మలు, కృష్ణుడితో రాజేశ్వరరావు కార్టూన్ సంగతి సరేసరి.

ఈ వ్యాసాలన్నీ రమణ 1956-60లలో ఆంధ్రపత్రిక వీక్లీలో పని చేసే రోజుల్లో రాశారు. ఆ రోజుల్లో ఆయన విస్తృతంగా అనేక సబ్జక్టులపై రాసారు. బాలసాహిత్యం, (బుడుగు, విమానం కథ) సినీ సాహిత్యం. (విక్రమార్కుని మార్కు, సమీక్షలు, ఇతర దేశాల సినిమా కథలను తెలుగులో వివరించడం)అనువాదం (80రోజుల్లో భూప్రదక్షిణం), సంఘం మీద విసుర్లు (గిరీశం లెక్చర్లు) అప్పులు (ఋణానందలహరి) రకరకాల కథలు (ఇద్దరమ్మాయిలు ముగ్గురబ్బాయిలు, సాక్షి, సీతాకల్యాణం వగైరా) స్త్రీ సబ్జెక్టుపై వ్యాసాలు (కట్టూ - బొట్టూ) వగైరా, వీటన్నిటితో బాటూ 'స్వరలహరి' పేర నౌషద్, శంకర్ జైకిషన్, మదన్‌మోహన్, సి.రామచంద్రలపై నాలుగు వ్యాసాలు రాసారు. 1990లో రమణ సమీక్షలు, బాపూ కార్టూన్‌లతో వెలువరించిన 'బాపూ రమణీయం'లో తక్కినవారిని వదిలేసినా నౌషద్‌పై వ్యాసానికి మాత్రం చోటు ఇచ్చారు. ఆయనపై బాపూ రమణల అభిమానం అటువంటిది.

అటువంటి నౌషద్ అభిమానులకు ఈ అక్టోబరు 14న శుభదినం. బొంబాయిలోని షణ్ముఖానంద హాలులో నౌషద్ అభిమానులు ఆయనను సత్కరించారు - 60 సంవత్సరాలుగా ఆయన భారతీయ సినిమా రంగానికి అందించిన సేవలకై!; ఈ డైమండ్ జూబిలీ ఫంక్షన్ పేరు 'జష్న్-ఎ-నౌషద్'. నౌషద్, ఇతరులు రాసిన గజల్స్‌ను అనూప్ జలోటా, భూపేందర్ దంపతులు ఇతరులు పాడారు. ఉత్తమ్‌సింగ్ సంగీత దర్శకత్వంలో అమీన్ సయానీ, హసన్ కమాల్ కంపియర్ చేసారు.

ఆ రోజు నౌషద్ పై అనేకమంది ప్రశంసల జల్లు కురిపించినా, అవేవీ రమణ 1960లో రాసిన వ్యాసానికి సాటిరావని ధైర్యంగా చెప్పవచ్చు. ఆ వ్యాసంలో కొన్ని భాగాలు:

"నౌషద్ చేసిన పాట, అచ్చు నౌషద్ చేసిన పాటలాగే నిండుగా, తీవిగా లోతుగా ఉంటుంది. అందులో మధుర శిల్పాల నైపుణ్యం, నైగనిగ్యం ఉంటాయి. మహాకవి వాక్యంలా అర్థపుష్టి ఉంటుంది. ప్రబంధ నాయిక అంగసౌష్టవం ఉంటుంది. త్రికాలాలలో, త్రిలోకాలలో విహరించి వచ్చే ఖాన్‌సాహెబ్ కంఠస్వర విన్యాసాల తీవి, సొగసు, లతా స్పృశించగల స్వరదిగంతాల దూరం, సైగల్ పాట మార్దవం నౌషద్ సంగీత రచనా శిల్పంలో స్ఫురిస్తాయి.

ఈనాటి సంగీత రచనారీతులలో, స్వర కల్పనా శిల్పంలో వాద్య సమ్మేళనంలో, ప్రయోగంలో నౌషద్ చేసిన వాటిలో ఏదో ఒకటి ఎక్కడో అక్కడ కనబడితే కనబడవచ్చుగాని, ఆయన చేయనిది కనబడదు. ఒక చిత్రంలో అన్ని పాటలూ జనరంజకాలు కావటం ఆయనతోనే అరంభమైంది. ఫ్లూటు క్లారినెట్ కలిపి, సితార్ మాండలిన్‌లు కలిపి అందమైన బహువ్రీహి సమాసాలు సృష్టించినది ఆయనే. అకార్డియన్, వైబ్రాఫోన్ మొదలైన పాశ్చాత్య వాద్యాలను సినిమాలో ప్రవేశ పెట్టినవాడాయనే. సింఫనీ సంగీతాన్ని భారతీయ సంగీత భాషలోకి గొప్పగా, అందరికీ అర్థమై హాయి గొలిపేటంత నిండుగా అనువదించినవాడు ఆయనే. ఎప్పుడూ మార్పులు చేసేవాడు ఆయనే. శాస్త్రీయ రాగాలను కల్తీ లేకుండా శుద్ధ స్వరాలలోనే సులభశైలిలో వరసలు కట్టి మధుర స్వర సరోవరం నిర్మించినవాడు ఆయనే. అందులో ఇంగ్లీషు కెరటాలు లేపినవాడూ ఆయనే. ఇన్ని పనులు చేసిన నౌషద్ సీమ బాణీలను అనుసరించడంలో కూడా వెనకబడలేదు.

నౌషద్ పాటకు పదిహేనురోజులు తీసుకుంటాడు. అందుకే అందరూ సాలుకు పది చిత్రాలకు పని చేస్తే నౌషద్ ఒకటి రెండింటికి మాత్రం చేస్తాడు. అలా చప్పున పని చెయ్యడం చాలా తప్పు అనటం లేదు కాని, ఇలా స్థిమితంగా, ప్రతి స్వరాన్నీ ప్రతి స్వరం ముందూ వెనకా ఉంచి పరీక్షించి నిగ్గు తేల్చి, జాగ్రత్తగా కాశ్మీరీ శిల్పిలా నగీషీలు చెక్కడం ఒక ప్రత్యేకత. అందుకే ఉపమానాలు వెతికితేవడం కష్టమైన వాటిలో నౌషద్ పాట చేరుతుందనిపించుకుంది.

నౌషద్ సృజనాత్మక ప్రతిభ గల విద్వాంసుడు. కళ పరిణామ శీలమైనదని గుర్తించి, వ్యాపారపు వత్తిడిని బట్టి వ్యవహరించకుండా



నౌషద్

ఉండగల వివేకి. సంగీతం ఆయనకి సర్వమూ అని నమ్మి అందులోంచి తీసి ఇవ్వదగ్గ సర్వస్వాన్నీ తీసుకోడానికి నిరంతరం కృషిచేసే కళారాధకుడు. ఈ ప్రయత్నంలో ఆయన భారతీయ చలనచిత్ర సంగీతాన్ని ఎన్నో కొత్త మార్గాలలో నడిపారు. ఎన్నో వరవడులు పెట్టారు. అందుచేతనే ఆధునిక చలనచిత్ర సంగీత చరిత్రలో ప్రతి అధ్యాయానికి మొదటి వాక్యంలో నౌషద్ పేరు కనబడుతుంది.'

**నౌషద్ తొలి దినాలపై రమణ రాసిన ఈ వ్యాసాన్ని రమణ, నౌషద్‌ల అభిమాని ఒకరు ఆంగ్లంలోకి అనువదించి నౌషద్‌కు పంపారు. దానికి నౌషద్ ఇచ్చిన జవాబు చూడండి. 70 ఏళ్ల వయసులో కూడా ఆయన తీసుకున్న శ్రద్ధ గమనించండి. ఆ వ్యాసం ఎక్కడా ప్రచురించబడదని తెలిసి కూడా (1960లో రాసిన వ్యాసం అనువాదాన్ని 1990లలో ప్రచురిస్తే అప్‌టుడేట్‌గా, సమగ్రంగా ఉండదు కదా) దాన్ని ఆయన ఆమూలాగ్రం చదివి స్పెల్లింగు తప్పులు కూడా సవరించారు. అందుకే ఆయనను పెర్‌ఫెక్షనిస్ట్ అన్నారు!**

ఆ వ్యాసాన్ని ఇంత సాధికారికంగా ఎలా


NAUSHAD

...with the English translation ... It is very well written ... appreciated his deep study ... critical analysis of my work. There are few ... here and there, which I do hope ...

For Example: page No1, para forth ... and vibraphone (not Bean) ... Khemchand Prakash ... Hussain not Ghulam Hyder

... Suraiya's "Socha tha Kya" ... [spelling mistake]

... [spelling mistake]

... for notation ... in the last line of the same para

... "Dhadi ... was sung by

... was initially planned to be ... Khan Sahab.

With best wishes.

Yours kindly,
Naushad Ali.

...

"మీ ఉత్తరం, శ్రీ ఎం.వి.రమణ గారి వ్యాసం ఆంగ్లానువాదం చేరాయి. చాలా చక్కగా రాశారు. నా కృతిపై ఆయన జరిపిన లోతైన అధ్యయనం, విమర్శనాత్మక విశ్లేషణ నాకెంతో నచ్చాయి. కొన్ని చిన్న పొరపాట్లు కనబడ్డాయి. అవి సవరిస్తారని ఆశిస్తాను.

.... పేజీ నెం.2 - ఆరవ పేరా: సురైయ్యా సోచాథాక్యా (అన్‌మోల్‌ఘడీ) (స్పెల్లింగ్ మిస్టేక్)

...

యువర్స్ ట్రూలీ

నౌషద్ అలీ

రాయగలిగారన్న ప్రశ్నకు సమాధానంగా రమణ - 'బాపూ వద్ద నున్న హిందుస్తానీ రికార్డుల కలక్షన్‌పైనా మిత్రుడు వివికె రంగారావు సహాయ సహకారాలపైనా ఆధారపడ్డానని, అన్నారు. నౌషద్ అంటే బాపుకు తనకు వ్యక్తిగతంగా ఎంతో గౌరవమని, బొంబాయి వెళ్ళినప్పుడు ఆయనను కలిశామని అన్నారు. మరి బాపూ దర్శకత్వం వహించిన హిందీ సినిమాలకు ఆయనను ఉపయోగించు కోలేదేమంటే వీలుపడ లేదన్నారు.



మీ పద సంపద

## ఇది యస్పీ బాలసుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

1. చెరలాడి (పాతాళభైరవి.... తీయని ఊహలు హాయిని గొలిపే-)
   (ఎ) దగ్గరయి (బి) ఖైదుకాబడి (సి) ఆటలాడి (డి) ఎక్కువయి
2. మోసులు వేసి (పాతాళభైరవి ... కలవరమాయేమదిలో)
   (ఎ) కదిలించి (బి) రగిలి (సి) కబుర్లు చెప్పి (డి) మొలకలెత్తి
3. మలయానిలము (పాతాళభైరవి... ఎంతఘాటు ప్రేమయో)
   (ఎ) పున్నమినాటి గాలి (బి) వేడెక్కించే గాలి (సి) చల్లబరిచే గాలి (డి) దక్షిణపు గాలి
4. వగలు (పాతాళభైరవి.... వగలోయ్ వగలు)
   (ఎ) విలాసము (బి) మెరుపులు (సి) నృత్యాలు (డి) ఆభరణాలు
5. వేమరు (పాతాళభైరవి... ప్రేమకోసమై వలలో పడెనే)
   (ఎ) అశ్వినీ దేవతలు (బి) ప్రేమికులను కాపాడే దేవతలు (సి) పలుమారులు (డి) మరువలేని
6. చలము (బాలరాజు... ఓ బాలరాజా)
   (ఎ) కదలిక లేకపోవుట (బి)స్పందన లేకపోవుట (సి) పట్టుదల (డి) అలుక
7. కామిసిగ్గు (అక్కాచెల్లెలు .... పాండవులు పాండవులు తుమ్మెదా)
   (ఎ) సిగ్గు, (బి) అలవిమాలిన సిగ్గు (సి) పెళ్లివేళపడే సిగ్గు (డి) రతీదేవీలా పడే సిగ్గు
8. తనివి (చూడాలని వుంది... అబబ్బా ఇద్దూ)
   (ఎ) తృప్తి (బి) శరీరము (సి) కోరిక (డి) ఆకలి
9. జాలువారు (డాడీ... వాన వాన)
   (ఎ) జోలపాడు (బి) జాలిపడు (సి) ముంచెత్తే (డి) స్రవించే
10. గోధూళి ఎరుపంటి (ముత్యం .... క్రిష్ణశాస్త్రిలో)
   (ఎ) ఎర్రగోధుమల ఎరుపువంటి (బి) గోవులు ఇంటికి మరలే వేళ ఆకాశం లోని ఎరుపు లాంటి (సి) ఒక రకమైన వజ్రానికి ఉండే ఎరుపులాంటి (డి) ఆవుల కాలిగిట్టలు నుండి లేచే మట్టి రంగులాంటి

జవాబులు

1(c) 2(a) 3(d) 4(a)
5(c) 6(c) 7(d) 8(a)
9(d) 10(b)

మీ బాలు

# ఆడియో చాట్

సిహెచ్.జయరామ్,
టెక్కలి,శ్రీకాకుళంజిల్లా

'ఫలానా సినిమాని ఫలానా ఆడియో వాళ్లు కొన్నారు' అంటూ పత్రికల్లో చదువుతూ వుంటాం. ఆ ప్రాసెస్ ఎలా వుంటుంది.?



ఈ ప్రశ్నకు ఆదిత్య ఆడియోకు చెందిన శ్రీ దయానంద్ ఇలా సమాధాన మిచ్చారు.

ఫలానా సినిమా ఆడియో రైట్స్‌ని కొనాలకున్నప్పుడు ఆ పాటల్ని నేనూ, మా కంపెనీ అధినేత ఉమేష్‌గుప్తా గారు విని ఒక నిర్ణయానికి రావటం జరుగుతుంది. కొన్ని కొన్ని సినిమాలకి హీరో పేరు మీదగాని, మ్యూజిక్ డైరెక్టరు పేరు మీద గాని బిజినెస్ అవుతుందని నమ్మకం వున్నప్పుడు ముందుగానే రైట్స్‌ని కొనడం కూడా జరుగుతూ ఉంటుంది. దీనికి సంబంధించిన ఆసక్తికరమైన సంఘటన ఒకటి చెప్తాను వినండి. ఇటీవల 'ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం' ఆడియో రైట్స్ కొనడానికి ముందు ఆ పాటలను విన్నాం. బావున్నాయనిపించింది. కానీ ఆ పాటల్లోని మూమెంట్స్‌ని ఊహించుకుంటే అవన్నీ హీరో రవితేజ మీద ఎలా వర్కవుట్ అవుతాయి అని సందేహం కలిగింది. అదేమాట అన్నాం. వెంటనే అంతవరకు చిత్రీకరించిన పాటల్ని నిర్మాతలు ప్రొజెక్షన్ వేసిమాకుచూపించారు. రవితేజను చాలా కొత్తగా ప్రొజెక్ట్ చేశారనిపించింది. వెంటనే ఆడియో రైట్స్ ఫైనలైజ్ చేసేశాం. అలాగ కూడా జరుగుతూ వుంటుంది ఒక్కొక్కసారి.

కొనకళ్ళ సుశీల
విజయవాడ

ఇటీవల కొన్ని తెలుగు సినిమా ఆడియోలు టిప్స్ కంపెనీ వారు విడుదల చేసినట్టుగా వస్తున్నాయి. మీరు ఇదివరకు హిందీ సినిమాల ఆడియోలను రిలీజ్ చేసేవారు కదా.... తెలుగు సినిమాలను కొనేటప్పుడు మీరు గమనించే అంశాలేమిటి?



ఈ ప్రశ్నకు టిప్స్ కంపెనీ అధినేత శ్రీ జెజె అద్వానీ సమాధానం ఇలా వుంది.

ఆడియోలను కొనేటప్పుడు మేం ఫస్ట్ చూసేది మేకర్ని. నార్త్‌లో ప్రొడ్యూసర్‌ని మేకర్ అని అంటాం. ఈ క్యాలిక్యులేషన్స్‌తో మేం నార్త్‌లో కొన్ని సినిమాల ఆడియోలను ఇవాల్టికీ అమ్ముతూనే ఉన్నాం. ఉదాహరణకి 'ఫూల్ ఔర్ కాంటే' 1988లోనూ, 'ఖల్‌నాయక్' 1993లోనూ మీ వెంకటేష్ హీరోగా నటించిన 'అనాడీ' 1990లోనూ కొన్నాం. ఇవాల్టికి వాటి ఆడియో సేల్స్ చాలా బావుంటున్నాయి.

ఎం.ఎస్.రామకృష్ణ
(కార్టూనిస్ట్)కొత్తపేట

ప్రేమికుడు, జంటిల్మన్, రోజా, సఖి, ముత్తు, బాంబే, రక్షకుడు, మెరుపుకలలు, భారతీయుడు, ఒకే ఒక్కడు ఇలా ఇన్ని డబ్బింగ్ సినిమాల క్యాసెట్ల విడుదల చేస్తున్నారే... ఆ రోజుల్లో కూడా ఎన్నో డబ్బింగ్ సినిమాలు...... మంచిపాటలున్నవి.... విడుదలయ్యాయి కదా....వీటి గురించి పట్టించుకునే వారే లేరంటారా!?

ఈ ప్రశ్నకు హెచ్.ఎం.వి. సంస్థకు చెందిన శ్రీ శివప్రసాద్ సమాధానం ఇలా వుంది.



ఆరోజుల్లో హిట్ అయిన డబ్బింగ్ సినిమా 'ప్రేమలేఖలు' క్యాసెట్‌ను ఇటీవలే రిలీజ్ చేశాం. జింబో, మనోహర, ఎం.జి.ఆర్.భానుమతి నటించిన ఆలీబాబా 40 దొంగలు, మురిపించే మువ్వలు, కర్ణ, సింగపూర్ సి.ఐ.డి., అనగనగా ఒకరాజు హక్కులు మావద్దనే ఉన్నాయి. ఒకటి రెండు నెలలలోగానే జింబో, మనోహర క్యాసెట్లు విడుదల అవుతాయి. ఆడియో ప్రాసెసింగ్‌కి సంబంధించిన తక్కిన వర్క్ అంతా పూర్తి చేసుకున్న తర్వాత మిగిలినవి విడుదలవుతాయి.

ఎమ్.ఎస్. రామరాజు- చీఫ్ లైజన్ ఆఫీసర్
కేర్ హాస్పిటల్-హైదరాబాద్

ప్రముఖ గాయకుడు పి.బి.శ్రీనివాస్ నాకు మంచి స్నేహితుడు. అతను పాడిన పాటలంటే నాకు ఎంతో ఇష్టం. ఖైదీ కన్నయ్య సినిమాలో 'ఈ నిజం తెలుసుకో తెలివిగా మసలుకో' పాట ఎక్కడైనా క్యాసెట్‌లో దొరుకుతుందా.?

'సూపర్ హిట్ సాంగ్స్ ఆఫ్ 1962 ' అనే క్యాసెట్‌ను హెచ్.ఎం.వి.వారు ఈ మధ్యనే విడుదల చేశారు. అందులో మీరడిగిన పాట వుంది. అంతేకాదు విక్రమ్ ప్రొడక్షన్స్ వారి 'పెళ్ళితాంబూలం' సినిమాలో పి.బి.శ్రీనివాస్ పాడిన 'చక్కని ఓ జాబిల్లి పలుకవేలనే' అనే మంచి పాట కూడా ఆ క్యాసెట్‌లో వుంది.

# మేడ్ ఈచ్ ఫర్ అదర్

- రాజా

హాలో... ఎంత సేపయిందీవచ్చి?' తలెత్తి చూసింది శోభ. 'కూచోండి... చెప్తాను' అంది తాపీగా.

ఆమెకు కోపం వచ్చిందన్న సంగతి అర్థమైపోయింది శంకర్‌కి.

ఓ నాలుగు జోకులు పేల్చైనా సరే మూడ్‌లోకి తెచ్చేయ్యాలనుకుని కూర్చుంటూ..... అటూ ఇటూ చూశాడు. ఎక్కువ భాగం జంటలే. ఎవరి గొడవలో వాళ్ళున్నారు.

'చాలా సేపయిందనుకుంటానే...?' అన్నాడు ముఖానికి నవ్వు కోటింగ్ ఇచ్చేసి.

'సిగరెట్‌లు కాల్చే అలవాటు లేదు నాకు' అందామె.

అర్థం కాలేదతనికి. 'ఎందుకు?' అన్నాడు వెంటనే.

'కాల్చిపడేసిన సిగరెట్ పీకల బట్టి యింత టైమ్ అయి ఉంటుందని మీ అంతట మీరే లెక్కేసుకోవడానికి'.

'లాభం లేదు ఎలాగైనా సరే నవ్వించాలి.... తప్పదు.....' అనుకున్నాడతను.

'ఓహో హో... అర్థం అయింది.... అర్థం అయింది' అన్నాడు. కులాసా పోజిచ్చి.

'ఏవిటయ్యింది... అర్థం?'

'మీ ఆడవాళ్ళని బస్సు డ్రైవర్లుగా ఎందుకు అప్పాయింట్ చేసుకోరో అన్న విషయం ఇప్పుడు అర్థం అయింది.'

ఈసారి అర్థం కాకపోవటం, ఆశ్చర్యపోవడం ఆమె వంతయింది. 'ఎందుకు?' అంది ఉండబట్టలేక.

'ఎప్పుడు ఏ రూట్లో వస్తారో ఊహించడం ఎవరివల్లా కాదు కనుక' అన్నాడు చిలిపిగా చూస్తూ.

'వెల్లకిలా పడితే ఆకాశంతో ఫైట్ చేసన్తున్నావని, బోర్లా పడితే బస్కీలు తీసన్తున్నానని చెప్పుకుంటూ లెవెల్ మెయిన్‌టెయిన్ చెయ్యడంలో మగవాళ్ళని మించిన వాళ్ళు లేరనుకుంటా' అందామె ఉక్రోషంగా.

'కరెక్టే.... అటువంటి సన్నివేశాల్లో అలాంటి డైలాగులు ఆడవాళ్ళు చెబితే బావుండదు కదా...... అంచేత 'ఏదో పోన్లే అని ఆ అవకాశాన్ని మగవాళ్ళే తీసేసుకుంటూ ఉంటారు పాపం...... అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తే బోల్డంత రెస్పెక్ట్ పెరిగే ఛాన్సుంటుంది. మగాళ్ళ మీద' అన్నాడతను స్టయిల్‌గా.

ఇంకేం మాట్లాడలేదామె. కోపంగా పక్కనే ఉన్న గడ్డిని తుంచడం ప్రారంభించింది. ఓ రెండు క్షణాలు మౌనంగా దొర్లి పోయాయి. గడ్డి పీకటం మీద ఓ జోక్ వేస్తే ఎలా ఉంటుందనిపించిందతనికి. మళ్ళీ అదెంత గ్యాప్‌ని సృష్టిస్తుందోనని వెంటనే విరమించుకొన్నాడా ప్రయత్నాన్ని - మరో రెండు క్షణాలు....

'ఓకే మేడమ్ ఒప్పేసుకుంటున్నా..... నేను లేటుగా వచ్చాను... మామూలు లేటుకాదు. ఘోరాతి ఘోరమైన లేటు.... భయంకరమైన లేటు.... ఓకేనా!?' అన్నాడింక ఉండబట్టలేక'!

'ఆ మాటేదో రాగానే అనొచ్చుగా....!?'

'సారీ అన్నానుగా' అన్నాడతను ప్రేమ్‌నగర్‌లో నాగేశ్వరరావులా.

'సారీ ఎక్కడున్నారు... ఓకే అన్నారు.'

'హోరి దేవుడోయ్...! వర్తమానే ప్రేయసీ.... భవిష్యమానే భార్యామణీ.. సారీ సారీ సారీ.... ఇద్దరం దొందుకు దొందే... ఇప్పటికైనా మనం మన ఇగోలకి కాస్త గ్యాపిస్తే, కొంచెం మనసులు విప్పి మాట్లాడుకోవడానికి, మరి కొంచెం ప్రేమించుకోవడానికి వీలవుతుంది. ఆ పైన నీ యిష్టం.'

'సరే.... చెప్పండి... ఏమిటి కబుర్లు...?

'కబుర్లా... వాటర్ టాంకు వచ్చిన హడావుడిలో వాకిట్లో వున్న మంచినీళ్ళ కుండ తన్నేసుకున్నాడని...' నీ దెబ్బకి మైండ్‌లో వున్నవన్నీ మటాష్ అయిపోయాయి.... కాసేపు నీతో మాటాడితే కాని తిరిగి సెట్‌కాదు.'

'సరే అంత అప్‌సెట్ కాకండి... నేనొక విషయం మీకు చెప్పాలని ఎన్నాళ్ళ నుంచో అనుకుంటున్నాను. కూల్‌గా విని అర్థం చేసుకుంటానంటే ఇప్పుడే చెప్తాను లేదా ఎప్పుడైనా సమయం వచ్చినప్పుడు చెప్తాను.'

'ఏం పర్లేదు ఇప్పుడే చెప్పెయ్... నీదెబ్బకి ఇంక కూలే... ఇప్పట్లో రెయిజ్ అయ్యే సమస్యే లేదు.'

'అబ్బ.... సీరియస్‌గా వినండి...' అందామె గోముగా!

'సర్లే వింటా చెప్పు' అన్నాడతను కామ్‌గా!

'నాకు చిన్నప్పుడే పెళ్ళయి పోయింది.'

'జోకా...!?'

'కాదండీ... ఫాక్టే... నాకు ఊహ తెలియని రోజుల్లో .....'

'పిచ్చిదానా... నీకే కాదు నాక్కూడా ఊహ తెలియదు తెలుసా?'

'అదేంటీ?'

'అవును శోభా...! సినిమా యాక్టర్ శ్రీకాంత్ వైఫ్.... అదే... ఆమె సినిమా హీరోయిన్... ఊహ.... ఆవిడ నాకు తెలియదని చెబుతున్నానంతే...'

'ప్లీజండీ.... సీరీయస్‌గా వినండి... నేను నెలల పిల్లగా ఉన్నప్పుడు.. మా పెద్దవాళ్ళు ఏవో సెంటిమెంట్లు అనీ పెట్టుకొని. నాకు పెళ్ళి చేసేసేరట... కానీ వారం రోజుల్లోనే అది పెటాకులై పోయిందట. పెద్దవాళ్ళ మధ్య ఆస్తి తగాదాలొచ్చాయిట. అంతే... విడిపోయారు. ఇప్పటిదాకా ముఖాలు కూడా చూసుకోలేదు. అసలు వాళ్ళు ఇప్పుడు ఎక్కడ ఉన్నారో ఏమిటో ఏవీ తెలీదు.'

'.....'

'నేను చెప్పిందంతా అబద్ధంలా ఉంది కదూ... నా గురించి మీరు చాలా ఊహించుకుంటున్నారు కదూ...?' అంది ఆదుర్దాగా.

'అక్కడే పొరబడ్డావు. ఇది ముందే చెప్పి నాకన్నా ఒక మెట్టు ఎదిగిపోయావు. ఇందాక

వాటర్ టాంక్ ఎగ్జాంపుల్ ఇచ్చాను గుర్తుందా. మైండ్‌లో విషయాలు అప్పుడే మటాష్ కాకుండా ఉంటే ఇలాంటి విషయమే నీకు నేను చెప్పి నేనే ఓ మెట్టు పైనుండే వాణ్ణి.'

'అర్థం కాలేదు' అందామె సీరియస్‌గా.

'నీకు జరిగిన ఇన్సిడెంట్‌లాటిది చిన్నప్పుడు నాలైఫ్‌లో జరిగింది' అన్నాడతను రిలాక్స్‌డ్‌గా.

'అంటే.... మీక్కూడా....'

'య్యస్.... పెళ్ళయింది. కానీ ఫెయిలయింది. నువ్వు చెప్పిన ప్రతి సంఘటనా నా లైఫ్‌లో కూడా సేమ్ టు సేమ్ అనుకుంటూంటే నాకే ఆశ్చర్యంగా ఉంది.'

'ఇలా ఎందుకు జరిగిందంటారు?' అడిగిందామె నమ్మలేనంత ఆనందాశ్చర్యాలతో.

'డీప్‌గా ఆలోచిస్తే.... మనం ఒకరి కోసం ఒకరు పుట్టబట్టే ఇలా జరిగింది. లేకపోతే ఇంత కోయిన్సిడెన్స్ అసంభవం.'

'అవునండీ..... రియల్లీ వి ఆర్ మేడ్ ఫర్ ఈచ్ అదర్... మరి ఈ సంగతి మన పెద్దవాళ్ళకి చెప్పేద్దామా....'

'ఖచ్చితంగా చెప్పితీరాలి, యాజిటీజ్‌గానే లేట్ చేశాం. ఈ విషయం తెలిశాక ఇంక ఊరుకోకూడదు. నేనివాళ రాత్రే బయల్దేరి మావూరు చేరి మావాళ్ళకి చెప్పి యస్సనిపించుకొని రేపు రాత్రి బయల్దేరి ఎల్లుండికల్లా అక్కడుంటాను. ఎల్లుండి ఈవినింగ్ ఇక్కడే కలుద్దాం. నీకన్న ముందే వస్తాను కూడా.... ఓకేనా?' అన్నాడతను ఆనందంగా.

'ఓకే అనకుండా ఎలా ఉండగలను? ఎల్లుండి మీరెంత లేటుగా వచ్చినా సరే అసలు పోట్లాట పెట్టుకోను.' అందామె సంతోషంగా.

***

అలా వారిద్దరి మధ్యా ముగిసిన ఆ సీన్ తిరిగి ఇలా ఓపెన్ అయింది.

'వచ్చేరా... రండి' అందామె వ్యంగ్యంగా.

'రాక ఛస్తానా'

అన్నాడతను కోపంగా.

'ఏం జరిగిందో సెలవివ్వండి' అందామె మరింత ఘాటుగా, వెటకారంగా.



'చెప్తా... అందుకేగా వచ్చాను. నీ గురించి చెప్పి, మీ ఫ్యామిలీతో నువ్వు తీయించుకున్న ఫోటో చూపించగానే, వెంటనే గుర్తుపట్టి చెప్పారు. మావాళ్ళు-చిన్నప్పుడు నాకు పెళ్ళయింది నీతోనేనని. ఏం.... ఆశ్చర్యంగా ఉందా!?' అన్నాడతను కటువుగా.

'లేదు... ' అందామె ధీమాగా.

'ఎందుకని? '

'అదే సీన్ మాయింట్లో కూడా రిపీటయింది కాబట్టి'

'ఓహో....! సో... నేను ఆనందంతో పరిగెట్టుకుంటూ వచ్చి నిన్ను ఎత్తుకొని గిరగిరా తిప్పేస్తానని ఎక్స్‌పెక్ట్ చేశావు కదూ...!?'

'ఇది సినిమా కాదు.'

'ఆ సంగతి నాకూ తెలుసు.... ఎక్స్‌పెక్ట్ చేశావా లేదా.... దానికి ఆన్సరివ్వు ముందు...'

'ఏంటా దబాయింపు..!? అయినా ఆన్సరివ్వకుండా తప్పించుకునేంత పిరికిదాన్ని కాదు కాబట్టి చెబుతున్నాను. ఎక్స్‌పెక్ట్ చెయ్యలేదు. ఒకవేళ మీరెక్స్‌పెక్ట్ చేసివుంటే అది మీ వల్ల కాదు కూడా.'

'ఏం... చ్యవనప్రాశ తిని నువ్వుకూడా బలిశావా!?'

'ఆపండి... మీ కుళ్ళు జోకులకి పడిపడి నవ్వటానికి సిద్ధంగా లేను నేను. అంతటైమ్ కూడాలేదు నాకు. అసలు నేనలా ఎక్స్‌పెక్ట్ చేస్తానని మీరెలా ఎక్స్‌పెక్ట్ చేశారో చెప్పండి ముందు.'

'నువ్వడక్కపోయినా ఈ విషయం చెప్పటానికే నేనొచ్చాను. నిన్ను చూశాక లేడీస్

ఎన్ట్ అనే మర్యాద కూడా ఇవ్వాలని పించటంలేదు. అందుకే నేనే ముందు చెప్తున్నాను విను. తాళికట్టిన మొగుడు ఎవడో ఎక్కడుంటాడో, వాడి సంగతీ సమాచారం ఏమిటో కనుక్కోక్కర్లేదా... భారత స్త్రీకి మాంగల్యం ముఖ్యం కాదా? ఆ వ్యవహారం ఏదో ఫైనల్ చేసుకున్నాకే మొదలు పెట్టలేకపోయావా నీ ప్రేమాయణం.

నేనేదో - నీతి నిజాయితీ, పవిత్ర ప్రేమలాంటి వాటిమీద నమ్మకం వున్న సెంటిమెంటల్ ఫూల్ని కాబట్టి సరిపోయింది. అదే నేను కాకపోయి ఉండివుంటే నువ్వు ఈపాటికి ఎవడతోనో నీ ప్రేమాయణం మొదలు పెట్టేదానివే కదా!? కట్టుకున్న మొగుడు ఇంకే ఆడదానితో కులుకుతున్నాడంటే ఏ ఆడదైనా ఎలా సహించలేదో, కట్టుకున్న పెళ్ళాం ఇంకొకణ్ణి ప్రేమిస్తోందంటే ఏ మగవెధవా సహించలేడు కూడా. అదృష్టమో దురదృష్టమో ఆరెండూ నేనే కాబట్టి సరిపోయింది లేకపోతే వ్యవహారం ఎక్కడిదాకా వెళ్ళుండేది...!? నో.... నీ మీద నాకు నమ్మకం పూర్తిగా పోయింది... ఐ కాంట్ మ్యారీ యూ.... దట్సాల్.'

'వన్ మినిట్... వన్ మినిట్ ... ఈ డెసిషన్‌కి మీరు నిన్న వచ్చుంటారు. ఎందుకంటే మీకు తెలిసింది నిన్న కాబట్టి. కానీ నేను నా డెసిషన్‌కి మొన్నరాత్రే వచ్చాను. అంచేత-మీరు ఆనందంతో పరిగెట్టుకుంటూ వచ్చి నన్ను ఎత్తుకుతిప్పుతానన్నా నేనందుకు సిద్దంగా లేను కాబట్టి మీవల్ల కాదన్నాను.

మగాళ్ళయి, మీసాలొచ్చి, ఉద్యోగం చేసుకుంటూ, మీ కాళ్ళమీద మీరు నిలబడి కూడా తాళికట్టిన భార్య ఎక్కడుందో తెలుసుకోలేక పోయారంటే మీ గురించి నేనేమనుకోవాలి!? కనీసం ఆ ఇంట్రస్టయినా చూపించలేదంటే ఎలా అంచనా వెయ్యాలి మిమ్మల్ని...!? మీరు పెళ్ళాడింది, తర్వాత ప్రేమించింది నన్నే కాబట్టి సరిపోయింది. అదే నేను కాకపోయి ఉంటే...!?

నేను కాబట్టి ఇన్నాళ్ళు మిమ్మల్ని కంట్రోల్‌లో పెట్టాను. అదే నేను కాకపోతే ఎంతకైనా వెళ్ళేవారని నేను అనుకుంటే తప్పేంటి? అందుకే మీరంటే నాకు గౌరవం చచ్చిపోయింది. చావనైనా ఛస్తాను గాని మిమ్మల్ని పెళ్ళి చేసుకునే ఆలోచన రావడం లేదు నాకు. ఇన్నాళ్ళూ మిమ్మల్ని ప్రేమించినందుకు సిగ్గుపడుతున్నాను కూడా!

రేపు నేను ఇంకెవర్నైనా పెళ్ళి చేసుకుంటే ఆ పెళ్ళికి శాలువా కప్పుకొని దగ్గుతూ వచ్చినా, పెళ్ళి టైమ్‌కి విషం మింగేసి సూపర్‌హిట్ సాంగెత్తుకున్నా సరే - నేను రాను గాక రాను... రాను రాను రాను. గుడ్‌బై.... సారీ బ్యాడ్ బై బై.'

*

# మేకులు-మిస్టేకులు


'దాగుడు మూతలు' లో ఎన్టీఆర్, బి.సరోజాదేవి

* అక్కినేని నాగేశ్వరరావు ద్విపాత్రాభినయంతో వచ్చిన బాపు - రమణల 'బుద్ధిమంతుడు' సినిమా గుర్తుండే వుంటుంది. ఆ సినిమాలో హాస్యజంట అల్లురామలింగయ్యకి, మీనా కుమారికి ఓ డ్యూయెట్ వుంది. రచన: కొసరాజు, సంగీతం: కె.వి.మహదేవన్, పాడినది: పిఠాపురం నాగేశ్వరరావు, స్వర్ణలత. సినిమాలో ఆ పాట 'అల్లరి పెడతారే పిల్లలు అల్లరి పెడతారే' అనే పల్లవితో మనకు వినిపిస్తుంది. ఆ పల్లవికి జవాబుగా 'పుట్టకపోతారా పిల్లలు పుట్టకపోతారా' అని తర్వాత వినిపిస్తుంది. నిజానికి 'అల్లరి పెడతారే' అని అంటే 'పిల్లలు అల్లరి చెయ్యకపోతే పెద్దవాళ్లు చేస్తారా' అని దానికి జవాబుగా ఉంటే బావుంటుంది. గానీ జవాబే 'పుట్టకపోతారా పిల్లలు పుట్టకపోతారా' అని ఉంది కనుక పల్లవి ఇంకేదైనా ఉండి ఉంటుందేమోనని కాస్త ఆలోచిస్తే ఎవరికైనా అనిపిస్తుంది. నిజమే... మొదట ఉన్న పల్లవి 'ఎట్లాపుడతారే పిల్లలు ఎట్లాపుడతారే' ఈ ప్రకారం జవాబుని పోల్చుకుంటూ పాట సాహిత్యాన్ని చూస్తే మొత్తం అర్థం సరిపోతుంది. కానీ సెన్సార్ వారి కత్తెర పడిందో లేక చిత్రీకరణ కూడా అయిపోయిన తర్వాత నిర్మాణ బృందానికే అనిపించిందో ఏమో గానీ పల్లవి 'అల్లరి పెడతారే'గా మారింది. కావాలంటే ఆ సినిమా టీవీలో వచ్చినప్పుడు గానీ, మీ ఊళ్ళో మళ్ళీ రిలీజయినప్పుడు గాని చూడండి. మిగిలిన పాట ఉన్న రికార్డింగ్ లెవెల్‌కి, మార్చిన ఈ పల్లవి అయిన 'అల్లరి పెడతారే' వచ్చినప్పుడు వినిపించే రికార్డింగ్ లెవెల్‌కీ తేడా ఉంటుంది. ముఖ్యంగా అల్లు రామలింగయ్య తులసికోట చుట్టూ తిరుగుతూ ఈ పల్లవిని అభినయించినప్పుడు రికార్డింగ్ లెవెల్‌లోని ఆ తేడా సుస్పష్టంగా తెలుస్తుంది.


'రాముడు-భీముడు' లో ఎన్టీఆర్, ఎల్.విజయలక్ష్మి

* అలాగే ఎన్.టి.ఆర్. ద్విపాత్రాభినయంతో వచ్చిన 'రాముడు-భీముడు' సినిమాలోని హోయ్, తళుకు తళుకుమని గలగల సాగే తరుణీ ఇటురావే' పాటకు కూడా ఓ కథ ఉంది. ఈ పాటకు పెండ్యాల సంగీతం. ఘంటసాల, సుశీల పాడేరు. సి.నారాయణరెడ్డి రాశారు. ఎన్.టి.ఆర్., ఎల్.విజయలక్ష్మి అభినయించారు. అనుపల్లవిగా వచ్చే 'రమ్మనకు పగలే నను రా రమ్మనకు' అనే వాక్యానికి సెన్సారు వారు అభ్యంతరం తెలిపారు. 'పగలు రమ్మనకు అంటే రాత్రి రమ్మనవచ్చని అర్థమా!? పెళ్ళికాని వారి మధ్య ఉండే డ్యూయెట్ అలా ధ్వనించవచ్చా!? అని వివాదం లేవనెత్తారు. చివరికి 'రమ్మనకు ఇపుడే నను రా రమ్మనకు' అని మార్చాల్సి వచ్చింది. (దీనికి అర్థం ఎలా ధ్వనిస్తుందన్నది వేరే సంగతి) కావాలంటే ఆ సినిమా చూడడం తటస్థపడితే బాగా గమనించండి అక్కడ ఎల్.విజయలక్ష్మి ఇచ్చే లిప్ మూమెంట్ అంతగా సింక్ అవదు.

* మరొక సంఘటన డి.బి.యస్. వారి 'దాగుడు మూతలు' సినిమాలో.... 'అడగక ఇచ్చిన మనసే ముద్దు' పాటలో జరిగింది. పాట రచన: ఆత్రేయ సంగీతం: కె.వి.మహదేవన్, పాడింది: ఘంటసాల, సుశీల. అభినయించింది: ఎన్.టి.ఆర్, బి.సరోజాదేవి. ఆ పాట చివర్లో 'చెట్టు చేమ జగతికి ముద్దు నువ్వు నేను ముద్దుకి ముద్దు' అని వుంటుంది. కానీ సినిమాలో 'చెట్టు చేమా జగతికి ముద్దు' తర్వాత 'నువ్వు నేను ఊహు హు ఊహు' అని వినిపిస్తుంది. తెరపైన బి.సరోజాదేవి ఇచ్చిన లిప్ మూమెంట్ ఈ 'ఊహు హు ఊహు' తగ్గట్టుగా ఉండదు. 'ముద్దుకి ముద్దు' అనే వాక్యానికి తగ్గట్టుగా ఉంటుంది. పైగా ఈ 'ముద్దుకి ముద్దు'లో రెండు 'మ'లు ఉన్నాయి. కదా అందుకని లిప్ మూమెంట్‌లో పెదవుల కలయిక శుభ్రంగా తెలిసిపోతుంది. *




నండూరి పార్థసారథి గారి పేరు చెప్పగానే వెంటనే గుర్తుకు వచ్చేది "సాహిత్య హింసావలోకనం". తట్టలు తట్టలుగా సాహిత్యాన్ని తయారు చేసి పారేసే వాళ్లను, ప్రయోగాల పేరిట సాహిత్యాన్ని ఖూనీ చేసేవాళ్లను భూతద్దం కింద పెట్టి చూసి కాల్చి పారేసిన (ఆ నవల ముఖచిత్రం అదే మరి!) రచన అది. అద్వితీయమైన వ్యంగ్యం నం॥పా॥సా॥ సొత్తని నిరూపించిన నవల అది.



# రాంబాబు డైరీ

పాత్రికేయులపై అటువంటి వ్యంగ్య రచన - రాంబాబు డైరీ. 1962లో మొదలైన ఈ రచన అలా సాగుతూనే వచ్చింది. కానీ రాంబాబు చిరంజీవి అలాగే ఉండిపోయాడు. ఎప్పటికప్పుడు ఎదురయ్యే సంఘటనలపై తన వ్యాఖ్యలను వినిపిస్తూనే ఉన్నాడు. రాంబాబు ఒట్టి పాత్రికేయుడే కాదు. కాలేజీ కుర్రాడు. లవర్, కళాభిమాని. లోకాన్ని అవలోకించే గొప్ప తాత్త్వికుడు కూడా. పార్థసారథి గారు చెప్పినట్టు మనందరిలోనూ రాంబాబు ఉన్నాడు. వేరు వేరు డిగ్రీలలో - అందుకే అతడు మనందరికీ ఆత్మీయుడయ్యాడు. నాలుగు దశాబ్దాలుగా వివిధ పత్రికలలో వచ్చిన రచనలు ఇప్పుడు పుస్తక రూపంలో వచ్చాయి- హాస్యప్రియుల నందరినీ అలరించడానికి.

అమాయకుడి గురించి, అజ్ఞాని గురించి ఇంకోళ్లు రాయడం సులభం. కానీ అతడే ఫస్ట్ పర్సన్‌లో చెప్పుకువచ్చినట్టు రాయడం చాలా కష్టం. రాంబాబు కథను డైరీ రూపంలో రాసి నం॥పా॥సా॥ గారు ఆ ప్రయోగమే చేసారు. రక్తి కట్టించారు. పాఠకుడి స్థాయి రాంబాబు స్థాయి కంటె ఎక్కువగా ఉంటుందని ఊహించి రాయక పోతే ఈ డైరీ రచించడానికి సాహసించలేడు రచయిత. ఈనాటి పాఠకుల తీరికను, ఓపికను దృష్టిలో పెట్టుకుని పార్థసారథి గారు చేసిన ప్రయోగాలను వర్గీకరించి చూపడం జరుగుతోంది. దీని వల్ల పాఠకులు పుస్తకాన్ని ఆస్వాదించగలిగేందుకు ఇబ్బంది పడరని మా నమ్మకం.

రాంబాబు ఓ కాలేజీ కుర్రవాడు. వయస్సు ఇరవై. మేనమామ కూతురు వరలక్ష్మి అంటే ఇష్టం. పెళ్లాడదామని కోరిక. సుజనమిత్ర అనే లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డెయిలీ ఫ్రమ్ చింతల్‌బస్తీ (సర్క్యులేషన్ 2 వేల కాపీలు)లో పార్ట్‌టైమ్ ఉద్యోగం, జర్నలిస్టుగా. అతను చేరేక పత్రిక సర్క్యులేషన్ 22 కాపీలు పెరిగింది కూడా. అయినా ఎడిటరు గారికి అతనంటే చిన్నచూపే. దానికి కొంత కారణం రాంబాబు డబాయింపే. తెలియనది తెలియదని ఒప్పుకోకపోవడమే. 1959 నుండి 37 సంవత్సరాలు పాత్రికేయుడిగా ఉన్న పార్థసారథి గారికి వృత్తిజీవితంలో ఎదురయిన అనేక సంఘటనలతోనే ఈ డైరీ రూపొందింది అన్నది సులభంగా ఊహించవచ్చు.

ఈ రాంబాబు డైరీ (మొదటి భాగం) వెల 100-00. ప్రాప్తిస్థానం - నండూరి పబ్లికేషన్స్, ఎ-21, జర్నలిస్టు కాలనీ, జూబ్లీహిల్స్, హైదరాబాదు 500 033. ఫోన్: 040-3548352, email: nampaasaa@rediffmail.com ఈ పుస్తకం చదవకపోతే ఈ రకమైన హాస్యాన్ని మీరు మిస్ అయినట్లే. అందువల్ల దానిలో దొరికే అనేక ఆణిముత్యాలలో కొన్ని:

**రాంబాబు పరిశీలనలు:**

" మోటారు సైకిలుకి ఒట్టి సైకిలుకి తేడా - మోటారు సైకిల్ తొక్కి ఎక్కవలెను. ఒట్టి సైకిలు ఎక్కి తొక్కవలెను.

" ఈ మధ్య మగవాళ్లకంటె ఆడవాళ్లకి పెళ్లిళ్లు ఎక్కువగా అవుతున్నట్టున్నాయి. క్రమంగా ఆడవాళ్ల జనాభా పెరగడమే ఇందుకు కారణం అయుంటుంది.

" లెక్క ఎలా చేసినా ఆన్సరు రాలేదు. ఆఖరికి పుస్తకం చివరిలో ఉన్న ఆన్సరు చూసి చేస్తే చచ్చినట్టు వచ్చింది. అట్నించి నరక్కురావడంఅంటారు దీన్నే.

" క్షవరం చేయించుకుంటే కనీసం వారం రోజుల వరకు అమ్మాయి లెవరూ ప్రేమించరు.

" దున్నేవాడిదే భూమి అన్నట్టుగా ఉతికే వాడిదే బట్ట, గొరిగే వాడిదే తల అంటారన్న భయంతోనే గాంధీగారు దూరదృష్టితో తన బట్టలు తానే ఉతుక్కునే వారు. తన క్షవరం తానే చేసుకునేవారు.

**రాంబాబు ఆశయాలు:**

" శ్రీనాథుడు, పోతనాదుల కోవలో ప్రౌఢకవిని కావాలని కంకణం కట్టుకున్నాను.

" ఫిలిం సొసైటీలో చేరిపోయి, తర్వాత ఏ డైరెక్టరు దగ్గరో అసిస్టెంటుగా చేరిపోయి, తర్వాత నేనే ఒక ఎక్స్‌పెరిమెంటల్ ఆర్ట్ ఫిలిం తీస్తా.

" సితారు కచేరికి వెళ్లాను. బియ్యే కాగానే సితార్ నేర్చుకుని అమెరికా వాళ్లని వుర్రూత లూగించేయాలని తీర్మానించుకున్నాను.

" క్రికెట్ ఆట చూడడానికి వెళ్లాను. క్రికెట్ నేర్చుకుని ఎప్పటికైనా పటౌడీని ఓడించాలని ప్రతిజ్ఞ పట్టాను.

¨ జైలు కెళ్లి అక్కడనుండే భారత స్వాతంత్రోద్యమ చరిత్రను మా ఫ్రెండుకి లేఖల రూపంలో వెయ్యి పేజీల ఉద్గ్రంథంగా రాయాలి. (అసలు మనకు జైలులో 'ఎ' క్లాసు ఇస్తారో లేదో కనుక్కోవాలి. అది ఇవ్వకపోతే దండగ. జైల్లో టైము వేస్టు).

¨ కర్ణుడికి, నెపోలియన్‌కి పోలికలున్నట్టు తోచింది. పరీక్షల్లో రాయాలి. పరీక్షలు కాగానే ప్రాచీన భారతీయ సంస్కృతీ పునరుద్ధరణకు కంకణం కట్టుకోవాలి.

¨ నా మేధస్సు ఎప్పుడూ భవిష్యత్తు లోకి పాతిక సంవత్సరాలు లోతుగా చొచ్చుకుని పోతూ ఉంటుంది. నాలాటి వాళ్లు వర్తమానంలో అపార్థాలకు గురవుతారు. అర్కిమెడీస్ పైథాగరస్ సిద్ధాంతాన్ని కనిపెట్టినప్పుడూ ఇలాగే వెక్కిరించారు.

¨ పొద్దున్న తలంటి పోసుకుని తల తడుచుకుని, దువ్వుకోకుండా అలాగే అద్దంలో చూసుకుంటే మొహంలో కొంచెంగా ఐన్‌స్టీన్ పోలికలు కనిపించాయి.

**రాంబాబు అమాయకత్వానికి మచ్చుతునకలు:**

¨ కాలేజీలో ఫంక్షన్ జరిగింది. నేను మైకులో పాడాను. పాడుతున్నంత సేపూ జనం చప్పట్లు కొడుతూనే ఉన్నారు. ఈలలు కూడా కొట్టారు. పాపం సారధికి పాటంతా అయింతరువాత గానీ కొట్టలేదు చప్పట్లు. ఫీలయి వుంటాడు.

¨ శాంతారాం కొత్త పిక్చరొచ్చిందని వెళితే ఒకావిడ తామర పువ్వులో నుంచుని పువ్వులు జల్లుతోంది. ఈ పిక్చరిదివరకే చూశానని వచ్చేయ బోయాను. (శాంతారాం చిత్ర నిర్మాణ సంస్థ ఎంబ్లమ్ అది).

¨ "గోల్డ్‌రష్" చూశాను. చాప్లిన్ బాగానే చేశాడు. కానీ రాజ్‌కపూర్‌ను యిమిటేట్ చేయడం నాకు నచ్చలేదు. అది పాత సినిమా అని చెప్పారు. అంత పాతకాలంలో కూడా ఆయన రాజ్‌కపూర్‌ను యిమిటేట్ చేయడం ఇంకా ఘోరం.

**రాంబాబు తర్కం:**

¨ ఐన్‌స్టీన్ థియరీ ఏమిటి? ఇక్కడినుంచి అక్కడికి ఎంతదూరమో అక్కణ్ణుంచి ఇక్కడకు అంతే దూరం. ఇది తప్పని రుజువు చేయడానికి ఒక్క నిమిషం పట్టదు. 30వ తారీకుకి 1వ తారీకుకి తేడా ఒక్కరోజే. కానీ ఒకటో తారీకుకి 30వ తారీకుకి తేడా...?

¨ బస్సు కనిపెట్టింది కొలంబస్సని నా నమ్మకం. చరిత్రకారులు తనకు అన్యాయం చేస్తారని వూహించే కొలంబస్సు ఆ వాహనానికి తన పేరులో సగం పీకి బస్సు అని నామకరణం చేసి ఉంటాడు.

¨ అకాల వర్షాల వల్ల పంటలు పాడైపోతున్నాయని ఏడుస్తూ కూచోకపోతే శుభ్రంగా శీతాకాలంలో దుక్కిదున్ని విత్తనాలు జల్లుకుంటే వర్షాకాలం నాటికి పంట చేతికొస్తుందిగా!

¨ మహామహా డెబ్బై ఏళ్ల ముసలాళ్లే బస్సులో ఆడపిల్లల పక్కన కూచుంటే తప్పులేకుంటే, యువకులు కూచుంటే తప్పా?

¨ బస్సులో వస్తూ ఉంటే ఓ అమ్మాయి స్కాండ్రల్ అని తిట్టింది. ఆమెకు నా భుజం రాసుకుందిట. నాకు తెలీదు. అమ్మాయే చెప్పింది. అలా అని, అస్పృశ్యతా నివారణ చట్టం క్రింద ఆమె పై కేసు పెట్టాలని వాదించాను.

**పత్రికల భాష - రాంబాబు (అను)వాదం:**

¨ Forest Minister : - ఆటవిక మంత్రి

¨ Animal Husbandary Minister - పశుభర్తృత్వ శాఖ మంత్రి

¨ Fisheries Minister - చేపల మంత్రి లేదా జాలరి మంత్రి

¨ విమానంలో ఉండే బ్లాక్ బాక్స్ - కృష్ణ మంజూష

**అచ్చుతప్పులు:**

¨ మిథ్యాన్న పథకం (మధ్యాహ్న పథకం బదులు)

¨ మదావహం (ముదావహం బదులు)

**తెలిసి తెలియక ఉపయోగించడం వల్ల వచ్చే అ(న)ర్థాలు లేక రాంబాబు పద ప్రయోగాలు:**

¨ చిత్తశుద్ధితో పాటు 'దేహశుద్ధి' కూడా అవసరం. (దేహశుద్ధి అనేది తన్నడానికే ఉపయోగిస్తారు.)

¨ నా వ్యాసాలు చాలా 'హాస్యాస్పదంగా' ఉంటున్నాయని ఉత్తరాలు రావడం గర్వకారణంగా ఉంది. (హాస్యాస్ఫోరకంగా అని ఉండాలి.)

¨ మా ఎడిటర్ - తేనె పూసిన కత్తి. పయో 'ధర' విషకుంభం (పయోముఖ అని ఉండాలి).

¨ 'సాంస్కృతికంగా' కనిపించడం

¨ పోలీసులు ఆందోళనకారులను 'నిర్మానుష్యంగా' కొట్టారు. (అమానుషంగా అని భావం).

¨ ఏకోన్ముఖంగా నవ్వడం.

**రాంబాబుకి ఇంగ్లీషుతో చిక్కులు:**

¨ సిగరెట్లు మానేద్దామని, 'డోంట్ డ్రింక్ సిగరెట్స్', అని ఓ కాగితం మీద రాసి జేబులో పెట్టుకుంటున్నాను.

¨ పోస్టు గ్రాడ్యుయేట్లే అప్లై చేయాలని ప్రకటన వచ్చింది. పోస్టు ద్వారా చదువుకున్న వాళ్లే గ్రాడ్యుయేట్లు అయినట్టు వ్యవహరించడం అన్యాయం.

¨ వార్త ఇవ్వడానికి వచ్చిన ఒకాయనతో 'గివ్ మీ ఏ రింగ్ ఆన్ సెవెన్‌టీన్త్' అని న్యూసెడిటరు గారు, అనగా విన్నాను. ఇలా ఉంగరం అడగడం లంచగొండితనం కదాని వెళ్ళి ఎడిటరు గారికి చెప్పా.... ఫోన్ చేయమని చెప్పారని ఎడిటరు గారు వాదించారు.

¨ కపుల్ ఆఫ్ జర్నలిస్టు అంటే జర్నలిస్టు దంపతులు అని రాశా. తప్పుట.

**రాంబాబు తెలుగు:**

¨ నిరాహార దీక్ష చేసిన ఆయన గురించి రాస్తూ ఆయన శల్యావశిష్టులై పోయారు అని రాసారు ఎడిటరు గారు. నేను వెళ్లి మొహం మీద అడిగేశాను. ఆయన ఎంత గొప్పవాడైనా కావచ్చు. కానీ ఆయనను శల్యుడు, వశిష్టుడు మున్నగు పురాణ పురుషులతో పోల్చడం ఎంత మాత్రం బాగులేదు. పైగా అసందర్భం అని.

**అవకతవక ప్రపంచం గురించి రాంబాబు:**

¨ ఓ హోలు కెళ్లి సిగరెట్టు ముట్టించడానికి అగ్గిపెట్టె లేక, ఫైర్ అని రాసి ఉన్న ఎర్రబకెట్టు దగ్గరకెళ్లాను. చూస్తే ఇసుక, మేనేజరుని పిల్చి చివాట్లేశాను. ఇసుక అయితే ఇసుక అని రాయాలి గానీ నిప్పు అని రాయడం ఏమిటని.

¨ నాయకులకు మాట నిలకడ లేదు. గాంధీ గారి పుట్టిన రోజుకి ఆయన అడుగు జాడల్లో నడవమంటారు. ఇందిరాగాంధీ పుట్టిన రోజుకి ఆవిడ అడుగుజాడల్లో నడవమంటారు. ఓ సారి బోసు అడుగు జాడలంటారు.

¨ అసమర్థులకు ఉద్యోగం ఇవ్వకపోవడం అన్యాయం. వికలాంగులకు ఇచ్చినట్టే అసమర్థులకు సైతం కొంత కోటా ఉండాలి.

¨ అచ్చమైన బుడబుక్కలవాడు వస్తే పదిపైసాలైనా వేయకుండా తరిమేసి, స్టేజీ మీద ఫాన్సీ డ్రెస్ పోటీలో నకిలీ బుడబుక్కలవాడికి వెండికప్పు ప్రెజంటు చేయడం ద్వంద్వనీతి కాదా?

¨ మీనాక్షి శేషాద్రి జోరు ఎక్కువగా ఉంది కదాని సినిమా కెళితే మీనాక్షితో డాన్సులు, డ్యూయెట్లు అన్నీ మిథున్ చక్రవర్తే చేశాడు. మరి శేషాద్రి ఏ వేషం వేశాడో తెలియలేదు.

**ఇప్పుడు చెప్పండి మచ్చు చూశారుగా, ఇటువంటి విలక్షణ రచన చదవకపోతే మీరు ఏదో మిస్సయినట్టు ఫీలవరూ?**

-ఎమ్బీయస్ ప్రసాద్

ఈ పాటను వివరంగా కావాలని కోరినది శ్రీ ఎమ్. మల్లిఖార్జునరావు (విశాఖపట్నం)




| | |
|---|---|
| చిత్రం | : బాలరాజు (1948) |
| బ్యానర్ | : ప్రతిభా ప్రొడక్షన్స్ |
| రచన | : సముద్రాల సీనియర్ |
| సంగీతం | : గాలిపెంచల నరసింహారావు |
| గానం | : యస్.వరలక్ష్మి |
| అభినయం | : యస్.వరలక్ష్మి, అక్కినేని నాగేశ్వరరావు |

# ఓ బాలరాజా...



ఓ బాలరాజా
ఓ బాలరాజా
జాలి లేదా బాలరాజా.... ఆ... ఆ... ఆ....
బాలరాజా.... బాలరాజా... ॥ ఓ ॥
చలమేల .... మానరా
పరుగేలరా
నిన్ను మాని నిలువజాల
నా.... రాజ రాజ ఓ బాలరాజా
ఈడుజోడు దాన ॥ఈడు॥
నీదానవోయి జాణ ॥ఈడు॥
కదలకు రాజా ॥కద॥
నను వదలకు రాజా
మాయని మమతలు
మదిలో రేపి ఊపి ॥మాయ॥
మాయగ
మాయమయేనా పగలా వగలా
॥ఓ బాల॥

ఈ చిత్రానికి గాలిపెంచల నరసింహారావు సంగీత దర్శకుడే అయినా ఎక్కువ భాగాన్ని ఘంటసాలే చూసుకున్నారు. కనుక టైటిల్స్‌లో గాలిపెంచల నరసింహారావు పేరుతో పాటు ఘంటసాల పేరు కూడా జి.వెంకటేశ్వరరావు అని ఉంది. అయితే గాలిపెంచల నరసింహారావుకు సి.ఆర్.సుబ్బరామన్ ఆ రోజుల్లో అసిస్టెంట్‌గా ఉండేవారు. సి.ఆర్.సుబ్బరామన్ ఆర్కెస్ట్రా సమకూర్చే విధానం ఆయన్ని పట్టి ఇచ్చే విధంగా ఉండేది. ఈ 'బాలరాజా' పాటలో 'మాయని మమతలు మదిలో రేపి ఊపి" అనే వాక్యాల ముందు వచ్చే ఆర్కెస్ట్రయిజేషన్ శ్రద్ధగా గమనించండి. 'దేవదాసు' చిత్రంలోని సంగీతం గుర్తుకొస్తుంది.

గొంతులోను, పాడడంలోను విపరీతమైన శృంగారభావన కలిగిఉన్న గాయనీమణులు అటు ఉత్తర భారతంలో నూర్జహాన్, ఇటు దక్షిణ భారతంలో యస్.వరలక్ష్మి మాత్రమేనని ఆ రోజుల్లో చాలామంది అభిప్రాయపడేవారు.

ఎడిటర్‌గా ప్రసిద్ధుడై, ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వం వహించిన చిత్రాలలో 98 శాతం చిత్రాలను ఎడిట్ చేసి, ఆ తర్వాత దర్శకుడిగా ఓ నాలుగు చిత్రాలను కూడా నిర్మించి, ఇటీవల మరణించిన టి.కృష్ణతన తొలి రోజుల్లో కొన్నాళ్ళ పాటు ప్రజా ఉద్యమాలలో పాల్గొన్నందుకుగాను అండర్ గ్రౌండ్ జీవితాన్ని గడపాల్సి వచ్చిందది. ఆ రోజుల్లోనే 'బాలరాజు' చిత్రం రిలీజయింది. అందులోని ఈ పాటను వినడం కోసం చాలా రహస్యంగా బైటి కొచ్చేవారాయన. ఈ సినిమా తొలిభాగంలో అంజలీదేవి ఉంటుంది. ఆ తర్వాత అంతా యస్.వరలక్ష్మే ఉంటుంది. అంజలీదేవి అభిమానులు కొందరు సినిమాలో ఆమె నటించిన సన్నివేశాలు పూర్తి అయిపోగానే బైటికి వెళ్ళి పోయేవారు. వాళ్ళ దగ్గరుండే గేట్ పాసుల్ని కొనుక్కుని సినిమాలో మిగతాభాగాన్ని చూసేవారు టి.కృష్ణ. కేవలం యస్.వరలక్ష్మి పాడిన ఈ పాట కోసం ఆయన ఈ సినిమాని ఎన్నిసార్లు రహస్యంగా బైటికొచ్చి చూసేవారో లెక్కలేదు. ఎడిటర్‌గా ఆదుర్తి సుబ్బారావు వద్ద స్థిరపడ్డాక, ఆయన యస్.వరలక్ష్మితో 'కృష్ణ ప్రేమ' 1961లో తీస్తుంటే కేవలం ఆమెతో మాట్లాడే అవకాశం కోసం షూటింగ్‌కి ఆమెను పికప్ చేసుకునే బాధ్యతను నెత్తిన వేసుకొనేవారు టి.కృష్ణ

ఆ తరువాత యస్.వరలక్ష్మి ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం కోసం 'అంగే నా వరలమా' ('అక్కడికి నేను రానా' అని అర్థం) అనే ఓ ప్రైవేట్ గీతాన్ని పాడింది. ఆ పాట కూడా ఆమెకు తమిళనాట విపరీతమైన క్రేజ్ తెచ్చింది.

ఈ మధ్య 'రెఫ్యూజీ' సినిమాని తీసిన జె.పి.దత్తా తండ్రి ఓ.పి. దత్తా కూడా దర్శకుడే. తెలుగులో వచ్చిన 'సత్తెకాలపు సత్తెయ్య' (1969)ని హిందీలో 'మస్తానా' (1970)గా ఆదుర్తి సుబ్బారావు తీస్తున్నప్పుడు ఈ ఓ.పి.దత్తాని డైలాగ్ డైరెక్టర్‌గా నియమించుకున్నారు. అప్పుడాయనకి ఈ టి.కృష్ణతో స్నేహం కుదిరింది. టి.కృష్ణ దగ్గరున్న యస్వరలక్ష్మి పాటలు విని పిచ్చెక్కిపోయింది ఓపి దత్తాకి. 'ఎలాగైనా సరే ఈవిడతో సినిమా తియ్యాలి' అనే వాడట కూడా. ఇదిలా ఉండగా టి.కృష్ణకి 'ఉపాయంలో అపాయం' అనే చిత్రానికి దర్శకుడిగా అవకాశం వచ్చింది. ఆ చిత్రం 1967లో విడుదలయింది. అందులో హీరోయిన్ విజయనిర్మల ఒక ఇంటిలో బందీగా ఉంటుంది. ఆమెకు కాపలాగా ఓ వంటవాడు (చలం) ఉంటాడు. అతగాడిని ఎలాగైనా సరే లోబరుచుకొని విజయనిర్మల తప్పించుకొని పారిపోవాలి. అప్పుడామె ఓ పాట పాడాలి. ఆ సన్నివేశం కోసం వేరే పాటని రాయించి రికార్డు చేయించకుండా - ఈ 'ఓ బాలరాజా' పాటనే కొంచెం ప్యారడీగా మలచి పి.సుశీలతో పాడించారు టి.కృష్ణ. ఆ పాట 'ఓ బాలరాజా ఓ వంట రాజా తలుపు తీయవా రాజా... ఓ బాలరాజా' అని వుంటుంది. నిజానికి 'ఉపాయంలో అపాయం' సినిమాకి సంగీత దర్శకుడు కె.వి.మహదేవన్ అయినా ఈ ప్యారడీ పాటకు మాత్రం టి.కృష్ణ దగ్గరుండి పి.సుశీలకి ట్యూన్ చెప్పి మరీ పాడించుకున్నారు. అంత క్రేజ్‌ని అటు కళాకారులలోను ఇటు సామాన్య జనంలోను ఈ పాట ద్వారా సృష్టించుకొన్న 'బాలరాజు' చిత్రం ఆ రోజుల్లో 365 రోజుల పాటు ఆడింది.

# ఛలోక్తులు



బాలూ ఆలపించిన 'భగవద్గీత' ఆవిష్కరణ సభకు హాజరైన కొందరి గురించి తనికెళ్ల భరణి వేదికపై పలికిన పలుకులివి. కేవలం ఆ సభికులకు మాత్రమే పరిమితమైన ఈ చమత్కారాలను సాహితీప్రియు లందరూ పన్చుకుంటారని మా నమ్మకం.

**— తనికెళ్ల భరణి**

### ఆచార్య సి.నారాయణరెడ్డి (సభాధ్యక్షులు)

సి.నా.రె. అన్న పొడి అక్షరాలు
ఒట్టి పొడి అక్షరాలు కాదు.
పుప్పొడి అక్షరాలు.
అందుకే
సి-నా-రెని పిండితే
మకరందం జాలువారుతుంది.
"జొన్న రొట్టె మీద
వెన్న పూస పూసినారె
తెలుగు పాట బుగ్గమీద
చిటిక వేసినారె
ఇంతింతై విశ్వంభర
నంత చూసినారె
జ్ఞాన పీఠిపైన
జానపదములేసినారె"

### రామోజీరావు (ముఖ్య అతిథి)

ఈనాడు ఈటీవీ కతను మార్గదర్శి!
కృషితో సర్వస్వాన్నీ సాధించిన
మహర్షి!

### అక్కినేని నాగేశ్వరరావు (ప్రత్యేక అతిథి)

'దేవదాసు' నుండి 'కాళిదాసు' వరకు మనను
నవరసార్ణవాలలోన అక్కినేని ముంచు
నట సమ్రాట్ అంటేనే అభినయాల అంచు॥

### ఎం.ఎస్. రెడ్డి

మాట పెళుసు గాని
మనసు మల్లెమాల
కవితాత్మక వ్యాపారం
పరమాత్ముని లీల

### కోమటి జయరామారావు

అమెరికాన అన్నదాత
జయరాముడు కోమటి
సాంస్కృతిక విషయాలకి
బహుచక్కని పెనిమిటి

### జయప్రద

సత్యజిత్తురాయిని కరిగించినట్టి
సుందరి
మంటెత్తే అసెంబ్లీ మధ్యన మల్లె
పందిరి

### పుహళేంది

"స్వరాల మాలలల్లు వేళ
'మామ'కు కుడిచేయి
గురుదేవుని తలుచుకుంటు
గుండెలు తడిచేయి"
(అందరికీ కన్నులు తడిస్తే
ఈయనకి గుండెలు తడిసేయి)

### శ్రీ కోడూరి రామ్మూర్తి

"ఆస్ట్రేలియా నింజనీరు
రామమూర్తి గారు
ఖండాంతర మందు తెలుగు
కళలు పంచినారు"

### జస్టిస్ హనుమంతప్ప

న్యాయానికి న్యాయాధీశుడు
న్యాయాన్యాయాలను రెంటినీ చూడాలి
కళ్లకి గంతలు కట్టుకోవడానికతడు
న్యాయదేవత కాదు..... న్యాయమూర్తి!

"రామాయణమున మారుతి
ఉంగరానికి సాక్షి
భారతాన హనుమంతుడు
సంగరానికి సాక్షి"

## బాల గాంధర్వం

తూర్పున సుప్రభాతం
అయినట్టుంటుంది ఎస్.పి. గాత్రం
శివాలయంలో గంట మోగినట్టు
పవిత్రంగానూ....
శంఖం ఊదినట్టు
సహజంగానూ ఉంటుంది !!

నవరసార్ణవాన్ని
ఘనీభవింప జేసి
గొంతులో దాచుకున్న
సహస్ర కంఠుడు బాలు...!!

కొంతమంది అదృష్టవంతులకి
నాలిక మీద బీజాక్షరాల్ని
రాస్తుందట సరస్వతి....
కాని బాలు నాలికనే
శారదా పీఠం చేసుకుని
వెలిసిందా తల్లి 'స్వరస్వ'తి!!

తెలుగువాడికి ఆవకాయన్నా
గోంగూరన్నా -
ఏడుకొండలు వెంకన్నన్నా
ఎంతిష్టమో ...
బాలు పాట అంతకన్నా ఇష్టం!!

అందుకే...
తెలుగిళ్లలో
ఎక్కడ పెళ్లిళ్లు జరిగినా
తోరణాలతో పాటు
బాలు పాటల్ని కడతారు!!

శోభనాల గదిలో
పాల గ్లాసు పక్కన
బాలు క్యాసెట్ పెడతారు!!

పాపాయి ఏడుస్తోంటే
ఎక్కణ్ణించో బాలు గాలిలో
లీలగా తేలుతూ వచ్చి
జోల పాడతాడు.....!!

బాలు బొండుమల్లెంటి మనిషి....
స్నేహ పరిమళాల్ని వెదజల్లుతాడు....!!

బాలు అందరికి ఇంట్లో మనిషి
ఎవరన్నా ఏడుస్తోంటే
పాటల చూపుడు వేలితో
కన్నీరు తుడుస్తాడు!!!

# న్యూస్ వ్యూస్

## ఉవాచ

నచ్చిన పని దొరికినవాడు అదృష్టవంతుడు దొరికిన పనిని నచ్చించుకున్నవాడు మధ్యముడు. ఇటు నచ్చిన పని దొరకనివాడు, దొరికిన పని చేయలేనివాడు దురదృష్టవంతుడు.

-అల్లు రామలింగయ్య

"పళ్ళు తోముకునేటప్పుడు ఒళ్ళు తోముకోం"

-సి.నారాయణరెడ్డి

(ఇన్ని పదవులు, కార్యక్రమాలు నిర్వహిస్తూ సినిమా పాటలెలా రాసేవారన్న ప్రశ్నకు సమాధానంగా)

"అన్నమయ్య, త్యాగయ్య వంటి వాగ్గేయ కారుల పాటలకు ఇంకో పల్లవులు రాయలేక కాదు! ఆ మహానుభావుల 'చరణాలు' అక్షరరూపంలో పట్టుకోవడానికి వారి పల్లవులొకటే నాకు శరణ్యం".

-వేటూరి సుందరరామ్మూర్తి.

"క్లాసికల్ మ్యూజిక్ పాప్యులరైజ్ అవ్వాలంటే క్లాసికల్ సింగర్స్ సందర్భం వచ్చినప్పుడు - నౌషాద్ ఇదివరలో పాడించినట్టు - సినిమాల్లో పాడాలి. ఒక మెహఫిల్‌కి నేను మూడు లక్షలు తీసుకుంటాను. సామాన్య ప్రజలు అంత ఖర్చు ఎలా భరించగలరు. చెప్పండి? అదే సినిమాల్లో పాడితే అందరికీ అందుతుంది."

-కిషోరీ ఆమోంకర్

"ఇట్లు, శ్రావణి....'లో ప్రేమికులు ఆత్మహత్య చేసుకునేందుకు ముందున్న ఘట్టంలో మామూలుగా అయితే విషాదగీతం ఆలపిస్తారు. కానీ నేను వెరైటీగా ఉంటుందని మెలోడి డ్యూయెట్ పెట్టాను. ఇలా కొత్త పుంతలు తొక్కడం వల్లనే ఇళయ రాజా, రెహమాన్ తమ కంటూ ఓ స్థానం పొందగలిగారు. నా ఆశయం అదే".

- చక్రి

లాడెను వెతుకులాటలో అందాల గాయనీ మణులు కూడా చేయి కలుపుతున్నారు. బ్రిటిష్ మిలటరీకి చెందిన 7,000 మంది ఒమాన్‌లోని హిల్టన్ హోటల్లో బస చేసి వున్నారు. 'ఆపరేషన్ స్విఫ్ట్ స్వోర్డ్' అనే కోడ్ వర్డ్ గల వారి ప్రాజెక్టు లక్ష్యం తాలిబన్లను ఓడించి లాడెన్‌ను పట్టుకోవడం. లాడెన్ దొరికే వరకు వారు నిరుత్సాహంగా కూచోకుండా తన గానంతో వారిని హుషారు చేయడానికి జెరీ హేలీవుల్ నడుం బిగించింది. 'స్పైస్‌గర్ల్స్' గ్రూపు ద్వారా ప్రజలలో చక్కని స్థానాన్ని సంపాదించుకున్న ఈమె ప్రస్తుతం ఆ గ్రూపు నుండి విడిపడి విడిగా వచ్చేసింది.



ఫిలిప్స్ కంపెనీవారు వారి కొత్త పోర్టబుల్ సిడీ ప్లేయర్‌ను మార్కెట్లోకి ప్రవేశ పెట్టారు. ఎజెడ్ 1030 పేర మార్కెట్ చేస్తున్న ఈ ప్లేయర్‌లో సౌండ్ అవుట్‌పుట్ 100 వాట్స్. దీనిలో ఎ.ఎమ్. ఎఫ్.ఎమ్ రేడియోలతో బాటు 20 ట్రాక్ మెమరీ ఉంది. దాని వల్ల 20 పాటలు ఏ వరుసలో కావాలంటే ఆ వరుసలో వినవచ్చు.

ధర: 4,990.00 రూ.లు.

ఘోస్ట్‌రైటర్స్ సాధారణంగా నోరు విప్పరు - సాక్ష్యాలుండవు కాబట్టి, నోరు మూసుకోవడానికి అవసరమైనంత డబ్బు ఇస్తారు కాబట్టి. కానీ తాబీష్ రోమానీ కథే వేరు.

ఇటీవల విడుదలైన 'అజ్‌నబీ'లో నేనొక పాటరాసినా, దాన్ని కూడా సమీర్ ఎక్కౌంట్‌లో వేసేశారు' అని ఫిల్మ్ రైటర్స్ అసోసియేషన్‌కి ఫిర్యాదు చేశాడు తాబీష్. ఇదేకాదు 'మొహబ్బత్‌కే ఆర్జూ', 'తేరాజాదూ చల్‌గయా' సినిమాలో టైటిల్‌సాంగ్, 'చాంద్ తేరీ చాందినీకా కసమ్' పాట కూడా తను రాసినవే అంటాడాయన. ఘోస్ట్ రైటర్సు ఇలా తిరగబడతారని తెలిస్తే వాళ్లకు భవిష్యత్తులో భూత జీవితం కూడా లేకుండా చేస్తారేమో!

టీవి వచ్చి రేడియోను, పత్రికలను పూర్తిగా తుడిచి పెట్టేసిందనుకొనే వాళ్లు ఉలిక్కిపడే గణాంకాలివి. ఎఫ్.ఎమ్ రేడియో రంగంలో ప్రైవేటు సంస్థలను అనుమతించాలని ప్రభుత్వం అనుకోగానే అనేక కంపెనీలు దూకుడుగా వచ్చేశాయి. కానీ ఏదాది తిరక్కుండా వెనక్కి తగ్గాయి. స్టార్ ఇండియా వాళ్లు మాత్రం ధైర్యంగా బెంగుళూరులో 'రేడియో సిటీ' అనే పేర ఈ జులై 3న ఎఫ్.ఎమ్ రేడియో మొదలు పెట్టింది. ప్రారంభించిన నెల్లాళ్లకు ఓ సర్వే జరిపించింది. వారు సేకరించిన వివరాలివి. కొందరు వారాంతాల్లో వినే సమయం ఎక్కువ. చాలామంది వేరేపని చేసుకుంటూ రేడియో వింటారు. ఇళ్లల్లోయితే మరీను. 12 సం॥ వయసు పైబడ్డ వారికి రేడియోతో సాన్నిహిత్యం ఎక్కువ. ప్రైవేట్ ఎఫ్.ఎమ్ రేడియో మహిమ ఇది. ఇదివరకయితే 30కి పైబడ్డ వాళ్లే వినేవారుట.

హిందుస్తానీ శాస్త్రీయ సంగీతానికి ప్రాముఖ్యం కలిగించడానికి వర్జిన్ రికార్డ్ (ఇండియా) వారు తాజ్ గ్రూపుతో ఒక ఒప్పందానికి వచ్చారు. దాని ప్రకారం అయిదు ఊళ్ళల్లోని తాజ్ హోటల్స్‌లో ప్రముఖ హిందుస్తానీ సంగీత కారులచే కచ్చేరీలు జరుగుతాయి. 'తాజ్ హెరిటేజ్ సిరీస్' పథకం క్రింద జరిగే ఈ కచ్చేరీలను రికార్డు చేసి ఆడియో టేపులుగా, సిడీలుగా విడుదల చేసే పని వర్జిన్ రికార్డ్స్ వారిది. ఈ సిరీస్‌లో మొదటిది సెప్టెంబరు 26న ముంబయిలో బనారస్ ఘరానాకు చెందిన రాజన్, సాజన్ మిశ్రాల గాత్ర కచ్చేరి జరిగింది. తక్కినవి జోధ్‌పూర్‌లో విశ్వమోహన్‌భట్, జైపూర్‌లో హరిప్రసాద్ చౌరాసియా, హైదరాబాదులో భీమ్‌సేన్ జోషి, వారణాశిలో గిరిజాదేవి. ఈ సిరీస్ హిందుస్తానీ రంగంలోని ఉత్తమోత్తమమైన కళాకారుల ప్రతిభకు అద్దం పడుతుందని వ్యాఖ్యానించారు - వర్జిన్ రికార్డ్స్‌లో క్రియేటివ్ డైరెక్టర్‌కు చెందిన శుభాముద్గల్!

## అయ్యో పాపం ఆలియా



ఆలియా అనే అమెరికన్ నటీమణి, గాయని విమాన ప్రమాదంలో ఇటీవలే మరణించిందని వినే వుంటారు. ఇంతకూ ముందు కూడా అనేక మంది మ్యూజిక్ స్టార్స్ కూడా విమాన ప్రమాదాలకు బలైపోయారు. వారిలో కొందరు - గ్లెన్ మిల్లర్ (1944) బడ్డీ హోలీ రిచర్డ్‌సన్, రిచ్చీ వేలెన్స్ (1959) - ఓటిస్ రెడ్డింగ్ (1967), జిమ్ క్రోస్ (1973) - లైనర్డ్ స్కైనర్డ్, స్టీవ్ గైన్స్ (1977) - జాన్ డెన్వర్ (1997), 'మ్యాట్రిక్స్' హీరోయిన్‌గా అందరి దృష్టినీ ఆకర్షించిన ఆలియా (పూర్తిపేరు ఆలియా హాఫ్‌టన్) పాపం 22వ యేటే దుర్మరణం పాలవడం విషాదకరం. చిత్రం ఏమిటంటే 1994లో మిలియన్ కాపీలు అమ్ముడుపోయిన ఆమె తొలిగీతం పేరు - ఏజ్ ఏయింట్ నథింగ్ బట్ ఎ నెంబర్.

# అలనాటి హాస్యకుటుంబం




(ఎడమనుండి కుడికి వరుసగా...) రావి కొండలరావు, మోతుకూరి సత్యం, రామచంద్రరావు, కె.వి.చలం, చలం, బాలకృష్ణ, రాజబాబు, సీతారాం, రమణారెడ్డి,రేలంగి, పద్మనాభం,అల్లు రామలింగయ్య, కాకరాల, పొట్టి ప్రసాద్, గణేష్

(విజయచిత్ర సౌజన్యంతో)

